TANJORE SARASWATHI MAHAL SERIES No 22.

# KUSALAVOPAKHYANAMU

BY

## RAMANARYA

### A DWIPADA KAVYA

Critically Edited

BY

Sri V. SUNDARA SARMA,
*Pandit, Saraswathi Mahal Library, Tanjore*

PUBLISHED
BY
SRI S. GOPALAN B.A., B.L.,
*Honorary Secretary,*
*for the Administrative committe,*

T M.S.S M LIBRARY, TANJORE

1951

Price Rs. 3-0-0

తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణము. 22.

# కుశలవోపాఖ్యానము

కవివర రామనార్య విరచిత

ద్విపదకావ్యము.

పరిష్కర్త

శ్రీ విరలదేవుని సుందరశర్మ,

పండితుఁడు, సరస్వతీమహల్ గ్రంథాలయము,

తంజావూరు

తంజావూరు సరస్వతీమహల్

గ్రంథాలయనిర్వాహకసంఘార్థమై

గౌరవకార్యదర్శియగు

శ్రీ S. గోపాలన్, B. A., B. L. గారిచే

ప్రచురింపబడినది.

1951

మూల్యము] [రూ. 3-0-0.

# PREFACE

This publication gives in Telugu the story of Sri Rama's Asvamedhayaga (Horse-sacrifice) during Sita's exile in the hermitage of Sage Valmiki. The story as found here, namely, the Victorious fight of LAVA and KUSA the sons of Rama, with Satrughna and his troops who were guarding the sacred horse dedicated for the sacrifice, and their later victory over Lakshmana, Bharata and Rama himself, all without recognising one another, do not form part of the story in the Uttarakanda of Valmiki's Ramayana. This is found in the Jaimini Bharata, an Upapurana in Sanskrit.

There is a Telugu version of Jaimini Bharata in the form of a Prabandha kavya by Pina Viranna But the author of the present work follows the original work in Sanskrit except in one or two minor particulars.

The present work is a Dvipada Kavya and the style is ornate with plenty of colourful descriptions, and a free use of Sanskrit compunds. The name of the author is found in the introductory part of the work with a short note about his ancestory. RAMARAYA the author is the son of Oubhalamantri of Lavanuru, and the resident of the village Nandanagara Agrahara. He calls himself an adept in Sangita & Sahitya, and refers to his brothers Siddhana Mantri and Singanaraya, and to his preceptor Vinjamoori Tirumalacharya. But the period to which the author belonged is not traceable from the details given, as there is no reference in them to any King, or well-known patron

or well-known poet. From the style, we can assign the author to a date not later than the 16th century.

There appears to be no other Dvipada Kavya dealing with the same subject. This edition is based on three manuscripts of the work preserved in the Saraswâthi Mahal Library, viz. M. 240, 241, and 242 (D. 296, 297, 298). The first manuscript contains the full text but not the introductory verses. The 2nd manuscript opens with the introduction but is incomplete at the end. The first few leaves are however in a very damaged condition. The third manuscript wants a portion at the begining, including a portion of the text. All the 3 manuscripts have therefore been drawn upon for eiditing this work. There are 3 manuscripts of this work in the Oriental Manuscripts Library, Madras ; but they are found to be mere copies of the 3 manuscripts of this Library. The lacunae that are found in the introduction could not therefore be filled in.

The Editor Mr. V. Sundara Sarma, Telugu Pandit of our Library, has edited the work with an indroduction and has spared no pains in getting at the correct text. Our thanks are due to him for his services

Our grateful thanks are due to the Government of Madras for their liberal grants that have enabled us to publish this and other valuable manuscripts, of the Library.

Saraswathi Mahal Library, Tanjore, 9-2-1951. } S. GOPALAN, Honorary Secretary.

# సూచన

ఈతంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమునందలి M. 240 సంఖ్యగల కుశలవోపాఖ్యానముయొక్క తాళపత్రప్రతి ప్రస్తుత పరిష్కరణమునకు మాతృక. తక్కిన రెండు తాళపత్రప్రతులీక్రిందఁ గనిన రీతిగ సంజ్ఞితములైనవి. M. 241. కుశలవోపాఖ్యానము. "క". M. 242. కుశలవోపాఖ్యానము. "ఖ".



# తప్పొప్పుల పట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 19 | 3 | జననిప్రవాస | జననీప్రవాస |
| 152 | 15 | లక్ష్మసేనలఁ | లక్ష్మణసేనలఁ |
| 212 | 1 | వేండియు | వెండియు |
| 150 | 10 | కలుఁగుట | కలఁగుట |



# ఉపోద్ఘాతము.

తంజాపురాంధ్ర సామ్రాజ్యమంతరించి సుమారు మూఁడు శతాబ్దములైనప్పటికిని తత్సామ్రాజ్యసంస్థాపనాధురీణులగు నాంధ్రనాయకమహారాజు లాంధ్రభాషాభివృద్ధికై నొనర్చిన కృషి కేకైకనిదర్శన మీతంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమనుటలో నతిశయోక్తి గానఁబడదు. తంజావూరులో నాంధ్రనాయకరాజుల యనంతరము మహారాష్ట్రుల పరిపాలన మేర్పడినతర్వాత మహారాష్ట్రరాజులలో నొకఁడైన శరభోజి మహారాజు (1800 – 1832) కాలములో నీ గ్రంథాలయ మత్యంతాభివృద్ధిని గాంచినందున నీగ్రంథాలయమునకు "తంజావూరు మహారాజా శరభోజీ సరస్వతీమహాల్ గ్రంథాలయ"మను పేరేర్పడినది. నాయకరాజు లాంధ్రభాషాభివృద్ధికై జేసిన నిరుపమమగు సేవ మరువరానిది. ముఖ్యముగ స్వర్ణయుగ మన నొప్పు శ్రీ రఘునాథనాయక శ్రీ విజయరాఘవనాయకుల కాలములో నాంధ్రభాషామతల్లి సర్వసౌభాగ్యములతో విలసిల్లినది. పూర్వకవులచే రచింపఁబడిన యనేకగ్రథములను సేకరించియు, సమకాలికులైన కవులయొక్క గ్రంథములను భద్రపఱచియు, తామే స్వయముగఁ గొన్నిగ్రంథముల రచించియు, కవులఁ గవయిత్రులు గ్రంథనిర్మాణార్థమై ప్రోత్సహించియు నామహామహులు తమ జీవితమును సార్థకముఁజేసిరి.

రఘునాధనాయకుని కుమారుఁడగు విజయరాఘవనాయకుని లేఖిని సుమారు యేబదికిఁబైఁబడిన గ్రంధములను సృష్టించి

నది. ఇతని యాస్థానమున స్త్రీలుకూడ కవయిత్రులై యుండిరి. వారలలో నొకతెయే రంగాజమ్మ ఈమె "ఉషాపరిణయ" మను ప్రబంధమును రచించినది. (ఈ ప్రబంధము త్వరలోఁ బ్రచురితము కాగలదు.)

ఇట్లాంధ్రనాయకరాజులచేఁ బాలింపఁబడి బహుముఖా దరమునుఁ బొంది వర్ధిల్లిన యీసరస్వతీమహల్ గ్రంథాలయము మహారాష్ట్రరాజుల కాలములో సర్వతోముఖాభివృద్ధిఁ జెంది శోభించినది. బహుగ్రంథకర్తయగు శ్రీ శాహమహారాజే యిందు లకుఁ బరమనిదర్శనము.

అతిమేధాసంపన్నులగు కవీశ్వరులచే రచింపఁబడిన యపూర్వగ్రంథములన్నియుఁ దాళపత్రమయము లగుటచే సర్వ దుర్లభములగుటయే కాక యతిప్రాచీనములగు నాగ్రంథములు జర్జరావస్థనుఁ బొందియుండు సమయంబునఁ దద్గ్రంథప్రచుర ణార్థము ప్రభుత్వమునుండి యార్థికసాహాయ్యము లభించుట యాంధ్రమహాజనులకు ముదావహమైన విషయమగుటయే కాక యాంధ్రనాయకరాజులయొక్క ఆశయసిద్ధికై మన ప్రభుత్వము తోడ్పడుట గర్వించఁదగిన విషయమనుటలో సందేహము లేదు ప్రభుత్వార్థికసాహాయ్యమునఁ బ్రకటింపఁబడు ప్రముఖగ్రంథ ములలో నీకుశలవోపాఖ్యాన మొకటియగుట మనభాగ్యవశ మనియే చెప్పనొప్పును.

## —: గ్రంథకర్త :—

ఈకుశలవోపాఖ్యానమును రచించిన కవి రామనార్యుఁడు. శోభళామాత్యుని కుమారుఁడు. సిద్ధన సింగనల యనుజుఁడు.

నియోగిశాఖలో నందవరీక కుటుంబమునకుఁ జెందినవాఁడు. వింజ మూరి తిరుమలాచార్యుల శిష్యుఁడని కవి స్వయముగాఁ జెప్పు కొనుచున్నాఁడు. శ్రీ రామునకుఁ దనకథను వినుటకంటెఁ దన యుల చరితమును వినుటయం దాసక్తి మెండని యంతర్యామి యగు నీశ్వరుఁడు ప్రబోధింపఁగా నీకవి శ్రీ రామాంకితముగాఁ గుశలవోపాఖ్యానమునుఁ జేసెననియుఁ జెప్పికొనియున్నాఁడు.

ఈకవిని గుఱించిన చారిత్రకాధారములకైఁ జేసిన ప్రయ త్నములన్నియు విఫలములైనవి. ఇతఁ డేకాలమున నెచ్చట నుండె నని తెలిసికొనుటకుఁ దగిన యాధారములు దొఱకలేదు. ఇతని తండ్రియొక్క నామధేయమును గమనించుచో "సౌభళా మాత్యుఁడ"నియు, "సౌభళమంత్రి" యనియును నహోబ ళుఁడను నామమునకు "మంత్రి" యనికాని "అమాత్యుఁడ"ని కాని సచివపర్యాయమగు పదమునుఁ జేర్పఁగా "నహోబళ మంత్రి" యను నామము జనులయొక్క వ్యావహారికభాషలో "సౌభళమంత్రి" యని యేర్పడియుండవచ్చును. కాని యీ యహోభళామాత్యుఁ డేరాజునాశ్రయించియుండెనో విశదముగాకు న్నది. కవి తననామధేయము నెఱుకపఱచుచు

"కవి రామనార్యవిఖ్యాతుండ ఘనుఁడఁ
గవిరాజమిత్రుండ గౌరవోన్నతుఁడ"

అని చెప్పకొనెను. మఱియుఁ దనకావ్యము నేరాజునకును నంకిత మొనర్పక శ్రీరామునకు నంకితముఁజేసెను

ఇట్టి విఖ్యాతప్రజ్ఞుఁడగు కవివర్యునియొక్క కాలస్థాన ములనుగుఱించి వివరములు తెలియకపోవుట చారిత్రికుల బల

హీనతనుఁ జూపుచున్నది. ఈసరస్వతీమహాల్ గ్రంథాలయము లోని M. 241 నెంబరు గలిగి ప్రకృతపరిష్కరణముద్రిష్టా "క" సంజ్ఞఁగల తాళపత్రమయమైన కుశలవోపాఖ్యానగ్రంథ మందు, లభ్యమగు నుపోద్ఘాతమందుఁ గవి తనవంశమునుగుఱించి కొంతఁ దెలియపఱచియున్నాఁడు. కాని యాభాగముకూడ గ్రంథముయొక్క జర్జరావస్థనుబట్టి యసంపూర్ణముగ దొఱకుటయు మన దౌర్భాగ్యమే. ఆభాగ మీాక్రిందఁ బొందుపఱుపఁ బడియున్నది.

"......... డనారాయణ గౌశికగోత్రుఁ
బ్రాచీనవేదమార్గ ...................
పౌత్రుని (సు) గుణ తప్పరు నయ్యలార్యుఁ
బుత్రుఁ బవిత్రు అంబ ............
నిరుపమసత్కృపానిధి వింజమూరి
తిరుమలాచార్యుఁ గీర్తింతు ......
...... బ్రహ్మయ చతురాస్యుఁడనఁగ
వరకీర్తినొప్పు నేవరపితామహ ...
......... మంత్రి యఖలనియోగి
జనసేవ్యుఁ డెవ్వని జనకుఁడై వెలయు
ధాత్రిలోనెవ్వఁ డుత్తము ............
గోత్రుఁడై యు ...............
...................... ండు
భూతలంబున పందపురవంశఘనుఁడు
అతిలోకనుతునకు నాయతపుణ్యమైన
...... కుఁ దనూభవుఁడైన యతని

అనఘుబ్రహ్మాయసిద్ధనామాత్యవరుని
యనుజుని దుర్గాంకు నగ్రసంభవుని
మండితగుణశాలి మాచయప్రోలి
గుండయ రామనాంకునకుఁ బుణ్యునకు
నరనుత చిలుకలనారయపుత్రి
చిరకీర్తి నికురుంబ సిరియమాంబకును
నెమ్మి రెట్టింప జనించినయట్టి
అమ్మకు హృదయేశ్వరుండైన యట్టి
వీతకళంకుఁడై విలసిల్లుచున్న
మాతండ్రి యాభళామాత్యు భావింతు
అని యిష్టదేవతాప్రార్థనఁ జేసి
యినుమడించిన మతి నెసఁగినవాఁడ
మార్తుర గెలిచి రామాయణచక్ర
వర్తినిఁ గీర్తిమై వర్తించువాఁడ
సిద్ధన మంత్రికి సింగనార్యునకుఁ
దద్దయు కూరిమితమ్ముఁడౌ ఘనుఁడఁ
గవి రామానార్య విఖ్యాతుండ ఘనుఁడఁ
గవిరాజమిత్రుండ గౌరవోన్నతుఁడఁ
నరయంగ సత్కవి యగుటకు ఫలము
హరికీర్తనమెకదా! యని విచారించి
కవికులమణి! రామకావ్యంబుఁజెప్పి
రవికులమణియైన రాముని కిమ్ము
రామచంద్రునకు శ్రీరామాయణంబు
ప్రేమంబు మఱియుఁ జెప్పెద రహస్యంబుఁ

దనపేర్మి వినుకంటెఁ దనయులపేర్మి
వినుట తండ్రికిఁ గడువేడుక గాన
దశరధసుతునకుఁ దనకధకంటెఁ
గుశలవకధమీఁదఁ గుతలంబువేడ్క
యనుచు నంతర్యామియగు నీశ్వరుండు
నను బ్రబోధించిన నంచితభక్తి
శ్రీ యురంబునగల్గి చెన్నొందు నభయ
దాయకునకు జగత్త్రయనాయకునకు''

రామనార్యుఁడు కుశలవోపాఖ్యానముఁగాక మరేగ్రంథ మును రచించినట్లు తెలియుటలేదు అట్లుండిన నీగ్రంథమందు నద్దానిని జేర్కొనకుండునా? ఒకవేళ కుశలవోపాఖ్యానమును విరచించినపిదప మరేగ్రంథమునైనను రచించెనేమోగాని దానికిఁ దగిన యాధారములు గానరావు.

—: కుశలవోపాఖ్యానము :—

ప్రకృత మాంధ్రభాషామయమైన యీకుశలవోపాఖ్యానము జైమినిభారతములోని యశ్వమేధ పర్వాంతర్గత ప్రాస్తావికోపాఖ్యాన రూపమగు గుశలవచరితమునకు స్వతంత్రానువాదము. ఈ విషయమును విస్పష్టముగఁ గవియే చెప్పియున్నాఁడు. ఆ భాగము లీక్రింద నివ్వఁబడియున్నవి.

'' మేఘనీలద్యుతి మెయి నుల్లసిల్లు
రాఘవునకును మార్గణలాఘవునకుఁ
దెలియ విన్నపముగా ద్విపదరూపమునఁ
బలికెదఁ గుశలవోపాఖ్యాన మెలమి

నని చెప్పఁబూనితి నారఘూత్తముని
మనమున నిల్పి యిమ్మాట్కినిట్లంటి. ”

కుశలవోపాఖ్యానము. పద్య. 1-3.
(పూర్వభాగము)

“సకలంబు సూతుండు శౌనకాదులకుఁ
బ్రకటించెనని యంధ్రభాష యొప్పలర
శ్రీముకుందార్చనశీలుండు సుకవి
రామనార్యుఁడు కవిరాజమిత్రుండు
నీకుఁ బ్రియంబుగా నిఖిలైకధామ !
కాకుస్థకులరామ ! కల్యాణరామ !
సమధురరీతిమై జైమినిభార
తమున విస్తరము విస్తారంబుగతుల
నలవడఁ గుశలవోపాఖ్యానకమునఁ
బలికితి నీపూర్వభాగంబు వినుము”

కుశలవోపాఖ్యానము. పద్య. 704—708
(పూర్వభాగము)

“నీకుఁ బ్రియంబుగా నృపసార్వభౌమ!
కాకుస్థకులరామ! కల్యాణరామ!
సమధురరీతిమై జైమినిభార
తమున విస్తరము విస్తారంబుగాఁగ
నలవడఁ గుశలవోపాఖ్యానకమునఁ
బలికితి నుత్తరభాగంబు సరవి

నాచంద్రతారార్క మాచక్రవాళ
మాచంద్రతారార్కమై యొప్పఁగాత."

కుశలవోపాఖ్యానము. పద్య. 1291-1294
(ఉత్తరభాగము)

## —: అనువాదము —

జైమినిభారతములోని కుశలవచరితము ననువాదము చేయుపట్ల కవి కొన్నిమార్పులనుఁ బ్రవేశపెట్టియున్నాఁడు.

శ్రీరాముఁడు రావణాదుల సంహరించి యయోధ్యకు వచ్చి కౌసల్యకు మ్రొక్కఁగాఁ గౌసల్య రాక్షసబాణములచే క్షతగాత్రుఁడైన కుమారునిఁ జూచి మిక్కిలి చింతించుచుఁ దనకరములచే శ్రీరాముని దేహమును స్పృశింప శ్రీరాముఁడు గతక్షతుఁడైనట్లు మూలమునఁ గానఁబడుచున్నది. కాని యనువాదమునందు వేరు విధముగఁ గన్పట్టుచున్నది.

జైమినిభారతము (అశ్వమేధపర్వము.)

"కౌసల్యాం జననీం పశ్చాన్నమస్కర్తుమగాచ్చ సః ।
మలినాం పంకదిగ్ధాంగీం రామదంశ్నలాలసామ్ ॥
భర్తృదుఃఖపరిక్లిన్నాం హర్షితాం రామదర్శనాత్ ।
దృష్ట్వా పద్మపలాశాక్షం రామం హర్షసమన్వితా ॥
పరిరభ్య చిరం తస్థౌ ధనం ప్రాప్యాధనో యథా ।
స్నాపయంతీ దృగంభోభిః స్నేహేన బహునా సుతమ్ ॥
విశేషేణ జటావంతం చిరం స్నానమవర్తయత్ ।
తతో రామం కరాగ్రేణ పస్పర్శ జననీ తథా ॥

రాక్షసాస్త్రక్షతం దృష్ట్వా ప్రోవాచ వచనం శుభమ్ ।
వసిష్ఠప్రముఖా రామం వదంతి కిమిదం వచః ॥
అచ్ఛేద్యోయమభేద్యోయమక్లేద్యోయం సుత స్తవ ।
తదిదానీం వృథా మన్యే బాణైర్భిన్నోఽసి రాఘవ ॥
అథవా శివభక్తం త్వామూహుః కేచిన్మునీశ్వరాః ।
తస్మాద్దత్తం త్వయా స్థానం బాణానామితి మే మతిః ॥
స్పృష్ట్వా తదంగం కౌసల్యా స్వపాణిభ్యాం దయావతీ ।
ఆనందం పరమం ప్రాప్తా జ్ఞానం లబ్ధ్వేవ బ్రాహ్మణః ॥
తత్కరస్పర్శతో రామో ముక్తో దుఃఖైస్సుదారుణైః ।

జైమినిభారతము. అశ్వమేధపర్వము. అధ్యా 25. శ్లో. 11-19

"అరుదైన పతివియోగాగ్నిచేఁ గుంది
పరిలిప్తభూరేణుపటలాంగి యగుచు
నెప్పుడు చూతునో యేఁ బుత్రు ననుచుఁ
దప్పక యుండంద తను వచ్చుత్రోవఁ
గనుఁగొను యతిపుణ్యకాంతామతల్లిఁ
దనుతరతనువల్లిఁ దమతల్లిఁ గాంచి
కడలేనిభక్తితోఁ గడుసంతసమున
ముడివడ నందంద మ్రొక్కి; మ్రొక్కుటయుఁ
గన్నారఁ గనుఁగొని కడుఁబేదరాలు
పెన్నిధిఁ గన్నట్లు ప్రియమందె జనని
చేకొని పట్టాభిషేకంబు నీకు
నోకుమారక ! యింక నుచిత మన్నట్లు
నందనుమీఁద నానందబాష్పంబు

చిందంగఁ గౌఁగిటఁ జేర్చి మేనెల్ల
బ్రమదంబుతో నిజపాణిపద్మమునఁ
జమరి రాక్షసశరక్షతములఁ గాంచి
అనఘ ! రాఘవ ! వసిష్ఠాదిసంయములు
ననుఁ జూచి నీప్రియనందనుండెందు
నవిభేద్యుఁ డక్లేశుఁ డఖిలేశుఁ డనుచు
వివరించి పలికిరి విమలవాక్యముల
వివిధబాణక్షతావృతు నిన్నుఁ జూచి
యవి నేఁడమోఘంబులై తోఁచె నాకు
నదిగాక మరి నిన్ను నఖిలవేదార్థ
విదులు నీమహిమల వివరింపలేరు.
అటులయ్యు నీక్రియ నన్న ! నీమేనుఁ
జటులరాక్షసబాణచయమెట్లు నాటె
నని శోకమునఁ బొంది యట వివేకించి
యనియె రాఘవుతోడ నపుడు కౌసల్య
శోకార్తయై మీఁదుఁ జూడక యంటి
గాక యమ్మునుల వాక్యములేల తప్పు
రావణాదుల సంగరంబున నోర్చి
నీవు వచ్చితిగాన నిజమయ్యె నేఁడు "

కుశలవోపాఖ్యానము. పద్య. 43-58.
(పూర్వభాగము)

పై మూలానువాదములను సూక్ష్మముగఁ బరిశీలించినచో మూలములోని భాగము లనువాదములో నెంతమార్పుఁ జెందిన దో విశదము కాఁగలదు. శ్రీరాముని దేహమందలి రాక్షసబాణ

క్షతములు కౌసల్యాకరస్పర్శముచేఁ దొలఁగుటను గవి యనువా దముఁ బేర్కొనియుండలేదు. పైఁబడి "శోకార్తిమైమీఁదుఁజూడక యంటి" ఇత్యాది కౌసల్యావాక్యములకు మూలమున నాధా రములేదు.

"నమస్కృత్య తతో బంధూన్ పప్రచ్ఛ కుశలం చ తాన్ :
హర్షితో భ్రాతృభిస్సర్వై రయోధ్యాయామువాస సః ॥
పాలయన్ పృథివీం సర్వాం సశైలవనకాననామ్ ।
ప్రజాః స్వస్థాహ్యవర్తంత విప్రా వేదపరాయణాః ॥
ఆత్మతృప్తేశ్చ పయః పీత్వా వత్సా యత్రోపరేమిరే ।
గోపాలా దుదుహుస్తత్ర ఘటోధ్నీర్గాశ్శుభాస్తదా ॥
ఔషధ్యః ఫలవత్యస్తా దుష్కాలాదేర్వినాశకాః ॥
సరయూతీరమాసాద్య యజ్ఞాన్కుర్వంతి యాజకాః ।
యూపస్తంభాస్సమంతాచ్చ పశుభిరుపశోభితాః ॥
దృశ్యంతే స్థాణుతాం ప్రాప్తా అధ్వరాంతే సముచ్ఛ్రితాః ।
జైమినిరువాచ ॥
ఏవం స రామః సుఖితః పృథివ్యాం
త్రిభిశ్చ తైర్భ్రాతృభిరగ్నికల్పైః ।
రరాజ రాజీవపలాశనేత్రో
గుణైస్త్రిభిస్సత్త్వరజస్తమోభిః ॥

జైమినిభారతము. అ. ప. అధ్యా. 25. శ్లో 20-26.

మూలములోని పైభాగమున కనువాదమును జేయునపుడు చాలభాగములు వదలివేయఁబడి యనేకాంశములు చేర్పఁబడి పూర్తిగ మూలముయొక్క రీతియే మార్చఁబడియున్నది.

కుశలవోపాఖ్యానములోని పైభాగమున కనువాద మీ రీతినున్నది. :—

''అని మోదమును బొందె నప్పు డారామ
జనపతి యందంద జననికి మ్రొక్కి
వినయవాక్యంబులు విలసిల్ల బంధు
జనుల సేమంబును సకలంబు లడిగి
యనుజులతోఁగూడ నప్పురిఁజొచ్చి
చనుచోట రఘురామచంద్రుపై నడుమ
ఘనరత్నతోరణాంకములు గర్జనలు
ప్రాసాదములు మేఘపంక్తులు మణులు
రాసికెక్కిన సురరాజగవనులు
పసిఁడికుండల మించు ప్రతిసూర్యబింబ
విసరంబుమెఱుఁగులు వివిధశస్త్రములు
గా నయోధ్యాపురి ఘనపుష్పవృష్టి
వానకాలమునాటివడువునఁ గురిసె.
జలజాప్తకులుఁ డంత సకలసమ్మదము
విలసిల్ల నగరుఁ బ్రవేశించె నెలమి
పట్టాభిషిక్తుఁడై బహుళకీర్తులకుఁ
బట్టైన రఘుపతి పరమధర్మమున
నవరత్నసింహాసనంబున నుండి
యవనిపైఁ దనయాజ్ఞ యనిశంబుఁ జెల్లఁ
దనుఁజేరి పావకత్రయమునుఁ బోలి
యనుజులు మువ్వురు నతభక్తిఁ గొలువ
నలఁతయుఁ బగయును నపమృత్యుభయము

గలఁకయుఁ గలహంబు కపటవర్తనము
శోకంబు రుజయునుఁ జోరవిగ్రహము
లేకుండఁ బ్రజలఁ బాలింపుచు నుండె. ”
కుశలవోపాఖ్యానము (పూర్వభాగము) పద్య. 59-71

కుశలవోపాఖ్యానము పూర్వభాగమున వర్ణింపఁబడిన సుమారు 85 పద్యములవరకు వ్యాపించిన (72-151, 163-170) వసంతాగమనము, సీతారాముల యారామకేళి, జానకివర్ణన, వనవర్ణన, వర్షాగమనవర్ణన మిత్యాదులు మూలమున మృగ్యములు. ప్రాయికముగ నిందలి వర్ణనములన్నియుఁ గవిచేఁ గల్పితములనియే చెప్పనొప్పును.

“దశవర్షసహస్రాణి రాజ్యం చక్రే స రాఘవః ।
ప్రజాం న లేభే సీతాయాం పాలయన్పూర్వజస్థితిమ్ ॥

అని శ్రీరామునకు సంతతిలేకుండుటనుఁ దెల్పు పైశ్లోకము ననువదించు కవియొక్క లేఖిని యెంతస్వైరముగ సంచరించినదో యీ క్రిందిపద్యములవలనఁ దెలియఁగలదు —

“ అంత భూపాలుఁడా యవనినందనకు
సంతతిలేకున్నఁ జాల చింతించి
తనయులులేని యాతని యన్వయంబు
జననంబు వృధగాదె! చర్చించి చూడ
నెందును సంతానహీనులు కీర్తిఁ
బొంద రిందును నందుఁ బుణ్యాత్ములైన
నెలకొన్న వగపులు నిట్టూర్పుగములు
బెలయించి వారల పితరులందఱును

నన్నురక్తిఁ దమకుదకాంజలికర్ణ
మొనరించువాఁడింక నుర్వి లేఁడనుచు
క్షితిఁ దమవంశవిచ్ఛేదంబుఁ దలఁచి
మతిలోనఁ దమయాస మాని తూలుదురు
ధారుణిసుతయందుఁ దనయులఁ బడయ
నేర నక్కట ! వంశనిస్తారకులనుఁ
గడు దుష్టదెస నొంది కాకుత్స్థకులము
పావవడంచినజాడఁ బోవలె ననుచు."

ఇట్లు కవి మూలమున సంగ్రహముగఁ బ్రతిపాదింపఁబడిన భాగముల నతివిస్తరముగఁ జేయుచు విస్తరముగఁ బ్రతిపాదింపఁ బడిన విషయముల సంగ్రహింపుచు నచ్చటచ్చట మూలములో లేని విషయములఁ జేర్చుచుఁ గొన్నిచోట్ల మూలములోని విషయముల వదలివేయుచు ననువాదమును సాగించియున్నాఁడు.

కుశలవోపాఖ్యానమునఁ గవికల్పితములగు మార్పులలో నవతారికలోని మార్పు ప్రధానమైనది. జైమినిభారతమున జైమినిముని బభ్రువాహనునకును నర్జునునకును నతితీవ్రమగు సమరమును వర్ణింపుచుఁ గుశరాముల యుద్ధమువలె నుండెనని పలుకఁగా జనమేజయుఁడు కుశరాములను గుఱించిన వృత్తాంతమంతయుఁ జెప్పఁగోరుటయుఁ దదనంతరము రాముఁడు వనవాసమును ముగించుకొని యయోధ్యకు మఱలుటాదిగాఁ గుశలవులతో యుద్ధమునందు మూర్ఛిల్ల వాల్మీకి యనుగ్రహమునఁ దెప్పరిల్లి పుత్రాదులతోఁ గూడి యయోధ్యకు వచ్చి యశ్వమేధమును జేయుచుండ వాల్మీకి సీతాదేవిని శ్రీరామున కొప్పగింప నధ్వర

మును ముగించి సుఖముగ రాజ్యమేలుటవరకు గల చరిత్రమును జైమిని వర్ణించి చెప్పునట్లున్నది ప్రతిపాద్యము.

కాని రామనార్యుఁడు తన యనువాదముఁ శార్ఙ్గుఁడునుఁ గర్ణుఁడును దీవ్రమగుయుద్ధముఁ జేయుచుండఁ గుశ రాములయుద్ధము వలె నుండెనని వర్ణింప జనమేజయుఁడు కుశరాముల వృత్తాంతము నడుగుటయుఁ దదనంతరము జైమిని కుశలవచరితమును వర్ణించునట్లు బ్రతిపాద్యము నమర్చియున్నాఁడు. జైమినిభారత కుశలవోపాఖ్యానములలోని యవతారికోపసంహారము లీక్రిందఁ బొందు పరుపఁబడియున్నవి.

జైమినిభారతములోని యవతారిక .—

జైమినిరువాచ·—

" సంగ్రామ స్త్వభవద్రాజ న్బభ్రువాహనపార్థయోః ।
యథా కుశస్య రామస్య వాజిమేధహయే ధృతే ॥

జనమేజయ ఉవాచ :—

కథం రామః కుశం పుత్రం శమయచ్ఛరవృష్టిభిః ।
కథంచ తేన పుత్రేణ జితో రామో రణాజిరే ॥
రామో నవేత్తి స్వం సూనుమేతన్మే విస్తరాద్వద ।
యస్మాద్రామకథా విప్ర సర్వపాతకనాశినీ ॥

జైమినిరువాచ :—

శృణు రాజన్మహాబాహో రామస్య చరితం మహత్ ।
విస్తరేణ యథాపూర్వం వదతో మే నిశామయ ॥

జై. భా. అ. ప. అధ్యా. 25. శ్లో॥ - 1-4.

కుశలవోపాఖ్యానములోని యవతారిక :—

"జైమినిచే మున్ను జనమేజయుండు
జైమినిభారతసంహిత వినుచు
ధర్మజు నశ్వమేధప్రసంగమున
ధర్మాత్ముఁడైన యాధరణీశ్వరుండు
" పార్థుండు గర్ణుండుఁ బన్ని పోరుటయు
వ్యర్థమే ప్రజలెల్ల వసుధఁ గూలుటయుఁ
దలఁప నచ్చెరువుగాదా " యన నతఁడు
బలికె నాఖండలపౌత్రపౌత్రునకు
" నిదియేమి రాముండు యెఱిఁగి యాకుశుఁడుఁ
గదనంబు సేయరే కమలారివంశ!
వినవయ్య యద్భుతవృత్తాంత "మనిన
జనమేజయుఁడు పల్కె జైమినిఁ జూచి
" రాసి యొండొరులతో రాముండుఁ గుశుఁడు
చేసిన కయ్యంబుఁ జెప్ప నచ్చెరువు
అది యానతిమ్ము నాకంతయుఁ దెలియ
మదిఁ గోర్కె కలద "న్న మాని యిట్లనియె.
పూర్వోక్తమగు రామభూపాలుచరిత
మర్వీశ! చెప్పెద నురుభక్తి వినుము."

కుశలవోపాఖ్యానము (పూ. భా) పద్య 15-23

జైమినిభారతములోని యుపసంహారము :—

" ఉత్థాయ రామో నగరీం ప్రవివేశ ససైనికః।
విస్మయన్నేవచ హయం ముక్తం వాల్మీకినాచ తమ్ ॥

పాలయామాస వీరైస్తైః పశ్చాద్యజ్ఞో మహానభూత్ ।
యజ్ఞోత్సవే వర్తమానే వాల్మీకిర్మునిపుంగవః ॥
సీతాం నీత్వా పుత్రయుతాం సంస్థాప్య రఘుసన్నిధౌ ।
రామః పుత్రయుతోజాతస్సీతయాసహితః స్థితః ॥
మునీన్విసర్జయామాస యజ్ఞాంతే చ పురస్కృతాన్ ।
రామస్సీతాగతం స్నేహం నిదధే తదపత్యయోః ॥
యుద్ధంతు పుత్రయోర్యద్వజ్జాతం రామేణ వై పురా ।
తథా పార్థస్య పుత్రస్య యుద్ధం ప్రావర్తతాద్భుతమ్॥

సూతఉవాచ —

పారీక్షితాయ సకలం కథయామాస జైమినిః ।
తత్తు యుష్మభ్యమాఖ్యాతం మయైవ మునిపుంగవాః ॥
నాఖ్యాతవానిదం యుద్ధం వాల్మీకిః పితృపుత్రయోః ।
యద్వ్యాఖ్యాస్యదముష్యస్య శ్లోకోయం కరుణార్ణవే ॥
ఇదమాఖ్యానకం రమ్యం యేశృణ్వంతి నరోత్తమాః ।
తే పుత్రపౌత్రసహితా భుక్త్వా భోగాన్మనోరమాన్ ॥
సర్వపాపవినిర్ముక్తా లభంతే విష్ణుమవ్యయమ్ ।
శృణోతీదం పుణ్యశీలం శ్రావయేచ్ఛేదముత్తమమ్ ॥
నరః ఫలమవాప్నోతి రాజసూయాశ్వమేధయోః ।
కాంచనేన విమానేన స్వర్గం యాతి నరోత్తమః ॥
పునర్లక్ష్మీరూపయుతోజాయతే విమలే కులే ।
శ్రుత్వాత్విదముపాఖ్యానం శ్రావ్యమన్యన్నరోచతే ॥
పుంస్కోకిలరుతం శ్రుత్వా రూక్షా ధ్వాంక్షస్య వాగివ ॥"

జైమినిభారతము (అశ్వమేధపర్వము) అధ్యా. 36. శ్లో॥ 79-90.

కుశలవోపాఖ్యానములోని యుపసంహారము :—

" జనకజతో ననుజన్ములతోడ
ననురాగమునఁ బొంది యారామవిభుఁడు
క్రతు వశేషంబుగాఁ గావించి వాని
తతులకు దక్షిణల్ తనియంగ నిచ్చి
తనకీర్తి చంద్రికల్ ధరయెల్ల నిండ
జనలోకచంద్రుఁడై జగమేలుచుండె.
సముదగ్రమగు ప్రజాక్షయము యుగాంత్య
సమయంబునందవశ్యంబగుఁ గాన
నదిగారణంబుగా నావహంబయ్యెఁ
ద్రిదశేంద్రసుతునకు దినపసూనునకు
శశికులతిలక ! యాసమరంబుఁ జూడఁ
గుశరాములకుబోలె ఘోరమైతోఁచె.
తనయులకునుఁ గన్నతండ్రికే కలిగె
నని యని యెఱిఁగింపఁడయ్యె వాల్మీకి
అది మీకుఁజెప్పితి నని సూతుఁడపుడు
ముదమొప్ప శౌనకముఖ్యుల కనియె
నెప్పుడు యీకథ నేసరోత్తములు
చెప్పిన వినిన వ్రాసినఁ బేరుకొనిన
శ్రీనొంది పుణ్యులై చిరజీవులగుచు
మానక సుతులతో మనుమలతోడ
సఖులతోడనుఁ బ్రాణసఖియలతోడ
నఖిల సుఖావాప్తి నలరుచుండుదురు

దురితవిముక్తులై తోయజనయన
కరుణఁ గాంతురు నిత్యకైవల్యపదము.
అనుచు సూతుఁడు చెప్ప నాశౌనకాది
మునులందఱును డెందముల మెచ్చిరనుచు "

కుశలవోపాఖ్యానము (ఉత్తరభాగము) పద్య 1276-1287.

సందర్భానుసారముగఁ గవి జైమినిభారతములోని కొన్ని భాగములను వదలివేసియుండెనని మున్నే తెలియపఱచియున్నాను ఆవిధముగ ననువదించని భాగములలో నొకటి సౌరస్తోత్రము. సంగరమున విల్లు విఱుఁగఁగా లవుఁడు సూర్యభగవంతుని స్తుతియించి యమ్మహాత్మునివలన దివ్యకార్ముకమును బడయు నవసరమున మూలమునఁ గల సౌరస్తోత్ర మీయనువాదమునఁ గానరాదు.

ఈవిధముగ ననేకవిధములైన మార్పులతో నీకుశలవోపాఖ్యానమును జిత్రించిన కవియొక్క కుశలత వర్ణనాతీతము కుశలవచనపటువగు నీకవీశ్వరుఁడు తన కుశలవచరితమున నిట్టి మార్పులను బ్రవేశపెట్టుటకుఁ గారణములు లేకపోలేదు.

తా ననువదించుటకు స్వీకరించిన కథాభాగము జైమిని భారతములోనిదైనను నందుఁ (జైమినిభారతమున) గుశలవచరితము ప్రాస్తావికోపాఖ్యానము. మధురమధురమగు భారత కథను వినుచున్న జనమేజయునకుఁ బార్థబభ్రువాహనుల యుద్ధావసరమునఁ దండ్రికినిఁ దనయునకును సంగరమేర్పడుటను వినఁగా నాశ్చర్యజిజ్ఞాస లుప్పతిల్లుట సహజమేకదా! తత్సమయమున జైమినిచేఁ బార్థబభ్రువాహనుల యుద్ధమాశ్చర్యవిషయము గాద

నుటకు మాత్రమే కుశలవచరిత మచ్చట వర్ణింపఁబడియున్నది అట భారతకథయే ప్రధానమైనది. కుశలవచరితము ప్రాస్తావికము మాత్రమే. కాని రామనార్యుఁడు జైమినిభారతమున సంగ్రహముగఁ బ్రతిపాదింపఁబడిన కథావస్తువుఁ దీసికొని సర్వాంగసుందరమగు నొకకావ్యముగ నద్దానిని దీర్చి దిద్దఁ బ్రయత్నించి సఫలుఁడయ్యెను. అచ్చటచ్చట మూలములో లేకున్నను కొన్నివర్ణనములఁ జేర్చుకొనియెను. సందర్భశుద్ధికైఁ గొన్నింటిని వదలివేసి యాయా సందర్భములందుఁ బోషింపఁదగిన రసములఁ బోషించి యొకకావ్యమును సృష్టించెను. సంగ్రహరూపమగు నొక యుపాఖ్యానమును నొక ప్రత్యేకమైన కావ్యముగ నొనరింపవలయుచోఁ గొన్నిమార్పు లత్యావశ్యకములుగదా ! అంతటితోఁ గవి మూలము ననుసరించక వేఱుత్రోవలఁ ద్రొక్కెనని విమర్శించుట పరమసాహసమేయగును.

గొప్పగ్రంథమునుండి యొకభాగమును మాత్ర మనువదించుటలోఁగాని యద్దానినిమాత్ర మొకదృశ్యకావ్యముగనో శ్రవ్యకావ్యముగనో రచియించుటలోఁగాని కవిసార్వభౌములచే నీసరణియే యనుసరింపఁబడిన దనుటలో సందేహము లేదు. కాని వస్తుస్థితిని కప్పిపుచ్చలేముగదా! అదియే పైవిమర్శనకు మూలహేతువు

—: అనువాదరీతి :—

మూలమున ఖండఖండముగ నధ్యాయములచే (12అధ్యాయములు 25-36) విభాగింపఁబడిన కుశలవచరిత్రమునుఁ గవి రెండుభాగములుగ విభజించెను. పూర్వభాగమున 708 ద్విపదలు

గలవు. ఉత్తరభాగమున 1294 ద్విపదలు గలవు రెండుపంక్తు లను గలిగిన దొక్క-ద్విపదగ నిర్ణయింపఁబడినది. శ్రీరాముఁడు వనవాసమును ముగించుకొని మఱలుటాదిగాఁ గుశలవ జననాంత మైన కథాభాగమునుఁ గలయది పూర్వభాగము. శ్రీ రాముఁ డశ్వమేధాధ్వరము నారంభించుటాదిగాఁ గుశలవులతో యుద్ధా నంతరము పుత్రదారాదులతోఁగూడి సుఖముగ రాజ్యమేలుట వరకుఁ గల యితివృత్త ముత్తరభాగములోని కథావస్తువు. ఈ గ్రంథమున నుత్తరభాగమునకు సర్వవిధములఁ బూర్వపీఠికవలె నొప్పు పూర్వభాగము సార్థకమై యొప్పుచున్నది.

యథావదనువాదము (మక్కి-కి మక్కి- యనువాదము) భావానువాదమన ననువాద మిరుదెఱంగులఁజెప్ప నొప్పును. మూలములోని కథాభాగము నేమాత్రము వదలక ప్రాయికముగా మూలమునవచ్చు పదములనే ప్రయోగించుచు ననువదించుట యథావదనువాద మనఁబడును. మూలములోని కథావస్తువునుఁ బరిగ్రహించి స్వతంత్రముగ మూలములోని భావమున కవిరుద్ధ ముగ ననువదించుట భావానువాదమనఁబడును. ఈకుశలవో పాఖ్యానము రెండవదియగు భావానువాద మనఁదగును. అచ్చ టచ్చటఁ గొన్ని తత్తత్పదానువాదములు గనుపించినను నీగ్రం థము భావానువాదమనుటలో సందేహము లేదు ఉదాహరణ కీక్రింద నివ్వబడిన మూలానువాదములఁ బరిశీలించిన స్పష్టము కాఁగలదు.

"దశవర్షసహస్రాణి రాజ్యం చక్రే స రాఘవః।
ప్రజాం న లేభే సీతాయాం పాలయన్ పూర్వజస్థితిమ్ ॥"

జైమినిభారతము. అ. ప. అధ్యా. 26 శ్లో1.

"అంత భూపాలుఁ డాయవనినందనకు
సంతతి లేకున్నఁ జాల చింతించి
"తనయులులేని యాతని యన్వయంబు
జననంబు వృథగాదె చర్చించి చూడ
నెందును సంతానహీనులు కీర్తిఁ
బొందరింమను నందుఁ బుణ్యాత్ములైన
నెలకొన్న వగపులు నిట్టూర్పుగములు
బెలయించి వారల పితరు లందఱును
ననురక్తిఁ దమ కుదకాంజలికర్మ
మొనరించువాఁడింక నుర్విలేఁడనుచు
క్షితిఁ దమవంశవిచ్ఛేదంబుఁ దలఁచి
మతిలోనఁ దమయాస మాని తూలుదురు
ధారుణిసుతయందుఁ దనయులఁ బడయ
నేర నక్కట! వంశనిస్తారకులనుఁ
గడుదుష్టదెస నొంది కాకుత్స్థకులము
పొడవడంచిన జాడఁ బోవలె ననుచుఁ
జింతించి దేవతాసేవఁ గావింప"

శ్రీరామునకు సంతతి లేకుండెనని మాత్రము మూలమునఁ బ్రతిపాదింపఁబడియుండఁ గవి రామనార్యుఁడు, ధార్మికుఁడైన నృపతికి బహువత్సరములు రాజ్యపాలనముఁ జేసినపిదప సంతానము లేకుండుటవలనఁ గలుగు సంతాపమునుఁగూడ విశదీకరించి తత్సందర్భపోష్యమగు నిర్వేదమును మనోవికలత్వమును మూలావిరుద్ధముగఁ బోషించి తనకవితాప్రౌఢిమఁ జాటియున్నాఁడు. సంతాన

హీనుఁడగునతని హృద్గతభావాదు లేరీతి దొర్లుచుండునో ప్రస్ఫుట
ముగ విశదీకరించిన కవియొక్క నడక చతురగంభీరమై యనన్య
సామాన్యమై యొప్పుచున్నది.

—: పరిష్కరణము :—

ఈ తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమున
M. 240, M. 241, M. 242 సంఖ్యలుఁగల మూఁడు కుశలవో
పాఖ్యానగ్రంథముయొక్క తాళపత్రప్రతులున్నవి. అందు M 240
సంఖ్యఁగల కుశలవోపాఖ్యానగ్రంథము ప్రస్ఫుటముగ లిపినిఁ గల్గి
శుద్ధమై యొప్పుటచే ముద్రణమునకుఁ దగినదిగా నిర్ణయింపఁ
బడినది కాని యతిప్రాచీనములగు 241, 242 సంఖ్యలుఁగల
ప్రతులయొక్క సాహాయ్యముకూడ నత్యంతావశ్యకమై యుండి
నందున నా రెంటినిగూడ బరిశోధించి యావశ్యకములగు పాఠ
ములు సంగ్రహింపఁబడినవి చాలచోట్లఁ బ్రకృతపరిష్కరణము
నకు నా రెండు గ్రంథములలోని పాఠాంతరములుగూడ నివ్వబడి
యున్నవి. 240 సంఖ్యఁగల ప్రకృతపరిష్కరణమున సర్వవిధ
ములఁ బొసఁగని భాగములు తదితర (241, 242.) మాతృకల
సాహాయ్యమున సరిదిద్దఁబడి యథామాతృక పాఠములు ప్రాయిక
ముగానన్నియుఁ గ్రింద నివ్వఁబడియున్నవి. లేఖకప్రమాదవశమునఁ
బ్రకృతపరిష్కరణమునకు మాతృకయగు 240 సంఖ్యఁ గల ప్రతి
యందు విలుప్తములైన భాగములు 241, 242 సంఖ్యలుఁగల గ్రంథ
ములనుండి సంగ్రహింపఁబడినవి పైమూఁడు గ్రంథములను బరి
శీలించి చూడ నతిప్రాచీనమైన ప్రతియగు 241 సంఖ్యఁగల
ప్రతియే మొట్టమొదటి మాతృకయనియు నద్దాని పుత్రికలే తది

తర ప్రతులనియు స్పష్టమగుచున్నది. పాఠాంత రాబులను సులభ ముగ గ్రహించుట కనుకూలమగురీతిని M. 241. సంఖ్యఁగల గ్రంథమునకు "క" యనియు M. 242 సంఖ్యఁగల గ్రంథము నకు "ఖ" యనియు సంజ్ఞ లేర్పరుపఁబడియున్నవి. క. గ్రంథ మున నసంపూర్ణమును గవివంశవర్ణనా ప్రధానమును నగు నుపో ద్ఘాతమును వదలి తక్కినభాగము ప్రకృతపరిష్కరణమున లభ్య మగుచున్నది. ఖ. గ్రంథమునఁ బూర్వభాగము చాలవరకు లభ్యముకాలేదు. మ ద రా సు రాజకీయప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమందుఁ గూడ నీగ్రంథముయొక్క మూఁడు ప్రతులు లభ్యములగుచున్నవి.

See the page No. 1376 of the Descriptive catalogue of the Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library, Madras; Vol IV. Prabandhas (continued,) Dvipadakavyas.

కాని యాప్రతులన్నియు నీసరస్వతీమహాల్ గ్రంథాలయమునం దలి ప్రతులకుఁ బుత్రికలనియే భావింపఁబడుచున్నందున నవి యీ పరిష్కరణముదృష్ట్యా పరిశోధింపఁబడలేదు. ఆ ప్రతులనుఁగూడ పరిశోధించియుండిన బాగుండు ననియే తోఁచుచున్నది. కాని యవ కాశాభావమే యందు దూష్యమైనది.

సర్వసులభముగాని భాషయందున్నట్టి జైమినిభారత మునఁ బ్రస్తావవశముఁ జెప్పఁబడి యతులితకవితావిశారదుఁడగు కవి రామనార్యునిచే మాధుర్యమును వెదజల్లు సర్వసుందరమగు

నొక్క మధురకావ్యముగ ననువాదరూపమున సర్వవేద్యంబగు నట్లు జేయఁబడిన యీ కుశలవోపాఖ్యానము సోదరాంధ్రమహా జనుల యాదరాభిమానములకుఁ బ్రముఖపాత్రమగు ననుటలో సందియము లేదు.

ఇట్టి యపూర్వగ్రంథములనుఁ బ్రచురించుటకు సకాలమున నార్థికసాహాయ్య మొసఁగించి యాంధ్రభాషాభివృద్ధికిని దన్మూలముగ నాయకరాజుల యాశయసిద్ధికిని నిరుపమమగు సేవఁ జేసిన మన ప్రభుత్వము వేనోళ్ళఁ బొగడఁదగియున్నది.

ఈకుశలవోపాఖ్యానమునుఁ బ్రచురించుటకు నిశ్చయించి తత్పరిష్కరణభారమును నాపైనుంచి యేతన్మూలముగా నాంధ్రభాషామతల్లికి నీ యల్పీయమైన సేవనైనను జేయుటకు మహదవకాశము నొసంగిన సరస్వతీమహల్ గ్రంథాలయ గౌరవ కార్యదర్శి శ్రీ యస్. గోపాలన్, బి. ఎ, బి. ఎల్, గారికి నాహృదయపూర్వకాభివందనముల నర్పించుచున్నాను.

నన్నీకార్యమున మిక్కిలి ప్రోత్సహించి తగుసహాయ మొసఁగించిన యీసరస్వతీమహల్ గ్రంథాలయమునందు విమర్శకోద్యోగులగు శ్రీయుత కె. వాసుదేవశాస్త్రిగారికి నా నమఃపూర్వకాభివందనముల నర్పించుచున్నాను.

నా కన్నివిధము జేదోడువాదోడుగా నుండి సహాయ మొనర్చిన మన్మిత్రులును సహోద్యోగియునగు శ్రీ అ. మహాదేవ శాస్త్రిగారికి నా కృతజ్ఞతను, అపూర్వమగు సలహాల నొసంగి యాశీర్వదించిన యస్మజ్జ్యేష్ఠసహోదరులును, పలమనేరునందలి

చిత్తూరుజిల్లా బోర్డు హైస్కూలులోఁ బ్రధానాంధ్రోపాధ్యాయులును నగు శ్రీయుత విరలదేవుని సీతారామయ్యగారికి నా యభివాదములను దెల్పుచున్నాను.

" జాతౌజాతౌ యదుత్కృష్టం తద్రత్నమభిధీయతే "

అను నార్యోక్తి ననుసరించి ముద్రణాలయముల కన్నిటికిని రత్నమై వెలుఁగు " రత్నంప్రెస్ " లో నీ గ్రంథము ముద్రింపఁబడుట ముదావహమైయున్నది. పరిశోధనమున కధికముగ శ్రమనివ్వక శుద్ధముగను ప్రామాదికము లధికముగ లేకుండునట్లును పాటుపడి త్వరలో గ్రంథముయొక్క ముద్రణ పూర్తియగునట్లు ముద్రణమును దృప్తికరముగ సాగించిన " రత్నంప్రెస్ " వారికి నామనఃపూర్వకాభినందసల దెల్పుచు నింతటితో విరమించుచున్నాను.

యావచ్చంద్రదివాకరౌ శుభకరౌ యావచ్చ గంగా శుభా
యావద్భూధరపంక్తయస్సుఫలదాం రక్షంతి పృథ్వీమిమామ్।
యావత్సత్యమిహాస్తి ధర్మనిరతాస్సర్వేపి విజ్ఞా జనా
స్తావత్కౌశలవం చరిత్రమతులం జీయాద్ధరాయాం శుభమ్ ॥

సరస్వతీమహాల్
గ్రంథాలయము, తంజావూరు.
29-12-1950.

విరలదేవుని సుందరశర్మ,



# విషయానుక్రమణిక.



## పూర్వభాగము.

విషయము — పుట.

# ఉత్తరభాగము.

**విషయము :—** **పుట.**

స మా ప్త ము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీరామచంద్రాయనమః

# కుశలవోపాఖ్యానము.

## —: పూర్వభాగము. :—

శ్రీయురంబునఁగల్గి చెన్నొందు నభయ
దాయకునకు జగత్త్రయనాయకునకు
నంజనాసుతునేలు నానతవజ్ర
పంజరునకు మహీపతికుంజరునకు
వి[1]తతచారముగాఁగ విలసిల్లువాని
జితదూషణునకు నాశ్రితపోషణునకు
మేఘనీలద్యుతి మెయినుల్లసిల్లు
రాఘవునకును మార్గణలాఘవునకుఁ
దెలియ విన్నపముగా ద్విపదరూపమునఁ
బలికెదఁ గుశలవోపాఖ్యానమెలమి
ననిచెప్పఁబూనితి నారఘూత్తముని
మనమున నిల్పి యిమ్మాట్కి నిట్లంటి.

—: సూతుఁడు శౌనకాదుల కోర్కెను మన్నించి జైమిని ప్రోక్తంబగు కుశలవోపాఖ్యానమునుఁ జెప్పఁబూనుట :—

అవధరింపుము రామ ! అతిలోకధామ !
రవికులాంబుధిసోమ ! రాజసుత్రామ !
నైమిశారణ్యపుణ్యప్రదేశమున

1. ఖ. అతిలోకచారిత్రుఁడై విలసిల్లు

గోమతీతటమునఁ గూడిసంయములు
శౌనకప్రముఖులు జన్నముసేయ
నానిత్యమతులున్న యడకుసూతుండు
వచ్చినసెదురుగా వచ్చియర్చనము
లిచ్చియచ్చలమెచ్చి యెలమినిచ్చలును
వనజాక్ష! యతనిచే వరపుణ్యకధలు
వినుచుండి మునులొక్కవేళ యిట్లనిరి
"అనఘాత్మ! కుశలవోపాఖ్యానమిపుడు
విననిష్టమైనది వివరింపుమాకు"
ననినసూతుఁడు శౌనకాదులఁజూచి
యనురాగమునఁ బొంది యతిపూజ్యులార!
చెప్పెద మీరుసేసిన ప్రశ్నమింత
నొప్పునే సకలలోకోపకారమున
జైమినిచే మున్ను జనమేజయుండు
జైమినిభారతసంహిత వినుచు
ధర్మజునశ్వమేధప్రసంగమున
ధర్మాత్ముఁడైన యాధరణీశ్వరుండు
"పార్థుండుఁగర్ణుండుఁ బన్నిపోరుటయు
వ్యర్థమే ప్రజలెల్ల వసుధఁ గూలుటయుఁ
దలఁపనచ్చెరువుగాదా" యన నతఁడుఁ
బలికె నాఖండలపౌత్రపౌత్రునకు
"నిదియేమి రాముండు యెఱిఁగి యాకుశుఁడుఁ
గదనంబుసేయరే కమలారివంశ!
వినవయ్య యద్భుతవృత్తాంత" మనిన
జనమేజయుఁడు పల్కెజైమినిఁ జూచి

“ రాసిరియొండొరులతో రాముండుఁ గుశుఁడు
చేసినకయ్యంబుఁ జెప్పనచ్చెరువు
అదియానతిమ్ము నాకంతయుఁ దెలియ
మదిఁగోర్కె కలదన్న ” మానియిట్లనియె
పూర్వోక్తమగు రామభూపాలుచరిత
ముర్వీశ ! చెప్పెద నురుభక్తి వినుము.

## కథాప్రారంభము.

—: శ్రీరాముండు రావణాదుల సంహరించి సీతనుఁ
గైకొని యయోధ్యకు మఱలుట —

శ్రీరామచంద్రుఁడాశ్రితవార్ధిచంద్రుఁ
డారఘునాయకుండభయదాయకుఁడు
అమరవిద్రావణుండైన రావణుని
నమితబలోదీర్ణుఁడగు కుంభకర్ణు
నతిశాత్రవోపాయుఁడగు నతికాయు
నతులమదోన్మత్తుఁడగు నింద్రజిత్తుఁ
జతురంగబలవీరసంచితబంధు
సుతులతో యముఁడున్న చోటికినిపి
పవనాప్తముఖమునఁ బావనంబైన
యవనిజఁగైకొని యఖిలంబుమెచ్చఁ
దనకూర్చుతమ్ముఁడు తరుచరోత్తముఁడు
దనుజనాయకుఁడునుఁ దన్మంత్రివరులుఁ
దనుఁగొల్వఁగా నయోధ్యాపురంబునకుఁ
జనుదేర నాలోన సంభ్రమింపుచును

ననుజులు నావసిష్ఠాదిసంయములు
జనములు నెదురుగాఁ జను దేరఁజూచి
యరదంబుడిగి రాముఁడామునీంద్రులకు
ధరణిజయునుఁదానుఁ దమ్ముఁడుమ్రొక్కి
తోడనే భరతశత్రుఘ్నులు తనకు
వేడుకమ్రొక్కిన విభుఁడాదరించి
ము[1]నుపుఁగైకను భక్తిమ్రొక్కి యందంద
కొ[2]నియాడి వినయంబుఁ గొనుచునిట్లనియె
" జ[3]నని ! లోకంబున జనియించి దుష్ట
జనశిక్షణము శిష్టజనరక్షణమును
నొప్పఁజేయుటగదా యుర్విపై నరుఁడు
భూపాలతిలకమై పుట్టినఫలము
కావున నీరెండు కడమగాకుండఁ
గావింప మీయాజ్ఞఁ గలిగెనాకిపుడు
తల్లి ! నీవనుపంగఁ దాపసోత్తముల
నెల్లశరణ్యుల నేఁగొల్వఁగంటి
నంబ ! నీకరుణమై యఖిలంబుమెచ్చ
నంబుధి బంధించి యతికీర్తిఁగంటి
జనయిత్రి ! నీకృప సకలరాక్షసుల
ననిఁద్రుంచి లోకులకభయమీఁగంటి
నగణితచరితుండనైతినే " యనుచుఁ
దగవుమాటలుఁబల్కి తదనంతరంబు

1 క. మునుపుఁగైకకు మ్రొక్కి మోదంబుతోడఁ
2. క. గొనియాడి వినయంబు కొనలెత్తఁబలికె.
3 క. జనని ! లోకంబునఁ జర్చింపదుష్ట

నాసుమిత్రకు మ్రొక్కి యతిభక్తితోడ
నాసంయములతోడ నపుడుదావచ్చి
యరుదైన పతివియోగాగ్నిచేఁ గుంది
పరి[1]లిప్తభూరేణు పటలాంగియగుచు
నెప్పుడుచూతునో యేఁ బుత్రుననుచుఁ
దప్పి[2]కయందంద తనువచ్చుత్రోవఁ
గనుఁగొను యతిపుణ్యకాంతామతల్లిఁ
దనుతరతనువల్లిఁ దమతల్లిఁగాంచి
కడ[3]లేనిభక్తితోఁ గడుసంతసమున
ముడివడనందంద మ్రొక్క, మ్రొక్కుటయుఁ
గన్నారఁగనుఁగొని కడుఁబేదరాలు
పెన్నిధిఁగన్నట్లు ప్రియమందె జనని
చేకొని పట్టాభిషేకంబు నీకు
నోకుమారక! యింక నుచితమన్నట్లు
నందనుమీఁద నానందబాష్పంబు
చిందంగఁ గౌఁగిటఁ జేర్చి మేనెల్లఁ
బ్రమదంబుతో నిజపాణిపద్మమునఁ
జమరి రాక్షసశరక్షతములఁగాంచి
"అనఘ! రాఘవ! వసిష్ఠాదిసంయములు
ననుఁజూచి 'నీప్రియనందనుండెందు
న[4]విభేద్యుఁడక్లేశుఁ డఖిలేశుఁడ" నుచు

1. క. పరిలిప్తభూరేణుపటలాగ్నియగుచు
2. క. తప్పకయందంద తన త్రోవవచ్చు
3. యడలేని భక్తితో
4. క. ననిభేద్యుఁడక్లేశు

వి[1]వరించిపలికిరి విమలవాక్యముల
వివిధబాణక్షతావృతు నిన్నుఁ జూచి
య[2]వినేఁ డమోఘంబులై తోఁచె నాకు
నదిగాక మరినిన్ను నఖిలవేదార్థ
వి[3]దులు నీమహిమల వివరింపలేరు
అటు[4]లయ్యు నీక్రియనన్న! నీమేనుఁ
జటులరాక్షస బాణచయ మెట్లునాటె"
ననిశోకమునఁబొంది యటవివేకించి
యనియె రా[5]ఘువుతోడ నపుడుకౌసల్య
శో[6]కార్తమై మీఁదుఁ జూడకయంటి
గాకయమ్మునుల వాక్యము లేలతప్పు
రావణాదుల సం[7]గరంబున నోర్చి
నీవు వచ్చితిగాన నిజమయ్యె నేఁడు"
యని మోదమునుఁ బొందెనప్పుడారామ
జనపతి యందంద జననికి మ్రొక్కి
విన[8]య వాక్యంబులు విలసిల్ల బంధు
జనుల సేమంబును సకలంబులడిగి

---

1. క వినుతించి.
2. క. అదినేఁడు నమ్మికలై తోఁచెనాకు.
3. క విదులును నిజముగావివరింపలేరు.
4. అటులయ్యె.
5. క. రామునితోడ.
6. క. శోకార్తయై.
7. క సంగరములలో గెలిచి.
8 వినయవాక్యంబుల విలసిల్లబంధు.
   క. విమలవాక్యంబుల విలసిల్లుబంధు.

యనుజులతోఁగూడ న[1]ప్పురిఁ జొచ్చి
చనుచోట ర[2]ఘురామచంద్రుపై నడుమ
ఘనరత్నతోరణాంకములు దేవేంద్రు
ధనువులు దుందుభిధ్వనులు గర్జనలు
ప్రాసాదములు మేఘపంక్తులు మణులు
రా[3]సికెక్కిన సురరాజగవనులు
పసిఁడికుండలమించు ప్రతిసూర్యబింబ
వి[4]సరంబు మెఱుగులు వివిధశస్త్రములు
గా నయోధ్యాపురి ఘనపుష్పవృష్టి
వానకాలమునాటి వడువునఁ గురిసె.
జలజాప్తకులుఁడంత సకలస[5]మ్మదము
విలసిల్ల నగరుఁ బ్రవేశించె నెలమి
పట్టాభిషిక్తుఁడై బహుళకీర్తులకుఁ
బట్టైన రఘుపతి పరమధర్మమున
నవరత్నసింహాసనంబుననుండి
యవనిపైఁ దనయాజ్ఞ యనిశంబుఁ జెల్లఁ
దనుఁజేరి పావకత్రయమునుఁ బోలి
యనుజులు మువ్వురు నతిభక్తిఁ గొలువ

---

1. క. నాపురి
2. రఘురామచంద్రుపైనపుడు
3. రాసికెక్కిన సురరాజగోపములు.
   క. రాసులుఁదగుసురరాజగోపములు
4. విసరంబు మెఱుఁగులు వివిధశస్త్రాస్త్రములు.
   క. విసరంబువెలుఁగొందు వివిధాస్త్రరుచుల
5. క. సుమ్మతము.

నలఁతయుఁ బగయును నపమృత్యుభయముఁ
గలఁకయుఁ గల[1]హంబు కపటవర్తనము
శో[2]కంబు రుజయునుఁ జోరవిగ్రహము
లేకుండఁ బ్ర[3]జలఁ బాలింపుచు నుండె.

—. వసంతాగమనము ; సీతారాములారామకేళికిఁ జనుట —

అంతనంతయు నిండి యఖి[4]లలోకులకు
సంతోష మెసఁగ వసంతంబు వచ్చె
మునుపుఁ గోవిలపిండు మౌనంబు విడిచె
వనములకెల్ల జీవనము సొంపారెఁ
బాగరెంతయును నిండెఁ బూ[5]వుమాఁకులకు
మగలకు సతులకు మందటలుడిగె
విరహుల తాపంబు వెగ్గలంబయ్యెఁ
దిరిగెఁ బ్రా[6]యము పువ్వుఁదీఁగెలకెల్ల
నుడుగని ప్రాలేయ మూడనిఁబాడెఁ
దడయ[7]క యేతెంచె దక్షిణానిలము.
ఆరా[8]మవిభుఁడంత నవనిజతోడ
నా[9]రామకేళికి ననురక్తిఁ గదలె

1. క. జాడ్యంబు.
2. క. శోకంబు చెఱయునుఁ జోఁనిగ్రహము,
3. క. జనుల
4. క. యఖిలలోకులను
5. పువ్వుమాంపులకు.
6. ప్రాయపుపువ్వుఁతీఁగెలకెల్ల.
7. క. తరలక
8. క. ఆరామతోఁగూడ శ్రీరామచంద్రుఁ
9. క. డారామకేళికిననురక్తిఁగదలె.

నప్పుడప్పుర కాంత లంతరంగమున
ముప్పిరిగొను మోదములఁ జాలనొప్పి
ప[1]దిదెసలకు నెగఁబారెడు తేఁటి
కొ[2]దములఁ దూలించు కుంతలంబులును
నొకరిచేపట్టులేకున్న మార్కొన్న
ముకురజాలము నవ్వుముద్దుమోములును
వలలఁ జి[3]క్కొడి మీల వంచించి యొరుల
వలలఁ బెట్టఁగఁజాలు వాలుకన్నులునుఁ
జలపట్టి వాసన చాలనికనక
క[4]ళికల వివ[5]రింపఁగల నాసికలును
నొగిఁగూడి తలయూఁచు నోజకంపించు
చిగురుటాకుల లేఁతసేయు మోవులును
జల[6]జాతు విడువని సారసనాళ
కులమువైభవముఁ జేకొనిన హస్తములు
దెసలకెల్లను నోరుఁ దెఱచుచు నున్న
పసిఁడికుండలరాయు పసని పాలిండ్లు
తలఁకెడి లతలచందము విడంబించు
చెలువున నసియాడు శిథిలమధ్యములు
సారెసారెకు జాఱు సైకతావళులు

1. పదిదెశలకునిల బారెడి తెంటి.
2. కొదములు
3. క జిక్కినమీలవంచిచు యొరుల.
4. కళికలవివరింపుగల నాకలును.
5. క. వసియింప.
6. క. జలజారి.

నీరులోపల నాఁగు నిజనితంబములు
కరికరంబుల గెల్చు కదళికాతరులఁ
బొరిఁ బొచ్చెములు సేయఁబూను పెందొడలు
శ్రీ నొం[1]ది యెడఁబాయు చెందమ్మివిరుల
పైనొ[2]త్తి చనఁగోరు పదతలంబులును
వలఁతి నవ్వులు గటివంక బొమ్మలును
నలసభావంబులు[3] నంచెలనడలు
మెఱుఁగుచెక్కులు సుధామిళితవాక్యములు
మెఱయ, సోయగములు మీరంగవచ్చి
జనకజఁ గదిసి యాజగదేకమాతఁ
గానియాడి తమనేర్పు కొల్లదీ నిట్లనిరి.
"వెకలితుమ్మెదలు నీవేణితో నె[4]ఱసి
యొకదినం బొకచోట నుండరాదనుచుఁ
దలపోసి పగలు పద్మంబుల రేలు
కలువల వసియించి కాలంబుఁ గడపు,
నని[5]శంబు తమ్ములఁ గను మందెమేల
ము[6]నఁ దామరలు కొంత మోమెత్తఁగాక,
యు[7]ఱక నీకన్నుల నుద్దించి బయలు

1. శ్రీనొందివెడబాయుం.
2. పైనెత్తి
3. నంచెలినడలు
4 క నొఱసి
5. క. అనిశంబుతమ్ములకనుమందె మేళ.
6. క. మునదామెరలు గొంత మొగమెత్తెగాక,
7. క. వురుకనీకన్నులనోడించిబయలు.

మెఱయవచ్చునె మగమీలకు నెల్ల,
నిటు దెలియఁగలేక యిది బింబఫలము
[1]వటఫలంబనుటెల్ల వర్ణనగాని,
మానిని ! వినుము నీమధురాధరంబు
భానువంశుని తపఃఫలమరయంగ,
శతపత్రనేత్రి ! నీ స్వరములతోడఁ
బ్ర[2]తివత్తునని కూయుపాపంబువలన
నాయాకుకోఱుఁకుల నాఱుమాసములు
వాయెత్తకుండ దైవము ముద్రవెట్టె,
తలిరులతోడి లతావితానంబు
చెలువ ! నీకరములఁ జెనయంగఁ దలఁచి
యవిరళశుభరేఖ నభినవకాంతి
దవులను వనసీమఁ దపముఁ గావించు,
కుం[3]భి కుంభములకు గురువులై హేమ
కుం[4]భంబులను మించి కొండలై నిక్కి
వాల[5]కయుండు నీవలుఁదచన్నులకు
వ్రాలు[6]చుండెడి జక్కవలు సాటియగునె,
పరమాణుఖండంబుఁ బా[7]ఱంగనెత్తి
నిరుపమగతినొప్పు నీకౌనుతోడ

---

1. క. వటఫలంబులటెల్ల
2. క ప్రతివత్తుననికూయఁబాపంబువలన
3. క. కుంభికుంభములకుఁ గుదురుచేయుటకు
4. క. కుంభంబునందెల్ల కొండలై నిక్కి
5. క వ్రాలకమించునీవలుఁదచన్నులకు
6. క. వ్రాలుచుండెడుజక్కవలు సాటియగునే
7. క బాఱంగనూది

వా[1]ఁడిమిదోరయంగ వచ్చియాకసము
నే[2]డును రూపురానేరక నిలిచె,
మరు[3]తేరిచక్రంబు మగువ! నీపిరుఁదుఁ
బుర[4]ణించి యిప్పుడీపుట్టువునందుఁ
బఱచుజాడలఁ గట్టుపడిపాయలేక
మొ[5]ఱవెట్టుఁదనకీడు ముదలించుకరణి,
కను[6]కని శరధి నొక్కటగెల్చియున్న
ఘ[7]నుని యిల్లాలవు గాన నీతోడలు
శ్ర[8]మముఁబొందక యుండి శరధులగెల్చె
స[9]మకూరె సహధర్మచారిణివగుట,
కమ[10]ఠంబు నీదుమీఁగాళులతోడ
సమముగానేరక చలియించిజా[11]ఱె
తనకులంబునకెల్లఁ దలవంపుగాఁగఁ
జనియె నోరమణి! రసాతలంబునకు"
ననియని పలుమాఱు నభినుతిసేయ
జనకజయునుఁదాను జననాయకుండు

---

1. క. వాఁడిమిచెనకంగవచ్చియాకసము.
2. క. నేఁడును రూపుగానేరకనిలిచె
3 క. మరుతేరి చక్రముల్.
4. క. పురుణించియప్పుడు పుట్టువునందు
5. క మొఱబెట్టుతన కెందుఁబురళించుపగిది.
6. క. కనుఁగొను శరధివొక్కటమునిఁగియున్న
7. క. ఘనునియిల్లాలవుగాన వీతోడ.
8. క. శ్రమముఁబొందకరెండు శరధులనోర్చె.
9. క. సమకూడెసహధర్మచారిణియగుట.
10. క. కమఠంబుమీఁదుమీఁగాళ్లతోనోరయు.
11. జాలి,

ఫలి[1]తపుష్పి తనిజపాదపలతలఁ
గల[2]నిజోద్యానంబుఁ గడు వేడ్కఁ జొచ్చె
సిరుమూడు ఋతువులు నేకమై యచటఁ
జరియించెనంత నాజనపతిమహిమ
నప్పు[3]డుభూపతి ఘుఁతోఁటసొబగుఁ
జెప్పనుద్యోగించి సీతకిట్లనియె.
"తుమ్మెద తనకూర్పు తొయ్యలిఁదా[4]ల్చి
తమ్మి[5]యింటికిఁదెచ్చి తమకించి యపుడు
పలుమాఱు గండూష ఫ[6]లరసంబిచ్చె,
చిలుకబోటికి నింపు చిలుకంగ ననుచుఁ
జి[7]వురులంచములిచ్చె జీవితేశ్వరుఁడు
జ[8]వరాంగకోయిల జవరాలికనుచు
నానరిక వలఁపులొండొరులకుఁ జెప్ప
కొను లీల జక్కవ కొ[9]మ్మలుగదిసి
సరసపల్లవరాగసామగ్రి మిగులఁ
జరియించుచందంబుఁ జైత్రాగమమునఁ

---

1 క. ఫలితపుష్పితదివ్యపాటలీతరులఁ
2. క. గలుగునుద్యానంబుఁగడు వేడ్కఁజొచ్చి.
3. క అప్పుడురఘుపతి.
4. దార్చి.
5. తమ్మియింటికిఁదెచ్చెఁ దమకించియపుచుఁ.
6. ఫలరసంబిచ్చి.
7. జిగురులంచములిచ్చె క. జిగురులంచంబిచ్చె.
8. జగరాంగకోయిల.
9 క కోదములుగదిసి.

దన[1]యున్న చందంబుఁ దర్కించుకొనుచు
నె[2]నయవచ్చిన మెచ్చి యీమోవికొమ్మ
తలయూఁచువిధమునఁ దనుగాలిచేత
[3]జలియింపఁజొచ్చెను జర్చింపుమబల !
తిల[4]కించునారామతిలకంబులనఁగఁ
దిలకంబులనుఁగంటె తిలకాయుతాస్య !
చలియనువలరాజు సౌరభ్యలీల
బలసి బాణాసనప్రౌ[5]ఢిమ నెరపఁ
గడునల్గిమధుమాసగరళకంధరుఁడు
వెడ[6]లించు నిటలాగ్ని విధమునఁజూడఁ
జిగురులు వెలుఁగొందు శిఖ[7]లు తుమ్మెదలు
పొగలుక్రొవ్విరులు ని[8]ప్పుకలీలమీఁద
బడిన కారాకుల ప[9]టపటధ్వనులు
స[10]డలని మంటలచప్పుళ్లుగాఁగ
విరహులు తపియింప వినువీధి ముట్టి
తరుణి ! యశోకపాదపము జూపట్టె,

1. క దనయున్న చందంబు తర్కించిచూడ.
2 క నదెవచ్చెనని మెచ్చి యీమోవికొమ్మ.
3 క. చలియింపుచున్నది చర్చింపుమబల.
4 క తిలకించెనారామ తిలకంబులనఁగ.
5. క ప్రౌఢిమ మెఱయ.
6. క. వెడలించెనిటలాగ్ని.
7. క. శిఖలతుమ్మెదలు.
8 క. నిప్పులుకీలమీఁద.
9. క. పటపటధ్వనుల.
10. క. సడలిన,

సం[1]పంగిఁ గదిసి వాసంతికవిరులు
సంపద నలరియు షట్పదంబులకు
న[2]నుపమాకారిణి యనయంగ దుష్ట
జనునాశ్రయించిన సదయుండె పోలె
పయ్యెదఁ దొలగించి పద్మాకుచముల
నెయ్యంబు సలి[3]పెడు నిఖలేశుఁడనగఁ
బద్మపత్రంబులఁ బా[4]యంగఁద్రోచి
పద్మినీకలి[5]కలపైఁ దేఁటిఁ మెఱసె,
విరహుల మది[6]నుండి వెలువడి పేర్చు
గరు[7]వంపు మదనాంధకారంబులనఁగ
నలినీలనీలంబులగు తమాలములు
కలకంఠి! పగలు చీఁకట్లుఁ గ[8]ల్పించె,
దళ[9]ములు వెలయంగఁ దరులలో నెల్ల
ము[10]లుసూపఁ గడువాఁడిమొనలతో నున్న
మొ[11]గ్గలఁ జూచితే ముందఱ మరుని

1. క. సంపంగి వెసగాంతి సంపంగివిరులు
2 ననుపనకాంణి యనయంగ దుష్ట
క. అనుపమాకారిణి యగునియ్యదుష్ట
3. క. సలిపెడి
4. క. పాయక త్రోచి
5. క. కళికలపైఁదెంటి మెఱయ
6. క. మదినిండ వెలువడిపేర్చి
7. క. గర్వంబు
8. క. కంప్పంచె
9. క. దళములు బలియంగ
10. క. ములుచూపికడువాఁడి మొనలతోనున్న
11. మొగిల్లచూచితే క. మొగుళ్లుచూచిత్తే

మొ[1]గ్గలోయనఁ దెలియ మొగ్గలు నమరె,
మఱియును నొకచోట మ[2]ధురమంజరల
గిఱ[3]కొను సంపంగిక్రియ గాలి సోఁకి
త్రెళ్లిమై మఱచిన తేఁటులఁ జూచి
యల్లునేరెడుపండులని డో[4]యిలించి
కరములఁ గఱచినఁ గడు[5]వేడి యనుచు
ధరణిపైఁ బోఁజల్లి తమకంబు నొంది
జల[6]జపత్త్రంబులఁ జయ్యనముంచి
కొ[7]లఁకుల పొగడలక్రిందిపూఁ దేనెఁ
గొని తెచ్చి యొసఁగిన గొబ్బున నెగసి
చని సురపొన్నమంజరుల నంటుటయు
వె[8]డమాయపండులు వేరొక్కమానఁ
బొ[9]డిమి యాతరువునఁబొందెఁ బొమ్మనుచు
నొకముద్దరాలొక్క యువతికిఁ జెప్పె,
శుకవాణి! జానకి! చూచి తేవింత
నీతరి నేలకో! యిట్టింకులింక

1. మొగ్గ్లోయనఁదెలియమొగ్గలనమరె
క. మోగుల్లొయనఁదేలియ మొగములనమరె
2. క. మధుకరంబులును
3. క్రియగొన్నసంపంగిక్రియ గాలి సోఁకి
క. గొఱిగొనసంపంగి క్రియగాలిసోఁకి
4. డోఁయిలించి క. డోయలించి
5. వెండియగుచు
6. ఈరెండుపంక్తులు మాతృకయందు తారుమారుగానున్నవి
7. క. కెలఁకులకొలకుల కందిపూతెనె
8 క. వెడమాయకండు వేరొక్కవృక్షమున
9. బొడమెనాతరవునఁ బొందెఁబొమ్మనుచు

జాతియంతయుఁ బా[1]పజాతియో కాక
కలిఁ[2]గొట్టు క్రీడలఁ గలిఁగొట్టు మరుఁడు
చెలి[3]య ! పాంథులకందుఁ జేరంగరాదు
పూవిలుకాని కెంపులగాడుగనఁగ
నా[4]వటం బెంతయు నావటంబయ్యె"
ననియని చెప్పుచు నద్రిసానువుల
వనజాకరంబుల వననికుంజములఁ
బులినతటంబులఁ బు[5]ష్పవాటికలఁ
దలిరుజొంపములఁ జిత్రంపు దేశముల
విహరించి క్రమ్మర వీ[6]టికి వచ్చి
యహిమాంశుకులుఁడంత నతివయుఁ దాను
శా[7]శ్వతమహిమతో జననాథ ! యిట్లు
విశ్వంబుఁ దొమ్మిదివేలేం[8]డ్లు యేలె.

—: శ్రీరాముండు సంతతిలేక కుందుట —

అంత భూపాలుఁ డాయవనినందనకు
సంతతిలేకున్నఁ జాలచింతించి

1. క. పాపజాతియే కాక
2. కలిగొట్టు క్రీవదెక్కలి గొలిగొట్టు మరుడు క. కలిగొట్టుక్రీఁడి కలిగొట్టుమరుఁడు
3 క. వెలియపాంథుల కందు వెడలంగరాదు
4. నావటంబంతయు
5. క. పుష్పతలంబులు
6. వీటకి
7. క. శాశ్వతకీర్తిమై జననాయకుండు
8. తొమ్మిదివేలేండునేల

“తనయులులేని యా[1]తని యన్వయంబు
జననంబు వృథగాదె చర్చించి చూడ
నెందును సం[2]తానహీనులు కీర్తిఁ
బొందరెందును నందుఁ బు[3]ణ్యాత్ములైన
నెలకొన్న వగ[4]పులు నిట్టూర్పుగములు
బెల[5]యించివారల పితరులందఱును
ననుర[6]క్తిఁ దమకుదకాంజలికర్మ
మొనరించువాఁడింక నుర్విలేడనుచు
క్షితిఁ దమవంశవిచ్ఛేదంబుఁ దలఁచి
మతిలోనఁ ద[7]మయాస మాని తూలుదురు
ధారుణిసుతయందుఁ దనయులఁ బడయ
నే[8]ర నక్కట ! వంశనిస్తారకులనుఁ
గ[9]డుదుష్టదెస నొంది కాకుత్స్థకులము
పా[10]డ వడంచినజాడఁ బోవలె” ననుచు
జింతించి దేవతాసేవఁ గా[11]వింపఁ

1 క. యాతన్వి యౌవనము. ఖ. యాతని యౌవనము.
2. సంతానహీనులకీర్తి. క. సంతానహీనులై కీర్తి
3. క. పుణ్యాత్ములయ్యు
4 ఖ వగపుల
5. క. వెలయంగ వారల పితరులందఱును.
6. క. అనురక్తిఁదమకిడయే కాంజలికర్మ.
7. ఖ తమ యాశమాని కూలుదురు.
8. క. నెరయ నక్కట కులము నిస్తారకులను
9. క. కడుఁగష్టదెసఁ బొంది
10. క. పాడవడంచినయట్టి పుణ్యహీనుఁడను
11. గావించి,

—: జానకి గర్భమును ధరించుట , వర్షాగమనము :—

గొంతకాలమునకుఁ గోర్కెలుమీరఁ
జరముహూర్తంబున జ[1]నవిప్రవాస
కరమైన శ్రవణనక్షత్రాంతవేళ
హరివంశవర్ధనంబైన గర్భంబు
ధరియించె జానకి తదనంతరంబు,
మలయు రాయంచలు మా[2]నసంబునకు
వలుసలువోఁదమ్మివన్నియ చెదరఁ
బ[3]గులఁగ ఘనముగాఁ బాంధవర్గంబు
పొ[4]గులు చాతకములు పొచ్చెముల్ వీడ
జలజబాంధవకాంతి చొ[5]కపడంగ
మలయమా[6]రుతములు మందంబుగాఁగ
గొ[7]సరెడు నెమ్మిళ్లకుత్తుకలోని
కసటువా[8]యఁగ వానకాలంబువచ్చె.
ఆవేళ రఘుపతి యవనిజఁ జూచి
భావగర్భితముగాఁ బలికె నెయ్యమున

---

1. జలజనివాస. క. జనవిప్రవాస
2. క. మానంబునకు.
3. పగల్లు ఘనము గాపాంథవర్గంబు క పగల్లు మనము గా బంధువర్గంబు.
4. పొగలఁ జాతకములపుచ్చములు వీడ.
   క. పొగలు చాతకములు పుంజముల్ వీడ.
5 క. చవుకపడంగ.
6. క. మలయమారుతమును
7. కొసరెడు నెమళ్లకుత్తుకలోని క. కొసరెడు నిముళ్లకుత్తికెలోని,
8. క. బాయంగ.

“ ఘ[1]న నీలిమాంబుదాగ్రములయ్యె గిరులు
వినువీథి రుచులచే వెలితిగాదయ్యెఁ
గొలఁకులదరి నీరుఁ గొనియె సైకతము
వెలసె నావ[2]ర్తంబు వీచులు నెఱసెఁ
గైతకంబులు సితకాంతిఁ జూపట్టె
శీతాంశుమండలశ్రీ వింతయయ్యె ”
నని వినోదింపుచు నతిలోకలీల
జనకజయునుఁ దాను జననాయకుండు
సంతతక్రీడలు సలుపుచునుండె[3]
నంతఁ బంచమమాస మాసన్నమయ్యె.

—: శ్రీరాముండు దుస్స్వప్నముఁగాంచుట: —

అ[4]నుపమసుఖసుప్తుఁడై యొక్కనాఁడు
జనవల్లభుఁడు తనస్వప్నంబునందు
జడిఁగొన్న వగలచే సౌమిత్రిచేత
విడువంగఁబడి జాహ్నవీతీరభూమి
దిక్కులేనిదివోలె తిరుగంగ సీత
న[5]క్కలిఁ గాంచి దిగ్గన మేలుకాంచి
వెఱఁ[6]గంది రోమాంచవివృతాంగుఁ డగుచు

---

1. క. ఘననీలమంజులాగ్రములయ్యె గిరులు
2. క. వెలసె నావార్తంబు
3. క. సలుపుచునుండ.
4. క. అనుపమశుభసుప్తుఁడై
5. న క్కలఁగాంచి.
6. క. వెరఁగంది రోమాంచవికృతాంగుఁడగుచు

మఱిఁ బ్రభాతమున నేమములెల్లఁ దీర్చి
చేరువనున్న వసిష్ఠమునీంద్రు
తో రాత్రిఁ గాంచిన దుస్స్వప్నమెల్ల
వి[1]నుపించె హస్తారవిందముల్ మొగిచ్చి
"యనఘాత్మ! మముఁగావ నర్హుఁడవీవు
నరసి దుస్స్వప్నజంబైన దోషంబుఁ
బరిహరింపఁగ నీకు భారంబుగాదె
యే [2]కీడు మూఁడునో యీగర్భమునకుఁ

—: శ్రీరాముండు వసిష్ఠుని యనుమతిని సీతకుఁ బుంసవనముఁ జేయించుట :—

గా[3]కుండఁ బుణ్యాలగ్నము విచారించి
వలయు సీతకుఁ బుంసవనము సే[4]యింపఁ
దలఁ[5]పుడా!" యనుటయుఁ దపసి యిట్లనియె.
"ప్రథమపక్షము కృష్ణపక్షంబుకంటెఁ
బ్ర[6]థితంబు సకలశోభనకర్మములకు
నం[7]దునుఁ బరికింప నర్కవాసరము

1. క వినుపించి హస్తారవిందముల్ మొగిచి
ఖ. వినుపించె హస్తారవిందముల్ మోడ్చి.
2. యేకీడునో తండ్రి! యీగర్భమునకు క. యేకీడు వచ్చునో యీగర్భమునకు.
3. ఖ. గాకున్న.
4. సేయించ.
5. క. తలఁపు దాయనుట నత్తపసి యిట్లనియె.
ఖ తలఁపుడా యన్ననుఁ దపసి యిట్లనియె.
6. క. ప్రథితంబు నిజము శోభనకర్మములకు. ఖ. ప్రథితంబు శోభనకర్మములకును
7. క. నందుభరింపను నర్కవాసరము.

వ్వం[1]దుఁ బుణ్యక్షేత్రమందుఁ బుష్యమిని
నష్టమిఁ జేయంగఁ జనుఁ[2]బుంసవనము
సప్తాశ్వకులనాథ ! జన[3]కనందనకు ;
‘జగతిసురోత్తమ సంతర్పణంబుఁ
దగు[4] నొనరింప నీవందాఁక ” నని
నామాట విని రా[5]ముఁడనుజునిఁ జూచి
“సౌమిత్రి ! మిథిలకుఁ జని యీ తెఱంగు
జనకునితోడ విశ్వామిత్రుతోడ
వినుపించి వారల వెసఁ దెమ్ము లెమ్ము”
మనిన వేడుక మ్రొక్కి యతఁడు తేరెక్కి
చనియె, నిక్కడ రామచంద్రుండు వనుప
వరతోడఁ గూడిన యామడ నెర[6]వు
క[7]రయున్నతంబునుఁ గడు విచిత్రమునుఁ
గనకనానారత్నఖ[8]చితంబు నగుచు
ననుపమంబైన కల్యాణమంటపము
శిల్పవిజ్ఞానవిశేషకోవిదులు
కల్పించి రందఱుఁ గడు మెచ్చి పొగడ.

---

1. వందుఁ బుణ్యక్షేత్రమైన పుష్యమిని.
2 ఖ. దగు
3, జగతీనందనకు.
4. క. తగ నొనరింపు మందాఁకనీవనిన.
5. క రాముఁడనుజన్ముఁ జూచి.
6. వెళపు. క. యామడనిడుపు. ఖ. యామెడనెరుపు.
7. క కడు నున్నతంబైన కడు విచిత్రంబు. ఖ. గర యున్నతంబునుఁ గడు విచిత్రమును
8. క. ఖచితంబులైన.

జనకుండు కౌశికసంయమీశ్వరుండుఁ
జనుదెంచిరంతనా సౌమిత్రి కొ[1]లువ
హి[2]తబుద్ధిఁ బ[3]రికించి యిదివేళయనుచు
శ్రుతిపారగులు బహుశ్రుతిపరాయణులు
పా[4]వనాచారులు బహుకర్మవిదులు
నావామదేవాదులగువారు బలయ
వచ్చి[5] వసిష్ఠుఁడు వైదేహినపుడు
యచ్చటి మణిపీఠమందొప్ప నునిచి
చరుహోమ మొనరించి శాస్త్రమార్గమున
నిరు[6]వుర నభిషేక మెలమితోఁ జేయ
గొనకొన్న[7] లేఁదేఁటిగుంపులుఁదాల్చి
తనరారు నవ్యకేత[8]నముచందమున
ధాత్రిజ నీలకుం[9]తలములలోన
సూ[10]త్ర వేష్టన మొప్పెఁ జూడంగనపుడు,
లీలబ్రహ్మాండమాలికఁ దాల్చి మెఱయు

---

1. క. గొలిచి
2. క. హితబుద్ధి యెఱిఁగింప నిది వేళయనుచు.
3. ఖ. బలికించి
4. క. పావనాచార్యులు బహుకర్మవేదు.
5. క. వచ్చి వసిష్ఠుండు వైదేహినధిపు.
6. నిరువుర నభిమత మెలమితోఁ జేయ
   క నిరువుర నభిషేక మెలమితోఁ జేసి.
7. క. లేఁదేఁటిగుంపులో యనఁగ.
8. ఖ. కేతకము.
9. క. కుంతలములతోడ.
10. ఖ. సూత్ర మేపున నొప్పె.

న[1]కలంకగతి నుండె, నట నొక్కనాఁడు
మిగుల లోకమునకు మిత్రుండనయ్యు
పగలుచేసిన క్రూరభావుండ నేను
నిదె రాజు నామీఁద నేతెంచి నిలుచు
న[2]దనగునే నాకు నని విచారించి
తమ్ములుఁ దలవంపఁ దనయాస విడిచి
క్రమ్మనఁ దొలగినగతిఁ గ్రుంకె నినుఁడు.
ఆకళానిధిరా[3]క నరసి సమ్మదముఁ
గైకొని యా[4]మినీకాంత సంభ్రమము
కలిమిమై చెంగావిఁ గట్టి కస్తూరి
నలఁది ముత్యంబుల హారంబు వెట్టె
నన[5]నొప్పు నరసంజ యడరెఁ జీకట్లు
ఘ[6]నముగా మొనసెఁ జుక్కలు నంతనంత.
మిన్నేటి రాయంచ మేదినీజనుల
కన్నులమెచ్చు[7] రేగన్నియమగఁడు
కలువలవిందు జ[8]క్కవలతల్లడము
వెలఁది వెన్నెలవిత్తు విరహులతె[9]గులు

---

1 క. నకలంకుఁడై యుండె, నట నొక్కనాఁడు
2. క. నదనుగా దన నాకునని విచారించి
3. క. లోక మరసిసమ్మదము
4. క. యామినీకామినిఁ బ్రీతి
5. క. నన నొప్పు నరసంజ యడరు చీకట్లు
6. క. మొనసెఁ జుక్కలు నభంబున నంతకంత
7. క. రేగన్నియమగఁడు.
8 క. జక్కవలతల్లడము.
9. క. దిగులు.

ననలుఁడుఁ గడు దక్షిణావర్తశిఖలఁ[1]
దనరారె[2] మనమునఁ దన తేజమమర
నప్పుడు మునితోడ నా తెఱంగెల్లఁ
జెప్పంగఁ బఱతెంచి శిష్యులిట్లనిరి
"తనయుల నిద్దఱఁ దరణి[3] సన్నిభులఁ
గనియె[4] నజ్జానకి కడుఁజిత్ర మనఘ!"
అనిన సంతోషించి యమ్మౌని వేడ్కఁ
జని బాలకులఁ గాంచి సమయజ్ఞుఁడగుచు
దశరథుమనుముల తనుమార్జనంబుఁ
గుశముల[5] లవములఁగొని యాచరించె
నానిమిత్తంబున నా[6]బాలురతని
యానతిఁ గుశలవులన నొప్పిరంత.

—: కుశలవులు వాల్మీకియొద్ద సకలవిద్యల నభ్యసించి సర్వవిధములైన శస్త్రాస్త్రములఁ బడయుట :—

ధరణీతనూజ యాతనయులఁ జూచి

---

1. క. అనిలమిత్రుఁడు దక్షిణావర్తనముల
ఖ అనిలమిత్రుఁడు దక్షిణవాహశిఖల.
2. దనరారి మనమునఁ దన తేజమమర.
క తనరారు వంపెల్లఁ దనతేజమమర.
ఖ. దనరార వనమందరు తేజమమర.
3. క. ఖ. తరుణిసన్నిభుల
4 క గనియెను జానకి కడువిచిత్రముగ
ఖ. గనియె నాజానకి కడుఁజిత్రముగను.
5 క. కుశమున లవమునఁ గొనియాచరించి.
6. ఖ. నబ్బాలురతని.

పర[1]మానురాగసంభరితాత్ము లయ్యె.
చంద్రసూర్యులభంగి సతతంబు రామ
చం[2]ద్రనందనులంత సందీప్తులైరి.
అమ్మునీశ్వరుఁడంత[3] నయ్యిరువురకు
సమ్మదంబునఁ జేసె జా[4]తకర్మంబు
నృప[5]కుమారకులఁ బండ్రెండవయేఁట
నుప[6]నీతులుగఁజేసె నుక్తమార్గమున 68
నా[7]వసిష్ఠాదుల నమ్మునీశ్వరుఁడు
రా[8]వించి పలయు నర్చనలుఁ గావించి
యమృతాన్నచయములు నా[9]పూపికములు
నమృతఫలంబులు నా[10]దిగా భోజ్య
పానీయములు లేహ్యభక్ష్యచో[11]ష్యములు
నానావిధంబుల నవపదార్థములఁ

---

1. క. పరమానురాగసంభరితాత్మ యగుచు
2 చంద్రనందనులు సందీపితులైరి.
3 క నాయిరువురకు.
4. క. ఖ. జాతకర్మములు.
5 క. నృపకుమారుల పండ్రెండో యేట.
6 క. నుపవీతులుగఁజేసె యుక్తమార్గమున.
ఖ. నుపవీతులుగఁజేసె నుక్తమార్గమున.
7. నావసిష్ఠాదులు నమ్మునీశ్వరుఁడు.
8. రావించపలయు నర్చనలుగావించి
9. క. నాపూపకములు.
10. క ఖ. నఖిలభోజ్యములు.
11 భోజ్యములు.

గా[1]వించినఁ బ్రీతికాదన యాజ్ఞ
కామధేనువు వచ్చి కల్పించుటయును
నం[2]దఱకునుఁ గడుపార వాల్మీకి
విందుఁగావించె నుర్వీనాథ! వినుము,
బ్రా[3]హ్మణాశీర్వాదపాత్రంబులగుచు
బ్రహ్మచర్యంబునఁ బరఁగిరిద్దఱును
అనురక్తి నాంగంబులైన వేద[4]ముల
జననాథతనయులఁ జదివించె మాని
మఱవకయుండంగ మధురస్వరముల
మఱిఁ జదివించె రా[5]మాయణకథల
గగనంబు నిండ రాగము[6] మేళవించి
త[7]గులీల వినువారి తలఁపురాఁదిగిచి
ల[8]వుఁ డుగ్గళింపఁ దాళము జోకఁగూడి
కువలయాధిపువీణెఁగొ[9]ని పాడెఁ గుశుఁడు,

---

1. గావించినను ప్రీతికాదనయాజ్ఞ
క. ఖ. గావించినట్లుగాఁ గాదనయాజ్ఞ.
2. క. నందఱికినిఁ గడుపార వాల్మీకి.
3. క. ఖ బ్రాహ్మణాశీర్వాదపాత్రులై యపుడు.
4. వేదంబు. క. ఖ. వేదములు.
5. రామాయణకథయు.
క రామాయణం బెలమి. ఖ. రామాయణకథల
6. క. మేళవింప.
7. తగిలించి.
8. లవుఁ డుగ్గళించి తాళము జోకఁగూడి
ఖ. లవుఁ డుగ్గళించుఁ దాళముజోకతోడ
9. క. గొనియాడు కుశుఁడు

ఆల[1]కించిరి యప్పుడఖిలదేవతలు
మేలు మేలని చాల మెచ్చిరందఱును
విదితంబుగా ధనుర్వేదమంతయునుఁ
జదివించి కృపనిచ్చెఁ జాపద్వయంబు.
అ[2]నిమిషు లలిఁగిననైనఁ గయ్యములఁ
దునియని తఱుఁగని దొనలును నిచ్చె
దినకరాన్వయులకు ది[3]నకరాస్త్రంబు
నని[4]లసాయకము మోహనశిలీముఖముఁ
బా[5]వకాశుగమును భ్ర[6]మణాంబకమును
దేవగంధర్వాదిదివ్యబాణములఁ
గర[7]వాలచక్రముద్గరతోమరాది
వరశస్త్రముల నిచ్చె వాల్మీకిమౌని.
త[8]మతపోబలిమిమై దారుణాస్త్రముల
య[9]ములకు నిచ్చిరాయఖిలసంయములు,

---

1. క. ఆళతి విని యప్పు డఖిలసంయములు.
 ఖ. ఆళతి విని యప్పు డఖిలదేవతలు
2 క అనిమిషు లలిఁగిన ననిఁ జావకుండ
3. క. దినకరాస్త్రములు.
4. ననలసాయకము మోహనశిలీముఖము.
 క. ననిలసాయకములు నశిఖేటకములు.
5. క. పావనాశుభమును భ్రమణాంబకంబు
6. ఖ. భ్రమణంబకంబు.
7 క. కరవాలచక్రముద్గరభిండివాల
8. క. తమ తపోబలముల దారుణాస్త్రములు.
 ఖ. తమ తపోబలమైన దారుణాస్త్రములు.
9. క. ఖ. యములకుఁ దగ నిచ్చి రఖిలసంయములు

అవనీశ ! మ[1]ఱికొందఱసి ఖేటకములఁ
గవ[2]చకిరీటముల్ కరుణించిరంత
ధృతకాకపక్షులు దివ్యకోదండ
చతురులు దృఢవర్మచర్మశోభితులు
నమితతేజస్కులునై రాజసుతులు
తమతల్లి జానకిఁ దగ[3]నొప్పఁ గొలిచి
పాయక బహుచిత్రఫల[4]మూలములును
ధీ[5]యుక్తిఁ జలినీరుఁ దెచ్చి యిచ్చుచును
ధరణీశ ! యావనాంతరమున న[6]ట్లు
జరియిం[7]పుచుండిరి సంతోషమెసఁగ
అని కుశలవజన్మమంతయుఁ జెప్పె
జనమేజయునితోడ జైమిని యనుచు
సకలంబు సూతుఁడు శౌనకాదులకుఁ
బ్రకటించెనని యం[8]ధ్రభాష యొప్పలర,
శ్రీముకుందార్చనశీలుఁడు సుకవి
రామనార్యుఁడు కవిరాజమిత్రుండు
నీకుఁ బ్రియంబుగా నిఖిలైకధామ !

---

1. ఖ. మరికొంద అటు ఖేటకములు.
2. ఖ. కవచకుండలములు.
3. తగనొప్ప.
4. క. ఫలమూలరుచుల.
5. క. ఖ. తీయనిజలములఁ దెచ్చియిచ్చుచును.
6 ఖ. నిట్లు
7 ధరియించుచుండిరి.
8. క. యంధ్రభాష యొప్పారె.

కా[1]కుస్థకులరామ ! కల్యాణరామ !
పేమధురరీతిమై జైమినిభార
తమున విస్తరము విస్తారంబు గతుల
నలవడఁ గు[2]శలవోపాఖ్యానకముఁ గ
బలి[3]కితి నీపూర్వభాగంబు వినుము 708

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీరాజగోపాలాయ నమః.

ఇది పూర్వభాగము.



1. క. కాకుస్థకులనామ
2. క. గుశలవోపాఖ్యాన మెలమి.
ఖ. గుశలవోపాఖ్యానము. . . . . .
3 క. బలికితి నీపూర్వభాగంబు నెలమి.
ఖ. బలికితి విను పూర్వభాగంబు వినుము.

అవిఘ్నమస్తు.

శ్రీరామచంద్రాయ నమః.

# కుశలవోపాఖ్యానము.

## — ఉత్తరభాగము :—

శ్రీ రఘుకులనాథ! జితదైత్యనాథ!
సారసదళనేత్ర! జగదేకమిత్ర!
ఆ[1]కథికుఁడు శౌనకాదుల కనియె
మీకుఁ జెప్పెద నిటమీఁదిచందంబు
జనలోకనుతుఁడైన జైమిని యపుడు
జనమేజయునితోడఁ జతురుఁడై పలికె.

— శ్రీరాముఁడు వసిష్ఠుఁడు చెప్పినప్రకారము యశ్వమేధ యాగమునుఁ జేసి శత్రుఘ్నునితోడుగాఁ జేసి యధ్వరాశ్వమును వదలుట :—

అంత రాఘవుఁడయోధ్యానగరంబు
నెంతయుఁ బదిలుఁడై యేలుచునుండె.
"ఫలదాయకంబును బ్రహ్మహత్యాది
మలహారియును సర్వమఖనాయకంబు
వి[2]శ్వవేదాగమవేద్యంబునైన
యశ్వమేధము వేల్తు" నని యాత్మఁ దలఁచి

---

1 అకృత్రిమకుఁడు. క. అర్కాధికుఁడు.

2. విశ్వదేవాగమవేద్యంబునైన. క. విశ్వవేగాగమవేద్యంబులైన.

ది[1]నకరనిభు వామదేవు నాగాధి
తనయుఁ గాలవు భరద్వాజు వసిష్ఠుఁ
బిలుపించి య[2]నుజవిభీషణార్కజులు
కుల[3]జులుఁ బెద్దలుఁ గొలువ నిట్లనియె.
"అశ్వ[4]మేధము వేల్వ ననురక్తిపుట్టె
నశ్వ[5]మెట్టిది ? తగునాయాగమునకు
నే[6]నేమి ? గావింప నిప్పుడు వలయు
దాన[7]మెట్టిది ? యెట్లు? తత్ప్రకారంబు
వ్రతమేది ? తెఱఁగు సర్వంబును నాకు
హి[8]తబుద్ధి నెఱిఁగింపుడిది వేళ మీరు"
య[9]నిన వసిష్ఠుఁడిట్లనియె రామునకు
"వినుమెఱిఁగించెద వి[10]శదంబుగాఁగఁ

---

1 క. దినకరవిభు వామదేవు నాగాధి.
2. బిలుపించి యనుజవిభీషణార్క
క. ఖ. బిలుపించి యనుజవిభీషణార్కజుల.
3. క. అనుజులు పెద్దలు గొలువ నిట్లనియె.
4. క అశ్వమేధముసేయు ననురక్తి పుట్టె.
5. ఖ. నశ్వమెయ్యది తగు నాయాగమునకు.
6. క. యేమేమి గావింపు నిప్పుడువలయు.
7. దానమెట్టిది యట్టుండత్ప్రకారంబు.
క. దానమెట్టిది యందుఁ దత్ప్రకారంబు
ఖ. దానమెట్టిది యట్లు దత్ప్రకారంబు.
8. హితబుద్ధి నెఱిఁగింపు మిది వేళ యనిన.
క. ఖ. హితబుద్ధి నెఱిఁగింప నిదివేళయనిన.
9 క. అనియె వసిష్ఠుండిట్లనియె రామునకు.
10. క. విశదంబుగాను.

గడుఁ బ్రయాసంబునఁగాని యీమఖము
కడ[1]తేఱ దెంతయుఁ గలదు భూనాథ!
న[2]లుపొక్క చెవియందు నలినారిఁ దెగడు
తెలుపుమైఁ గాంచనదీ[3]ప్తి వాలమునఁ
గలుగు నుత్తమతురంగంబవశ్యంబు
వలయు జన్నమునకు వసుమతీనాథ!
వీరంబు కులమును వెరవునుఁ గ[4]లుగు
శూరులశ్వము వట్టఁజూతు రెవ్వఁడునుఁ
బగఱచే శ[5]బరాదిబలములచేత
నగపడకుండఁ బ్రయత్నంబుతోడ
నాయశ్వరత్నంబు నరయంగవలయుఁ
బాయక యొకయేఁడు పదిలంబుగాను;
మొదల వేవుర విప్రముఖ్యుల వేద
విదుల ఋ[6]త్విజుల రావించి యందఱకు
విను మొక్కరథమును[7] వేయిబారువలు
కన[8]కంబు లొకనూఱు ఘనతురంగములు

---

1. క. కడతేఱ దెంతైనఁ గలదు భూనాథ!
2. నలుపొక్కచవియును ఖ. నలుపొక్కచివియందు నలినారిఁ దెగడు.
3. క. దీప్తవాలంబు.
4. క. ఖ. గలుగ.
5 శబరాధిబలములచేత.
6. క ఖ. ఋత్విజుల గావించి యందఱకు
7. (వేయిభారువుల
8. క. కనకంబులును నూఱు ఘనతురంగములు
   ఖ. కనకంబు లొకనూఱు ఘనతురంగములు.

మదగజంబొక్కటి మంచివి నూఱు
మొదవులు నలుతుము ముత్తియంబులును
నలువురు భటులు నున్నతబలాధికులు
వలయు నొక్కొక విప్రవరునకు నొసంగ
నసిపత్ర మనుపేర నమరునీవ్రతము
వ[1]సుమతీశ్వర ! యెట్లు వర్తించెదీవు ?
సంతతసహధర్మచారిణియైన
కాంత యవశ్యమీక్రతుతంత్రమునకుఁ
గావున సతివెలిగాఁ బూని మఖముఁ
గావింప శాస్త్రంబుగాదంద్రు బుధులు
ఇనవంశచంద్ర ! నీవెట్లు ? గావించె
దనవుఁడు ర[2]ఘునాథుఁడనియె నూహించి
"జనకపుత్రికతోడ సరియైనయట్టి
కనకపుత్రికతోడఁ గావింతు మఖము
నటు[3]గాన నశ్వమేధారంభమిప్పు
డిటుసేయు డాలస్యమేటికి ? యనఘ !
మనలాయమునకేఁగి మంచియశ్వంబుఁ
గనుఁ[4]గొని తెండు నాకడకు మీ" రనిన
నావాక్యములు విని యావసిష్ఠుండుఁ
దా వాజిశాలకుఁ దడ[5]యక వచ్చి 30

1. ఖ వసుధీశ ! యెట్లు ప్రవర్తించెదీవు.
2. క. ఖ. రఘురాముఁ డనియె నూహించి.
3. క అటుగాన నశ్వమేధారవంబిపుడు ఖ. అటుగాన నశ్వమేధారంభమునకు
4 క. కనుఁగొని మీరు నాకడకుఁ దెండనిన.
5. క. తడయక బోయి. ఖ. తడయ కేతెంచి.

యరసి లక్షణయుక్తమగు తురంగంబు
ధర[1]ణీశవరునిముందఱకుఁ దెప్పించి
"తలఁచిన యట్లు నుత్తమతురంగంబు
కలిగెఁ[2] బొమ్మనె మెచ్చి కా[3]కుస్థు నెదుర
నా[4]నన శ్రీరాగహారిణియయ్యె
మా[5]నవేశ్వరునను మానివాక్యములు.
ఆవీరపుంగవుండపుడు బ్రాహ్మణుల
వేవుర నర్చించి వేర్వర భక్తి
హా[6]రులఁ దేరుల భూషణాంబరవళులఁ
గరు[7]ల రత్నంబులఁ గాంచనంబులనుఁ
గొదలేక యొ[8]ప్పుడు కోరినయట్లఁ
బిదికెడు మొదవులఁ జేయ[9]లనిచ్చి
భూసురాశీర్వాదపు[10]ణ్యనాదములు
భాసిల్లఁగా హేమపత్నితోఁ గూ[11]డి

---

1 ఖ. ధరణిజావరుని.
2 బొమ్మని.
3 కాకుస్థు నెదుర. క. కాకుస్థుకులుఁడు
4. క ఆననశ్రీరాగహారిణియుముగ ఖ. ఆననశ్రీరాగహారిణియైన.
5, క. మానవేశ్వరుఁడు నమ్మానివాక్యముల
ఖ మానవేశ్వరుని కమ్మానివాక్యములు
6 క హరులు దేరులు భూషణాంబరావళులు
7. క కరులు రత్నంబులు కాంచనంబులును
8 యెప్పుడు
9. ఖ బెయ్యాల నిచ్చి
10 పుణ్యానాదముల
11. గూఢ.

యటమీఁద దీక్షితుఁడై రామవిభుఁడు
పటుభక్తియుక్తిమై బహుచామరములు
మహితచందనదివ్యమాల్యకింకిణుల
విహితగంధాక్షతవివిధమంత్రముల
హ[1]య వేదులగు వసిష్ఠాదుల యాజ్ఞ
హ[2]యముఁ బూజించి యాహయముఫాలమునఁ
"కౌసల్య వీరశేఖరుఁ గన్నతల్లి
యాసాధ్వినందనుండాదిత్యకులుఁడు
వీరుఁడారఘుపతి విడిచిన హయము
ధీరాత్ముఁడగువాఁడు దీనిఁ[3] బట్టెడిని"
య[4]ను యర్థములతోడ నక్షరపంక్తిఁ
దనరు సువర్ణపత్రము లీలఁ గట్టి
ప్రియమున శత్రుఘ్నుఁ బిలిచి "యోవత్స!
హయము పిఱుందు నీవరుగంగవలయు
నా[5]చంద్రధరసురేంద్రాది దేవతలు
వేచి[6]పట్టిననైన విడిపించు హయముఁ

---

1 ఽ నయవేదులగు వసిష్ఠాదులయాజ్ఞ.
2. హాయముఁ బూజించి యాహయమువాలమున.
క హయముఁబూజించిరి హయముఫాలమున
3 క దీనిఁ బట్టెడిది ఖ దీనిఁ బట్టేది
4 యనుయర్థములతోడి యక్షరపంక్తి
ఖ యనుయర్థములనొప్పు యక్షరపంక్తి
5 నాచంద్రరథసురేంద్రాదిదేవతలు క నాచంద్రధరసురేంద్రాదులైన
6 క యేచి పట్టిననైన యెడవిడిపించు
ఖ. యేచి పట్టిన విడిపింపుము దీని

దన[1]ర నక్షౌహిణీత్రయము నీవెనుక
ననిచెద" నని చెప్పి యశ్వంబు విడిచె.

—: తపోవనమునఁ బ్రవేశించిన యధ్వరాశ్వమును లవుఁడు బంధించుట —

జననాథతనయుఁ డాసైన్యంబుతోడ
ననుగమింపఁగఁ దనకనువైన రీతిఁ
గదలి యాతురగంబు క్రమమునఁ బెక్కు
నదుల దేశంబుల న[2]గరశైలములఁ
బావనాశ్రమపరంపరలనుఁ గడచి
పోవుచోఁ గనుఁగొని భూపాలవరులు
నారాజతురగంబు నర్చించి మ్రొక్కి
యూ[3]రక తలవాంచి యుండిరందఱును.
కొందఱు రాజులుక్కునఁ గ్రొవ్వుమీఱి
యందంద బలముతో నార్చుచు వచ్చి
మదియించి వం[4]శాభిమానముల్ దలఁచి
కదియ నశ్వముఁ బట్టు[5]కొని రంతలోనఁ
గడి[6]మిమై నపుడు లక్ష్మణసహోదరుఁడు

1. దనర నక్షోహిణీత్రయము.
క. ఖ. తనరు నక్షోహిణీత్రయము
2. నగశైలములను.
3 క. యూరకె.
4 క. ఖ. వంశాభిమానంబుఁ దలఁచి.
5. బట్టికొని రంతలోన.
6. ఖ. కడిమి మైనప్పుడు ఘనుఁడుశత్రుఘ్నుఁ.

విడిపించి వారల విముఖులఁ జేసె.
వరుణుండు ప్రార్థింప వాల్మీకిమౌని
కరుణతో నాతని క్ర[1]తువుఁ గావింపఁ
గైకొని యురగలోకమునకుఁ బోయె.
ఆకా[2]లమున వచ్చె సధ్వరాశ్వంబు
జననాథ! యతనియాశ్రమభూమిఁ జేరఁ
జ[3]నుదెంచి లీలనచ్చట మెలంగుచును
మన్మథహిమకరమండలదళిత
సన్మార్గమగుచు వసంతంబెపోలె
గాలవశాండిల్యకౌశికమునులఁ
జాలమొప్పెడు బ్రహ్మసభయునుఁ బోలె
పనసరంభాశోకపా[4]టలిక్రముక
వినుతమై సు[5]గ్రీవువీడునుంబోలె
ఘ[6]నకదంబార్జునకరకావిభూతిఁ
గనుపట్టు తొ[7]లువానకాలంబెపోలె (50)
చ[8]లదళకాననచందనతిలక
కలితమై యతివశృంగారంబెపోలె

1. ఖ. క్రతువురక్షింప.
2 ఖ. నాలోన నటువచ్చె.
3 జనుదెంచె లీల నచ్చట మెలంగుచును.
క. జచుదెంచె లీల నచ్చట మెలఁగుచుండె.
ఖ. జగుదెంచె నచ్చట మెలఁగుచున్న.
4. క. ఖ పాటలిప్రముఖ.
5. ఖ. సుగ్రీవపీడునుంబోలె.
6 క. కనకదంబార్జునకరకావిభూతి
7. క. ఖ. తొలువానకాలంబు పోలె
8. ఘలదళకానన చందనతిలక. ఖ. చదలకాననతిలకచందనంబులను.

యాగూఢకుటజబాణాసనంబగుచు
భారతరణమహీభా[1]గంబెపోలె
వల[2]నొప్పు నత్తపోవనముఁ జొత్తెంచి
మెలఁగుచుఁ బచ్చిక మే[3]యుచున్న
తురగరత్నంబు నా[4]తురగంబువెనుక
సరభసగతి వచ్చు సామంతకులము
నావనరక్ష[5]కుఁడై యుండు లవుఁడు
భావించి దవ్వులఁ బ[6]రికించి కాంచి
తనతోడి ము[7]నివరతనయులఁ బిలుచు
కొని వారుఁ దానునుఁగూడ నేతెంచి
మొ[8]నసి యశ్వముఫాలమునఁ దేజరిల్లు
కనకపట్టముఁ గాంచి కణఁకతో విడిచి
"కౌసల్య వీరశేఖరుఁ గన్నతల్లి
యా[9]సాధ్వినందనుండాదిత్యకులుఁడు
వీ[10]రుఁడారఘుపతి విడిచిన హయము

1. ఖ భాగంబుబోలె.
2. క వలనొప్పు నత్తపోవనభూమిఁజొచ్చి
3. క ఖ. మేయుచునుండె
4 క ఖ. నాతురగంబువెంట.
5. క. రక్షకుఁడై యున్నలవుఁడు.
6. క. బరికించి చూచి.
7 మునివరతనయుఁ బిలిచి.
8. క. నునిచి యశ్వముఫాలమున.
9. యాసాధ్వినందనుఁ డర్కవంశజుఁడు.
10. యాతఁడువిడిచిన యధ్వరాశ్వంబు.

ధీరా[1]త్ముఁడగువాఁడు దీనిఁ బట్టె[2]డిని"
అ[3]ను యర్థములనొప్పి యందులోనున్న
జన[4]నాథుపత్రికఁ జదివి కోపించి
"తాన కౌసల్య యుత్తమవీరజనని
కా[5]ని మాజానకి కాదకో! యకట!
పు[6]ట్టు గొడ్రాలికి భూమిపై వింతఁ
బుట్టెఁ బో" మ్మని వాజిఁ బోనీక నగుచు
నొదవు వేడుకఁ దనయుత్తరీయమునఁ
గదళికాతరువునఁ గట్టెఁ, గట్టుటయు

—: మునికుమారులు వారింపఁగా లవుఁడు సమ్మతింపకుండుట :—

మునికుమారులు వీరముఖ్యునితో[7]డ
ననిరి దవ్వులవచ్చు యూసేనఁ జూచి
"యీ[8]రాజతురగంబు నేఁటికిఁ బట్టి
తూరక మదిమదినుండి నీవిపుడు
ననిలోన నిను వైరు లలుకమైఁ బ[9]ట్టు

1. నీతరిఁ బట్టెడు యేగర్విసైన.
2. ఖ. దీనిఁ బట్టెడిది.
3. యను యర్థములనొప్పు నందులోనున్న.
4 క. జననాథుపద్యంబుఁ జదివి కోపించి
5. క. కౌన మాజానకి కాదకో యకట!
6. పుట్టుగొడ్రాలకో భూమిపై వింత.
7. క జూచి.
8 క యేరాజతురగమో యేఁటికిఁ బట్టి.
9 బట్టి.

కొ[1]నిచన విడిపించుకొన దిక్కు కలదె
వి[2]డు మెందు మునులకు వీరకర్మములు
కడతేరునే నిత్యకర్మంబులట్లు
జ[3]ప మెన్నుచోఁ గాక శరమెన్నుచోట
నిపుణంబులే మూర్ఖ! నీదు[4]వేళ్లరయ
జనకజతనయ! మాసత్యవాక్యముల
విను'' మంచుఁ బలికిన వెడ నవ్వి పలికె,
"తామసులగు మునితనయులు మీరు
భూమితనూభవపుత్రుఁ[5]డ నేను
జానకికడుపున జన్మించినతఁడు
మానునే వీరకర్మ[6]మునకుఁ జొరక
వెఱచి యాగుఱ్ఱంబు విడుచుటకంటె
వెఱవక ప్రా[7]ణముల్ విడుచుట మేలు
వనము కావలిపెట్టి వాల్మీకి నమ్మి
చనుటేమి! నే[8]నిట జాఱుటయేమి!
అట్లైన మాతల్లి యందరిలోన
'ని[9]ట్టి శూరులఁగాంచెనే' యంచు నరులు

1. కొనిచన్న.
2. విడువుమే మునులకు.
3. క. జపమెన్నుచోచోట శరమేర్చుచోట.
4. క. నీకు వేళ్లరయ.
5. పుత్రుండ యేను.
6. క. కర్మమునకను జొరక.
7. క. ప్రాణంబు.
8. క. నేనెట్ల. ఖ. యేనిట
9. క. నిట్టిశూరులఁ గాంచెనని యెంచుకొనరె.

కొ[1]నియాడుమాటలు కొనసాగ విపుడు
మనమునఁ బిఱికినై మగుడితి నేని."
అనవుడు "నీఫలం బంతయు నీవ
య[2]నుభవించెదుగాక !" యని దూఱఁ బలికి
యచ్చోట ని[3]లువక యార్తులై విడిచి
వచ్చి రాలవుఁ డుండె వాజి చేరువను.

— శత్రుఘ్నుని సైనికులు లవుని నశ్వము నిమ్మని యడుగఁగా
లవుఁడు యుద్ధమునకు సిద్ధపడుట —

శత్రుఘ్నరథికు లాసమయంబునందు
ధా[4]త్రీశతిలక ! ముందఱఁ బాఱుతెంచి
యెందున్న ? దశ్వంబు యెందున్న ? దనుచు
సందంద వలుకుచు ననతిదూరమునఁ
గదళీకాతరువునఁ గట్టినహయము
నెదురునఁ బో[5]డగాంచి యిది చిత్రమనుచు
న[6]టనున్న వడుగుల నందఱఁ జూచి
"యి[7]టుగట్టినాఁ డెవ్వఁ డీవాజి నిపుడు ?"

---

1. కొనియాడుచు మాటలు కొనసాగనిపుడు.
   క. కొనియాడుమాటెల్లఁ గొనసాగునిపుడు.
2. క. యనుభవింపుదువని యని దూఱఁబలికి.
3 క. నుండక.
4 క. ధాత్రీశతిలకుముందఱఁ బాఱతెంచి.
5. బొడగాంచి యది చిత్రమనుచు. క. బొడగాంచిరిది చిత్రమనుచు.
6. యటనున్న వడుగుల నందఱఁజూచి.
   క. యటనున్న వడుగుల నందఱిఁజూచి.
7. యిటు గట్టినాఁ డెవ్వఁ డీవాజినని.

అనవుండు త[1]నుమీఁది యపరాధముడుగ
న[2]నిరొక్కమాటగా నతిదైన్యమునను
"వి[3]నుడు చెప్పెదమిదే వృక్షంబుక్రిందఁ
దనభయంబెఱుఁగక తానున్నవాఁడు
లవుఁడనుపే[4]ర బాలకుఁడల్లవాఁడె
యవలీల నాతఁడీయశ్వంబుఁ[5] గట్టె"
నన[6]వుండు నవ్వుచు నమ్మహారథులు
"తన[7]మది నెఱుఁగఁడీతడు బాలుఁడ"నుచు
"విడు[8]విడు నీవింక వేగంబె హయము
నడువం[9]గవలయు జన్నంబున కిపుడు"
అని పల్క విలుఁగొని యప్పుడాలవుఁడు
చనుదెంచి సంవర్తసమవర్తిబోలె
"అన్ని పంతములేల ? హా[10]యము నావద్ద

---

1. క. తనుమీఁద నపరాధముడుగ.
2. క. ననిరి యొక్కమాట యతిదైన్యమెసఁగ.
3. క. వినుడదె చెప్పెదము వృక్షంబుక్రింద.
   ఖ. వినుడు చెప్పెదమదే వృక్షంబుక్రింద.
4. పేరి, క పేరి
5. క బట్టె.
6. క. నన విని నవ్వుచు నామహారథులు.
7. తనమదివెరఁగంది తగబాలుఁడితఁడు.
   క. తనమది నెఱుగఁ డీతఁడు బాలుఁడగుట.
8. విడువుండు విడువుండు వేగంబె హాయము.
   ఖ. విడువుము విడువుము......
9. క. నడువంగవలయు జన్నమునకు యిప్పుడును.
10. హయమునా వెనుక. ఖ. హయమునాయందు.

నున్నది వి[1]నుడింక నుదుటులేమిటికి
న[2]నుగెల్చి శూరులై నన్ను నోడించి
కొనిపొండు మీరు మీగుఱ్ఱంబు" ననినఁ
'గడి[3]మి నావాక్యంబుఁ గైకోక హయము
విడు[4]పింపఁబూనిన వీరులనెల్ల
శాతవజ్రప్రభాచటులబాణములఁ
జేతులఁ దె[5]గనేసెఁ జెలఁగి యాలవుఁడు.
కరములు తెగిన దిగ్గజములో యనఁగఁ
గర[6]ములఁ ద్రెళ్లి నాఘనులు కూలుటయు

—. లవుఁడు శత్రుఘ్నుని సైన్యమునుఁ జెండాడుట .—

జా[7]నకీతనయుని సత్వంబుఁ జూచి
యే[8]నాఁటఁ గడుఁజిత్ర మీచందమనుచుఁ
గనుఁగొని చలము వెగ్గలముగా బలము
చనుదెంచి వెసనార్చి శరవృష్టిఁ గురిసె.

---

1. వినుఁడింక నొకచోట లేదు.
2. నను గెల్చి శూరులై నానవాటించి.
   క నన్ను గెల్చి శూరులై నన్ను బాటించి.
3 క. ఖ కడిమినవాక్యంబుఁ గైకొనక హయము.
4. క. విడుపింపవచ్చిన. ఖ. విడిపింపఁబూనిన
5. క. దెగవేసె.
6. క. కరములు ద్రెవ్విన ఘనులు గూలుటయు,
   ఖ. కరములుద్రెళ్లి యాఘనులు గూలుటయు.
7. క. ఖ. జానకీతనయుని శౌర్యంబుఁ జూచి.
8. క. యేనాటఁ గడుచిత్ర మీతెఱంగనుచు.
   ఖ. యేనాటఁ గడుచిత్ర మిత్తెఱంగనుచు.

కొందఱు శక్తులఁ గొందఱు గదలఁ
గొం[1]దఱు శరములఁ గుంతఖడ్గముల
బలువుగాఁ గొందఱు పట్టిసశూల
కులిశముద్గరహేతిఘోరాయుధముల
లక్షించి నొ[2]ప్పింప లవకుమారకుని
నక్షౌహిణులు మూఁడు న[3]ట్టు జుట్టుముట్టఁ
దనలోన నవ్వుచుఁ దడయక లవుఁడు
సునిశితాస్త్రంబుల సోనలుఁ గు[4]రిసె.
నరుఁడు గోదావరినదిలోన మునిఁగి
దురితవర్గములఁ బోఁదోలుచందమునఁ
బలు[5]కనేయఁగఁ బూనఁ బైకొనసీక
తల[6]చెడిపార నాదళములఁ బరపె.
దిన[7]కరాన్వయుఁడంతఁ ద్రెవ్వనియంప
దొ[8]నల నమ్ములఁగొని దుర్దాంతుఁడగుచు

---

1. క కొందఱు ముసలాలఁ గుంతఖడ్గముల
   ఖ. కొందఱు చక్రముల్ కుంతఖడ్గముల
2. క. ఖ. నొప్పించి.
3. నట చుట్టుముట్టి, క నటు చుట్టుముట్టి, ఖ. నటు చుట్టుకొనియె.
4. క గురియు.
5. క. పలుకనేయఁగఁబూనఁ బైకొనలేక.
   ఖ. బలినేయఁగఁబూనెఁ బైకొననీక.
6. క. తలచెడిపారను దళములఁబరపె
   ఖ. తలచెడిపార నద్దళములఁబరపె
7. క. దినకరాన్వయుఁ డెడతెంపనియంప.
   ఖ దినకరాన్వయుఁడెడ యవ్వనియంప
8. దొనలయమ్ములఁ దొడిగె దుర్దాంతుఁడగుచు.

సందఱి నేఁటింట నైదింట నేసె
మ్రం[1]దిన పగల రొమ్ముగల నమ్ముగల
ఘన[2]శైలములఁబోలు గజశరీరములఁ
దును[3]కలుగానేసెఁ దుండతుండముల
తో[4]డిన రెండును మూఁడుఁ దునుకలై నేలఁ
బ[5]డనేసి చెక్కుల వాపిదంతముల
నురవార బలముల యోజమావఁతుల
శిర[6]ముల ధరఁగూల్చి సిడముల నఱికి
కరి[7]మించి కరురత్నఘంటి కావళుల
బి[8]రుదు టెక్కెయములఁ బెల్లుగా రాల్చి
వీరుఁడై యామేటివి[9]లుకాఁడు మఱియుఁ

---

1. మ్రంచినపగల రొమ్ముగల నమ్ముగల క మ్రందిన పగలలో మగలరొమ్ముగల.
   ఖ సందినపగల నమ్ముగలరొమ్ముగల.
2. ఘనశిలములఁబోలె. క. ఘనశైలములబోలె.
3. తునుకలుగా నేసెఁ దుండదండముల.
   ఖ. తునుకలుగాఁజేసి తుండతుండముల
4. క. తోడిగి రెండునుమూఁడు తునుకలై నేల.
   ఖ. తోడరి రెండునుమూఁడుతునియలై నేల.
5 క. పడనేసి చెక్కులు పాటిదంతములు.
   ఖ పడనేసి చెక్కులు వాపెదంతములు
6 క. శిరములు ధరఁ గూల్చె సింహావిక్రముఁడు
   ఖ. శిరముల ధరఁ గూల్చి చేతులు నఱికి.
7. కరమంచి రత్నఘంటి కావళుల
   క. కరిమంజికలురత్న ఘంటి కావళులు
   ఖ. కరిమించికరురత్న ఘంటి కావళులు
8. క. బిరుదుటెక్కెములెల్లఁ బెల్లుగారాల్చె.
   ఖ. బిరుదుటెక్కెములు పెల్లుగారాల్చి
9. ఖ. విలుకాఁడుబోలె.

దేరులకురికి సందీప్తబాణములఁ
జక్ర[1]రక్షకులను సమయించి మించి
చ[2]క్రముల్ ద్రుంచి పాశంబులఁ ద్రుంచి
చటు[3]లాశ్వములఁ బోరి చమరిచామరల
విట[4]తాటనములఁ జేసి విండ్లనుఁ దునిమి
సూ[5]తుల నెత్తుట జొత్తిల్లఁ జేసి
యాతపత్రావళి నఱువుల్లుసేసి
తో[6]డ నశ్వంబులతోడఁ బక్కెరల
తో[7]డ భూషణములతోడఁ జేనున్న
యసికుంతపరిఘగదాదులతోడఁ
బ[8]సికమై రౌతులఁ బ[9]రలోక మనిపి
కరముల నురములఁ గం[10]కణంబులను

---

1 క. చక్రత్రివేణులఁ జక్కాడి మఱియు.
ఖ. చక్రత్రివేణులఁ జక్కాడితోన

2. క. చక్రరక్షకుల నెల్ల సమయించి మించి
ఖ చక్రరక్షకులను సరిఁ ద్రుంచి మించి.

3. చటులాశ్వములబారి సమరిచామరలు
క. చటులాశ్వములబొలియు సమయుచామరలు.
ఖ. చటులాశ్వములబారి సరిచామరములు.

4. క. విటతాటముగ నేసె విండ్లనుఁ దునియ.

5. ఖ సూతు నెత్తుటదొప్ప జొత్తిల్లఁ జేసి.

6. తోనయశ్వంబులుతోన పక్కెరలు
క. తోనయశ్వంబులతోడ పెక్కురులు.

7. లోనభూషణములుతోన చేనున్న.
క, తోనభూషణంబులతోన చేనున్న.

8. క. భసితమై.

9. క. బరలోక మనిపె.

10. క. కంటకంబులను. ఖ. కంకటంబులను.

శిరముల నర[1]ములఁ జెవులఁ జెక్కులను
మెడలనుఁ దొడలను మెఱుఁగుకైదువులఁ
బొడవుల నడుముల బొమల ముక్కులను
నెఱుఁగ రాకుండ ననేక బాణముల
నటికి కాల్బముల నలినలిసేసి
యింద్రజాలముఁ జూపెనితఁడన రామ
చంద్రనందనుఁడంత సమరరంగమున
వేడుక నెదిరిన వీరులచేతు
లా[2]డకయుండఁ జెండాడ నాలవుఁడు
నా[3]డె లోకము కొనియాడెఁ బెల్లట్ట
లా[4]డె నెత్తుట నోలలాడె భూతములు
నీతెఱఁగున లవుండేపు రెట్టింపఁ
జేతుల కసి[5]పోవఁ జిత్రంబుసేసె.
అరుదార వెల్లియై యప్పుడాలవుఁడు
శర[6]ధుల వాహినీశతముల మ్రింగె.
హరులతోఁ గరులతో నర[7]దాలతోడ

1. నురముల. క. నురములు. ఖ. నరములు.
2. క లాడకుండఁగఁ జెండాడినరీతి.
ఖ. లాషంగఁ జెండాడె నారదుఁడు?
3. నాడె లోకము గొనియాడెఁ బల్లటి.
క. నాడలోకములు గొనియాడెఁ బెల్లట్ట.
ఖ. నాడె లోకము గొనియాడెఁ బెల్లట్ట.
4. లాడె నెత్తురు సోనలాడె భూతములు.
5. క. కసివోవ.
6. క. శరముల వాహినీశరధుల మ్రింగె.
7. నరునాలతోడ.

నరు[1]లతో నప్పుడు నాసైన్యవిభులు
లవసాయకంబుల ల[2]వమూర్తులైరి.
అవలీల సా[3]యుజ్యమరులకు నొసఁగు
శ్రీరామచంద్రునిశిశువైన యతఁడు
సారూప్యమొసఁగుటాశ్చర్యమే యనఁగ
జగతీశ ! హతశేషచ[4]తురంగబలము
మొగి నొక్కచోటికి మూఁకగాఁ బఱచి
నిలిచి యాదిమరుద్రనిభమూర్తివో[5]లె
వెలుఁగుమంటలతోడి విశిఖజాలములఁ
జక్కాడునప్పుడు జనలోకనాథ !
అక్కజంబయ్యె నేమనిచెప్పవచ్చు
నొఱలుచుఁ గెడయు మావుఁతులు రౌతులునుఁ
దఱచుగా రాలు దంతములుఁ గుంతములు
లవములై తొరఁగు ఫాలములు వాలములు
రవమునఁ బడు మహారథులు సారథులు
దక్క[6]క నలియు డెందములుఁ గందములుఁ
జక్కైన తనువిలాసములుఁ బ్రాసములు
నై[7]య్యుండె లవుఁడంత నంతటఁ బోక

1. క. నరుతో నాడెస నాదేశవిభులు.
2 క. లవలవలైరి.
3. క. ఖ. సాయుజ్య మమరుల కొసఁగు.
4. ఖ. చతురంగములను
5. క. ఖ బోలె.
6 క. ఖ. దక్కక నలియు కందములు డెందములు.
7. ఖ. నయ్యోడ లవుఁడంత నంతటఁబోక

కయ్యంబు వేడుకఁ గ[1]డలొత్తి యురక
రథములు గిరులు చక్రములు సానువులు
రథి[2]కులు శిలలు సారథులద్రిచరులు
కరు[3]లు కుంజంబులు ఘంటికావళుల
నర[4]య నామ్రోఁతలే యళుల నాదములు
కరములు దందశూకంబులు మెఱయఁ
దొరఁగెడు మదములందుల మరందములు
హయములు పుండరీకాదులు సుభట
చయము లత్యున్నతసాలసంఘములు
గిఱికొన నెత్తిన కేలుశాఖలును
తఱ[5]చు రత్నాంశు లాదావాగ్నిశిఖలు
ఘన[6]శస్త్రములు కంటకంబులు గాఁగఁ
దనరారు శత్రు[7]ఘ్నుదళమను నడవిఁ
బలుదెఱంగుల లవప్రళయమారుతము
కలయ నొకటఁ జాపకట్టుగాఁ గూల్చె.

---

1. కడలెత్త నురక. ఖ. కడలెత్తి నురక.
2 రథములు శిలలు సారథిర లద్రిచరులు
3 క. కరులు కుంజంబులు ఘంటలైయూర్పు.
ఖ కరులు కుంజంబులు ఘంటలై యొప్ప
కరులుగుజ్జంబులు ఘంటికావళుల.
4. క రరయు మ్రోంతలైయై నాదములు.
ఖ. ఆలరు నామ్రోఁతలే అలులనాదములు.
5. తరుణరత్నాంశులు దావాగ్నిశిఖలు.
6. క. ఘనశస్త్రచయములు కంటకంబులును.
7 క. శతుఘ్ను దళమును నడిచి.
ఖ. శత్రుఘ్ను దళమునేటడవి.

### — లవశత్రుఘ్నులయుద్ధము. —

అప్పుడు శత్రుఘ్నుఁ డశ్వపాతముల
చప్పుళ్లు గజముల సమయు నాదములఁ
గూలెడుభటుల నెక్కుడు విలాపముల
వ్రాలెడురథముల వారిఘోషములఁ
జదలఁ బర్వెడు లవజ్యానినాదములఁ
బదిదిక్కులఁ జెవుడుపఱపంగ వినుచుఁ
బడుచున్న చందంబు బలమెల్ల నేలఁ
బడుచున్న చందంబుఁ బలుమాఱుఁ జూచి
కడుఁ[1]జిత్రమని మెచ్చి కడిఁదికోపమునఁ
దడయక రథమెక్కి ధనువు మ్రోయించి
నలు[2]వొప్పఁగా సింహనాదంబుఁ జేసి
"నిలు[3]నిలు" మని పల్కి నెఱి నెదుర్కొనియె.
అటువచ్చు పినతండ్రి నక్క[4]మారుండుఁ
బటుతరాస్త్రంబులఁ బ[5]దియింట నేసె.
తెగువమై మ[6]ఱియును దృఢముష్టి నురము
ప[7]గుల మహేశ్వరాంబకమున నేసె

---

1. క కడుచిత్రమని మెచ్చి కణఁగికోపమున.
   ఖ కడుచిత్రమున మెచ్చి కడఁగికోపమున.
2. క. నలుదిక్కులను సింహనాదంబుఁ జేసి.
   ఖ. నలుదిక్కులఁ సింహనాదంబుఁ జేసి.
3. క. ఖ. నిలునిలుమని పల్కి నిగుడి మార్కొనియె.
4. క. నక్కుమారకుఁడు.
5. క. పదిట నొప్పించె ఖ. పదిట నొప్పించి.
6. క. మఱియు నాదృఢముష్టి నురము.
7. పగల క. పగుల మహేశ్వబాణంబు నేసె.

శరముల నాల్గింటఁ జక్రరక్షకుల
హరియించి హరులపై నన్నియుఁ జో[1]నిపి
పడ[2]గలల్లాడఁ జాపమునారిఁ ద్రిప్పి
తొ[3]డరి యొక్కట రెండుతూపుల నేసె,
అలిగి వెం[4]డియు నారి నాలవణారి
బలువింటనెక్కించి పంతమెక్కించి
నరనా[5]థసుతునేసె నారాచతతులఁ
బరికించి మఱిఁ బెక్కుబా[6]ణంబులేసె,
మఱియు ఫాలంబుల మార్గణత్రయము
నెఱవైన కడి[7]మిమై నిగుడించుటయును
నగుచు బాలుఁడు పల్కె "నాలలాటమునఁ
దగు[8]లంగ నేసితి ధరణీశ! కొన్ని
యవి క్రమ్మదమ్ములో యమ్ములో నాకు
వివరంబుగాఁ జెప్పవే వెఱ్ఱితండ్రి!
యీచేతఁ జేసిన యింతట నీకు

---

1. క జొనిపె.
2. క. పడిగె ల్లాడెఁ జాపమునారిఁ ద్రెవ్వ
 ఖ. పడఁగ యల్లాడఁ జాపమునారిఁ ద్రెవ్వ
3. క. తొడిగి యొక్కట రెండుతూపులఁ బరపె
 ఖ. తొడిగియు నొక రెండుతూపులఁ బరపె.
4. రెండవనారి.
5 క నరనాథనాళికానారాచతతుల.
 ఖ. నరనాథు నారాచతతులఁ గైకొనక.
6 క. బాణంబులేయ.
7 ఖ. కడఁకమై
8 క. తగులవేసితిగదా ధరణీశ! కొన్ని.
 ఖ. తగులంగనేసి ధరణీశ! కొన్ని

రాచపంతము లేల ? రణములో నేఁడు,”
అనిపల్కి తోడనే యార్చుచు నాల్గు
ఘనశరంబులఁ దు[1]రగముల నాల్గింట
నసు[2]వులఁ బెఱికి యొక్కమ్మున సూతుఁ
బస[3]రంగఁ గొని రెంటఁ బడగయుఁ గూల్చె.
కాండ[4] మొక్కట మఱిఁ గాకుస్థు విల్లు
రెం[5]డుగాఁ ద్రుంచె ధరిత్రిజాసుతుఁడు.
ఆ[6]రీతి విల్లును హయములు రథము
సారథియును ల[7]వాస్త్రముల నుగ్గైనఁ
దలకొని నేలకుం దాఁటి వేరొక్క
విలుఁగొని యా రాజు వెండి చూపడర
సడలక గృధ్రపత్త్రంబులతోడఁ
గడువాఁడియగు నొక్కకాండంబుఁ దొడిగి
‘పడుచ ! యెక్కడికైనఁ బా[8]ఱిపోరోరి !
తడసినఁ బ్రా[9]ణంబు ధరియింపఁగలవె

---

1. ఖ. తురంగముల నాల్గింట
2 క. నసువులు బెఱికి రెండమ్ముల సూతు.
ఖ. నసువులు వెర్కి యొక్కమ్మున సూతు.
3. క. పసుగరఁగొని రెంటు పలుకయుంగూల్చె.
ఖ. పసగరఁగొని రెంట పడగయుఁ గూల్చె.
4. క. కాండమొక్కట నేసె.
5. క రెండుగా విఱిచె ధాత్రీజసుతుండు
6 ఆరీతి విల్లు హయములు రథము. ఖ. ఆరీతి హయములు నవలీల రథము.
7. క. లవాస్త్రముల నుగ్గైరి.
8 ఖ. పారిపోమ్మోరి !
9. క. ప్రాణముల్.

బలితం[1]పుశరమునఁ బడనేయనాకుఁ
గొలుపదు నీమీఁదఁ గొనకొన్నకరుణ
నెన్నిజన్మంబుల నిఁ[2]కనిట్టికొడుకుఁ
గన్నా[3]ర నెన్నఁడు ? కాంచు మీతల్లి
కావున నూరక గర్వించి య[4]విధిఁ
బోవక నాదైన బుద్ధులువినుము."
అనుమాటవిని ల[5]వుండతికోపుఁడగుచు
ఘనశరంబొక్కటి క[6]డఁకతోఁ దొడిగి
యీమాటలోనుగా నాదివ్యశరము
భూమిజాసుతుఁడు నేర్పునఁ ద్రుంచుటయును
సడలి దుర్గతిఁ గూటసాక్షివంశజులు
పడి[7]నచందంబున బాణంబుగూలె.
వెఱఁగంది యీరామవిభుతమ్ముఁడంత
మఱియును నొకదివ్యమార్గణంబేర్చి
(ఘనవజ్రనిధిగాక కాండమేయనుచు
వినుతించి యం[8]తయు వెఱచె లోకములు) *

---

1. ఖ బలితంపు శరముల.
2. క. నీయటికొడుకు
3. ఖ గన్నారు నెన్నఁడు గాంచు మీతల్లి.
4. యవధి.
5. ఖ లవుండతికోపమెసఁగ
6. ఖ. కణకతోఁ దొడిగి.
7. పడినచందమున భూభాగంబు గదిసి
   క. పడినచందంబునఁ దద్బాణముల్ కూలె.
   * ఈపద్యము మాతృకలోనిదికాదు. క. ఖ. గ్రంథములలోనిది.
8. ఖ. యంతంత.

జన[1]నాథుఁడదివింట సంధింప దోనల
ధనువుఁ దద్బాణంబుఁ దనయుండు ద్రుంచె.
ధరణీశ ! యమ్మహీధవుఁడును లవుఁడు
దుర[2]ముఁ గావించిరుద్ధతలీల నిట్లు.

— శత్రుఘ్నుఁడు నారాయణాస్త్రముచేత లవుని మూర్ఛిల్లఁ జేయుట :—

ఆలోన శత్రుఘ్నుఁడాబాలుఁ జూచి
కాలాం[3]తకుఁడువోలె కడు నుగ్రుఁడగుచుఁ
బూనిక లవణుపైఁ[4] బోయెడునాఁడు
భానువంశుఁడు రామభద్రుఁడు కరుణఁ
దనకునిచ్చినయట్టి ధను[5]రుత్తమంబు
గొనయమెక్కించి దిక్కు[6]లు ఘూర్ణిలంగ
నీమా[7]త్రమునకెల్ల నిదియేఁటికనుచు
రామభ[8]ద్రుఁడు మున్ను రావణుమీఁద

1. జననాథుఁ డటువింటు సంధింపతోన.
ఖ. జననాథుఁ డదివింట సంధింపదోన.
2. దురముఁగావింప నుద్ధతతలనిల్లు
క. దురముఁగావించి రుద్రునిభంగి నిలిచె.
3. క. ఖ. కాలాంతకునిబోలె.
4. ఖ. లవునిపై.
5. ధనువో త్తమంబు. క ధనువుత్తమంబు, ధనురత్తమంబు.
6. క. ఖ దిక్కులు తల్లడిల్ల
7. యీముత్రమునకెల్ల యిదియేంటి కనుండు.
క యీమాత్రమునకేల యిదివేయననుచు.
8. క. రామచంద్రుఁడు మును
ఖ. రామచంద్రుఁడు మున్ను.

నేది[1]వ్యబాణంబు నేయకమాన
నాదికా[2]లమున నేయస్త్రంబుచేత
మధుకైటభులు ము[3]న్ను మర్దింపఁబడిరి
యధి[4]కుఁడీశ్వరశూలహస్తుఁడై యున్న
లవ[5]ణుఁడేశరమున లయమునుఁబొందె
నవలీల నట్టినారాయణాస్త్రంబు
సంధిం[6]చి "యిదె ఓరి! చావు పొమ్మ"నుచు
బంధురంబుగ నార్చి[7] పై నేయుటయును
సడ[8]లిన పిడుగులు జడివానఁ దొరుఁగ
వడ[9]వడ వడఁకి పర్వతములుఁ దిరుగఁ
గమలాప్తచంద్రులు గ[10]తిఁదప్పినడవ
నమరులకెల్ల మహాభీతి యొ[11]సఁగఁ 130

---

1. క. యీదివ్యబాణంబు వేయకమాన ఖ యేదివ్యబాణంబు లేయకనానె.
2. నాదికాలమున నీయస్త్రంబుచేత
3 క ఖ వెస.
4 అధికుఁ డీశరశూలహస్తుఁడైయున్న
ఖ అధికుఁడీశ్వరశూలహస్తుడైయున్న,
5. క లవుఁడీశరమున లయమునుఁ బొందుగాక.
ఖ లవుఁడీశరమున లయమునసుండె
6 సంధింప యిదివోరిఁ చావుబొమ్మనుచు
క ఖ. సంధించి వెస నోరి చావుబొమ్మనచు.
7 క పైనేయ నదియు.
8. సడలని పిడుగులు జడివానఁ దొరుఁగ
క సడలిన పిడుగులు జడివానఁ గురియ
ఖ ఘడలక పిడుగులు జడివానఁదొరఁగ.
9. క వడవడవణఁక దిక్పర్వతములు దిరుగ
10. గతిఁదప్ప నడవ ఖ గతిఁదప్ప నరుగ.
11. క గాఁగ. ఖ. దొరుగ.

బటపటయని దిశాపటలంబువ[1]గుల
జటులంబులైన నక్షత్రముల్ రాలఁ
జం[2]డగర్వోద్దండసమవర్తికాల
దం[3]డజాతాఖిలదారుణలీల
మ్రోయుచు మంటలు మొనసి న[4]ల్గడల
రాయుచుఁ గాలభైరవమూర్తితోడ
బరు[5]సమైఁ జనుదేర బాలుఁడుఁ 'దివ్య
శరమమోఘంబ' ని చర్చించిచూచి
య[6]నఘగుణాధారు నాహవశూరుఁ
దన[7]యన్నఁ గుశవీరుఁ దలఁపులో నిలిపి
"యీ[8]వేళ మాయన్న యిచ్చోటనున్న
నీ[9]వసుధేశ్వరుండేసిన శరము
న[10]నుఁ జేరవచ్చునే నానాశుగములఁ
దుమమాడుఁగాకంచుఁ" దోడనే యతఁడు
"మా[11]తల్లియె కీర్తి మహినొప్పు జనక

1 క. పగుల. ఖ. వీవ
2. క జండగదాదండ
3 క. దండజితాఖండదారుణగతుల.
4. క. మొనసి నాల్గడల ఖ. మొనసి నలుగడల
5. ఖ. పరుషుఁడై చనుదేర బాలుఁడూదివ్య.
6 యనయగుణోదారు
7 క తమయన్నఁ గుశవీరు. ఖ. తమయన్నఁగుశువీరు.
8. యావేళ యన్న యచ్చోట నున్న.
9 క యీవసుధేశుండు యేసినశరము
10. క. ననుఁగాండనించునే నానాంశుగముల.
11. క. మాతల్లిసత్కీర్తి మహినొప్పుజనక.

జా[1]తపాతివ్రత్యసత్యంబు లెందు
నిత్యం[2]బు లగునేని నేఁడీశరంబు
"నత్యం[3]తగతిఁ ద్రుంతు" నని యమ్ముఁదొడిగి
నారాయణాస్త్రంబు నడిమికిఁ దునియ
నా[4]రాజవరసూనుఁ డట్లేయుటయును
బరఁగుచో నఱకుడువడి మేను వడిన
ధరణిపైఁ బడు పాముతలయును బోలె
గ[5]ఱిపట్టుఁ దునుక వేగమె నేలఁ బడియు
మ[6]ఱియును ఖండంబు మండుచు వచ్చి
విలుఁ ద్రుంచి లవుఁ దాఁకె విస్మయంబుగను,
బలియుఁడా బాలుండుఁ బ[7]డియు మూర్ఛిల్లి
విగతసాధనుఁడును వికలితాంగుండు
నగుచు నెత్తుటఁ దోఁగి య[8]వనిపై నుండెఁ

---

1. జాతపతివ్రతాసత్యంబులందు.
   క. జాతపతివ్రతాసత్యంబునందు.
   ఖ. జాతపాతివ్రత్యసత్యంబునందు
2. నిత్యంబులగునేని నేఁడు యీశరము.
3. లత్యంతగతి.
4. క. నారాజసుతుఁడేసె నట్లేయుటయును
   ఖ. నారాజసుతుఁడేసె నట్లంతటయును.
5. క గఱిపట్టుదునుక వేగమె నేలఁ బడిన
   ఖ గఱిపట్లు తునిసి వేగమె నేలఁబడియె.
6. క నఱిగియున్న ఖండంబు
   ఖ. పడియున్న ఖండంబు.
7. క. బడియె.
8. క. యవనిపై బడియె.

బ్ర[1]హితరావణశక్తి పరుషఘాతమున
మహిమీఁదఁబడిన లక్ష్మణదేవుఁబోలె.

—: శత్రుఘ్నుఁడు లవునితో నయోధ్యకు మఱలుట :—

హతశేషసైని[2]కు లార్పులు నిగుడ
నతఁడుఁ గూలుటఁగని యనురాగమెసఁగఁ
దోడనే శంఖదుందుభుల భేరులనుఁ
గూడిమ్రోయించిరి కుంభినివగులఁ
దోడిఁబడఁ గొందఱు తురగరత్నంబు
విడిచిరా దశరథవిభుసూను నెదుర
నప్పు[3]డాశత్రుఘ్నుఁ డాబాలుమోముఁ
దప్పక చూచి హస్తంబుల నెత్తి
కరుణారసము మీఱఁగా మ్రోలనున్న
ధరణీపరాళితో ధరణీశుఁడనియె.
"వదనకాంతియుఁ బలువరుససోయగము
ను[4]దుటియున్నతముఁ గన్నులవిశాలతయు
శిర[5]ము నొప్పిన మునుజేతులచాఁపు
నుర[6]మును జిగియును నొడలిచాయయును
నఖముల రక్తవర్ణంబును మఱియు

1. క. ప్రౌఢరావణశక్తి.
2. సైన్యమలార్పులు.
3. క. అప్పుడాశత్రుఘ్నుఁడర్భకుమోము
4 క. నొదటి.
5. క. శిరమొప్పదంబును చేతులచాంపు
6. నురవును.

నఖిలలక్షణముల నారసిచూడ
మారామచంద్రుని మార్పంగవచ్చు
నీరూ[1]పుఁ జూచిన నేమకో! నాకు
నల్లన నీ[2]బాలునంగంబునందుఁ
జల్లఁగా నుదకంబుఁ జల్లంగవలయు
నావిధంబొనరింపుడనఁగ నాతెఱఁగుఁ
గావించిరంత నాకారుణ్యధనుఁడు
నొడలిలోఁ బ్రా[3]ణంబులుండుట నెఱిఁగి
యొ[4]డయుని కే చూపుటుచిత మీశిశువు
నని తేరిపై నిడి యశ్వంబుఁగాను[5]చుఁ
జనియె సేనలతోడ జననాథసుతుఁడు.

——: జైమిని జనమేజయుని కోరికపైఁ గుశవృత్తాంతమునుఁ జెప్పుట :——

అనవుండు తలయూఁచి హర్షంబునొంది
జ[6]నమేజయుఁడుపల్కె జైమినితోడ
"మునివర! యీచిత్రములు మున్ను వినియుఁ
గనియు నెఱుంగ మేకాలంబునందు

1. క. యీరూపుఁ జూచితి మేమకో యకట!
2. క. నీబాలుయంగంబులందు.
3. క. బ్రాణంబు లుండుటఁజేసి.
4. క. యొడియని కొప్పింప నుచితమీశిశువు.
5. వెనుక.
6. జనమేజయునితోడ జైమినిట్లనియె.

ననఘాత్మ! జనకరాజాత్మజ కొంత
విన[1]దగో! యీశిశువృత్తాంతమపుడు
కుశుఁ[2]డెందు వోయెనో! సకలంబు
విశదంబుగాఁజెప్పవే మునినాథ!
యిలఁబవిత్రంబైనయీ[3]చరిత్రంబుఁ
దెలియనా చిత్తంబు తి[4]విరెడు" ననిన
"నవనీశ! నీవన్నయ[5]ట్లు బవిత్ర
మవు[6]నిది కుశయుక్తమగు చరిత్రంబుఁ
వినుమగ[7]వాఁడైన వెలఁదుకయైన
ఘనపుణ్యులగుదు రీకథ నీవు వినుము.
అడవికిఁ గం[8]దమూలార్థమై కుశుఁడు
వెడలె నంతకుమున్న, వినదు సీతయును,

—: మునికుమారులవలన లవుని వృత్తాంతమంతయు నెఱింగి సీత పలుదెఱఁగుల వాపోవుట :—

తురగంబువెనుక శత్రుఘ్నుండు వీర

1. క. వినదగో యీలోని వృత్తాంతమెల్ల.
ఖ వినదగో యీతేని వృత్తాంతమపుడు.
2. క కుశుఁడెందువోయెనో కుశకాశలంబు.
ఖ. కుశుఁడెందువోయెనో కోరి సకలంబు.
3. క. యీ పుణ్యాచరిత
4. ఖ. తివిరెడి యనిన.
5. యట్టి
6. క. మగునది కుశయుక్తమగు చరిత్రంబు.
7. క. మొగవాఁడు
8. క. ఖ. గందమూలార్థంబు కుశుఁడు.

వ[1]రునిఁబట్టుకొని పోవఁగ నార్తులగుచు
జనకనందనతోడ సకలంబుఁజెప్ప
ముని[2]కుమారులు వేగమునఁ బాఱుతెంచి
తనకుమారుఁడు రాక తఢసినఁ జింత
మునుఁగుచుఁ గన్నీరు మోమునఁ గ్రమ్మఁ
గడుఁదూలు జానకిఁగాంచి యంగములు
వడఁ[3]క నాదేవితో వారలిట్లనిరి
"ధరణిజ! లవుఁడు మీతనయుండు నేఁ[4]డు
యరుదెంచి మా[5]తోడ నాడుచునుండి
య[6]చ్చోటనెవ్వరి యశ్వంబొ కాని
వచ్చుచుండఁగఁ గాంచి వడి[7]నెదురేఁగి
వలదని మేమెల్ల వారింప వినక
బలి[8]మి నాతురగంబుఁ బట్టిబంధించి
జడిగొన్న యారాజుసైన్యంబు హయము
విడువంగవచ్చిన వి[9]డువంగనీక

---

1. క. వరుఁ బట్టుకొనిపోవుచున్నాఁడుగాన.
ఖ. వరుఁ బట్టుకొనిపోవఁగ నార్తులగుచు
2. మునికుమారకు లొక్కమొగిఁ బారుతెంచి
3. వడఁక నాదేవితో వారు యిట్లనిరు.
క. ఖ. వడఁక నద్దేవితో వార లిట్లనిరి
4. క. ఖ. వేడ్క.
5. క. మ్రాతోడ నాడుచుండఁగను. ఖ మాతోడ నాడుచునుండె.
6. క. ఖ. అచ్చోటి' కెవ్వరి యశ్వమోకాని,
7. వడి నందురేఁగి. ఖ. వడి నేపురేఁగి.
8. క. ఖ. బలి నత్తురంగంబుఁ బట్టి బంధించి.
9. క. వీరుల నెల్ల.

వారితోఁ బోరాడి వా[1]రినందఱను
ఘోరబాణంబులఁ గూలంగ నేసె.
అంతనారాజు నీయాత్మజుతోడ
వింతకయ్యముసేసి విలుఁద్రుంచి వై[2]చె.
(గరుడుని కగపడ్డ కాలాహిప[3]గిదిఁ
బరవీరుచేఁ బట్టుపడిపోయె న[4]తఁడు) *
బలిమిమైఁ గుదియించి పట్టిబంధించి
యలఘుఁడై కొనిపోయె నక్కుమారకుని
వనిత ! నీకెఱిఁగింప వచ్చితి” ననిన
వి[5]ని సీత శోకాబ్ధివీచుల మునిఁగి
పిడుగుచప్పుడువిని బెగడిన శిశువు
వడువునఁ జిత్తంబు వ్రయ్యఁగం[6]పింపఁ
బగఱచే ధనముఁ గోల్పడిన మానవుని
పగి[7]దినై వెల్లవెలఁబార నెమ్మోము
తనమేను మఱచి చిత్తరువున నున్న

---

1. క. ఖ. వారి నందఱిని.
2. వైచి.
 * ఈపద్యము మాతృకలోనిది కాదు. క ఖ. గ్రంథములలోనిది.
3. ఖ. కరణి.
4. ఖ. నితఁడు.
5. ఖ. విని తన శోకాబ్ధివీచుల.
6. క. గంపించి
7. పగిదిమై వెలవెలఁ బారి యమ్మోము.
 క. పగిదిన్నై వెలవెలఁ బారెనెమ్మోము.
 ఖ. పగిదియై వెలవెల బారి నెమ్మోము.

య[1]నిమిషకాంతయోయన నుండెనంత.
విరిదమ్మి రేకుల వెడలు పూఁదేనె
కరణి నేత్రంబులఁ గన్నీరు తొరఁగ
బాలకుఁ బేర్కొని పాయనివగలఁ
దూలుచు నిట్లని దుఃఖింపఁదొణఁగె,
"చేకొని ధర్మంబుఁ జేసితి నేని
నాకో[2]ర్కెఁ జెల్లించు నాముద్దుపట్టి
తఃయున్న వచ్చునందాఁకఁ బ్రాణములఁ
దనువున నెట్లైన ధరియించుగా[3]త !"
యనిపల్కి మనమున న[4]డలు రెట్టింప
ననియె "సంగరశూర ! యభినవాకార !
యో[5]కుమారక ! నిన్ను నొక్కనిఁ బొదివి
చీకాకువడఁ జేసి చెడుగులై రిపులు
కరుణ యింతయు లేక కటకటా ! యి[6]ట్లు
బొ[7]రిగొన నేమని పొక్కితే కూన !

---

1. క. యనిమిషకాంతయై యలరుచునుండె
ఖ యనిమిషకాంతయోయన నుండె నపుడు.
2. క. ఖ. నాకోర్కె.
3. క. ఖ. గాక.
4. క. యెడలు.
5. యో కుమారక ! నిన్ను నొకని-బొకునను.
క. యోకుమారక ! నిన్ను నొక్కనిఁ బొదవి.
6. నిన్ను.
7. పొరిగొనిరే యేనుం బొక్కితే కూన !
ఖ. పొరిగొనిరో యను బొక్కితి కూన !

యేతెఱుంగునఁ జనవెక్కడికైన
నాతోడఁజెప్పక నా[1]తోడ మున్ను
నాకెఱింగింపక నన్నొం[2]టి విడిచి
యేకా[3]కివై పోవనిట నీకుఁదగునె,
పరిపూర్ణచంద్రుతోఁ బ్రతివచ్చుమోము
పరుసని యమ్ముల పాలయ్యె నేఁడు,
మృదురీతినొప్పు నీమే నాజిలోనఁ
గదిసెనే యిప్పుడు కఠినంపునేల
నడవులఁ గందమూలాహారనియతి
విడువక పుణ్యుఁడై వే[4]దంబుఁజదివి
పరమపావనశీల! భా[5]వమార్గములఁ
బరఁగఁ బండ్రెండేండ్ల బాలుని నిన్నుఁ
గనుఁగొని యీబాలుఁ గాంచినతల్లి
మనమున నేమని? మఱుఁగునో! యనక
ఖ[6]లులైన యాపాపకర్ములకెట్లు?
యలుగులపాలుసేయఁగఁ జేతులాడె,
దైవమా! యేలకో! తడసె వాల్మీకి

---

1. క. నన్నొంటి విడిచి.
2. నను నొంటి విడిచి. క. నాతోడ నీవు.
3 ఖ. యేకాకివై పోవుటిది.
4. వేదంబులందు.
5. క. ఖ. భవ్యమార్గమున.
6. ఖలులైన పాపకర్ముల కెల్ల.
క. ఖలులైన యాపాప కర్మకెట్లు.
ఖ. బలులైన యాపాపకర్ముల కెట్లు.

ణ్యూవేళ వచ్చిన నెఱిఁగింతుఁ దెలియ,
కుఱుఁ[1]గట నున్న యీకుశుఁడేల రాఁడొ!
తెఱఁగొప్ప నంతయుఁ దెలియఁ జెప్పుదును,
మగనిపైఁగల యాసమాని యిచ్చోట
నగతికురాలనై యాపదనొంది
కొడుకులనిటఁ జూచుకొని యాత్మఁగొంత
యు[2]డుకారి యొకరీతి నొకకొంత ప్రొద్దు
రొంటిఁ బ్రాణమువట్టియుంటి దైవంబు
కంటికిఁ బెద్దాయె గ[3]టకటా!" యనుచు
ననియని పలుమాఱు న[4]వనితనూజ
వెనుఁ[5]బడి యెలుఁగెత్తి విలపించుచుండె

—: కుశుఁడు సీతవలన సర్వంబు నెఱిఁగి యామెయనుజ్ఞ వడసి కదనమునకుఁ గదలుట :—

కుశసమిత్ఫలములఁ గొ[6]నివచ్చుచున్న

---

1. కుఱుఁగట నున్న మాకుశుఁడేల రాఁడో
   క. కుఱుఁ గాట నున్న యీకుశుఁడేల రాఁడో.
   ఖ. కుఱుఁగట నుగ్న యీకుశుఁడేల రాఁడు.
2. క. వుడుకారి యొకరీతి నుండలేనైతి
   ఖ. వుడుకారి యొకరీతి నోరంతపొద్దు.
3. కటకటా యనియు.
4. క. నవనిజ మఱియు.
5. క. వెనుఁబడి తలయెత్తి విలపింపఁదొణఁగె.
   ఖ. వెలుకొని యెలుగెత్తి విలపించుచుండె.
6. క. గొని వచ్చుచుండ.

కు[1]శునకు నప్పుడు కుడిబాహువదరె
నూ[2]రక కన్నీరు నొలికెఁ జిత్తమున
వా[3]రక యొదలె భావమున నారటము.
ఆ[4]మెయిం గలఁగుచు నమ్మహాబలుఁడు
భూ[5]మిజయాశ్రమ భూమి సొత్తెంచి
"యేలకో! లవుఁడు నాకెదురుగా రాఁడు
బాల[6]కునకు నడ్డపడిరో యెవ్వారు?
నాతోడ నలిగెనో! నాతోడు లేక
యేతటిఁ జిక్కెనో! యెచ[7]టనున్నాఁడొ!
కాంభోజకోసలక[8]ర్ణాటలాట
కుం[9]భినీపతులలోఁ గ్రూరత మెఱసి

1. క. కుశునకు నప్పుడొక్కట బాహు లదరె.
ఖ. కుశనకు నప్పుడు ఘనబాహు వదరె.
2. క. వూరకె కన్నీళ్లు వొలికె నందంద
ఖ. వూరకె కన్నీళ్లొలికె నందంద.
3. క వారకమొదవె భావమున నారటంబు.
ఖ. ఆరాటమొదవె భావమున నందంద.
4. నమ్మెయిఁ గలఁగుచు నమ్మహాబలుఁడు.
క. నామ్మెయి గలుఁగుచు నమ్మహాబలుఁడు.
ఖ. అతిమను గలంచుచు నమ్మహాఘనుఁడు.
5. క. భూమీశ! యాశ్రమభూమి సొత్తెంచె.
ఖ. భూమీశ! యాశ్రమభూమి సొత్తెంచి.
6. క. బాలున కగపడ్డపడిరొ యెవ్వారు.
ఖ బాలునకు నడ్డపడిరొ యెవరైన
7 క. యెట్లున్నవాఁడొ.
8. కరహాటలాట.
9. కుంభినీపతులతోఁ గ్రూరతఁ మెరసె
క. ఖ. కుంభినీపతులతోఁ గ్రూరతఁ బేర్చి.

యెనయనిమతితోడ నెవ్వా[1]రు వట్టి
కొనిపోయిరో! తమక్రొవ్వున నతని
నొడలితో నున్నాఁడొ! యెం[2]డెఁ బ్రాణములు
విడిచెనో! మఱియేమివిధ[3]మకో!" యనుచు
(ననియని పలుమాఱు నటునిటు జూచి
తనతల్లివదనంబుఁ దప్పక చూచి) *
తడయకవచ్చి సీతకు మ్రొక్కి కుశుఁడు
కడువెరఁగందుచుఁ గరములు మొగిచి
"వివరింపు మో తల్లి! విలపింపనేల
లవుఁడెందు వోయె? నుల్లముఁ గలంగెడిని"
యనవుండు జానకి యనియె "నోతండ్రి!
వినుము నీయనుజుండు వీరుఁడై నేఁడు
యెవ్వరితురగమో యి[4]మ్ములఁదిరుగఁ
గ్రొవ్వుమీరఁగఁ బట్టికొని యంటఁగట్టి
పోరాడి కడపట భుజశక్తిఁదూలి
వా[5]రలచేఁ గట్టువడివోయె నతఁడు,
అన్న! యింతకు బాలుఁడంతకపురికిఁ

---

1. క. యెవ్వరో.
2. క. వొండిప్రాణములు.
3. క. విధమకో యింక.
 * ఈపద్యము మాతృకలోనిదికాదు.
 క. గ్రంధములో విశకలితముగ నుండినది.
4. ఖ యిమ్మాలఁ దిరుగ.
5. క. పౌరసం బరికట్టుపడిపోయె నతఁడు.
 ఖ. పరులచేతపడిఁ బట్టుపడిపోయె నతఁడు.

జన్నాఁడో! యున్నాఁడో! చర్చించి యెఱుఁగ
వేవేగ [1]నాతని విడిపింప నోరులు
నీవె[2]కాకెవ్వరు ? నిఖిలైకవీర !"
అనవుం[3]డు బహుళీకృతాఖిలకోప
జనితసంరంభుఁడై జానకీసుతుఁడు
"దా[4]రుణమద్బాణదళితారిరక్త
ధారలు[5] భూనభోంతరములు నిండ
ధర[6]ణియుఁ దరణియుఁ దాఁకిననైనఁ
దరగ[7]క, భూతజాలముఁ దృప్తిపఱతు
జనని[8]! మీచే ననుజ్ఞాతుండుఁగాక
చనుట[9]నాలవుఁడపజయ మొందెఁగాక
నీవం[10]పఁగా జన్న నీతనూభవుని
దేవదానవులైన దృష్టింపఁగలరె

---

1. క. నతనిని.
2. క. నీవుదక్కఁగ లేరు నిజము కుమార !
   ఖ. నీవుదక్కఁగ లేరు నిజమోకుమార !
3 క. అనవుండు బాళితాఖిలకోపమెనఁగ
   ఖ. అనవుండు భాళికృపాఖిలరోప.
4. ఖ. దారుణ మద్బాణదళితాసురక్త-
5. క ధారలు భూనభోంతరమెల్ల నిండ.
6. ధరణియుఁ ధరణియు ద్రావిననైన.
   క. ధరణియు ధరణియుఁ ద్రావిననైన.
   ఖ. తరణియు ధరణియుఁ దాంకిననైన.
7. క. ఖ. తరమిడి.
8. ఖ. జనని! నీచే ననుజ్ఞాతంబుగాక.
9 చనుట యీలవు కపజయమొందెగాక.
10. క. నీవు బంపఁగఁ జన్న.

అ[1]ని జంభరిపుఁడైన నంతకుండైన
వి[2]ను జలాధిపుఁడైన విత్తేశుఁడైన
నమరగంధర్వాదులైన వారలకు
సమ[3]కొని తోడుగాఁ జనుదెంచిరేని
యదలించి నాబాణహతుల నం[4]దఱను
వి[5]దళించి లవునేను విడిపించితెత్తు
నిదె పోవుచున్నాఁడ నిమ్మునాకిపుడు
హాదులు శరాసనంబునుఁ గిరీటంబుఁ
గ[6]వచంబు నురుఖేటకముఁ గృపాణంబు
నవనితనూభవ ! యాలస్యమేల ?”
అ[7]నవిని జానకి యఖిలశస్త్రాస్త్ర
ఘనతరకోదండక[8]వచాదులపుడు
తనకునిచ్చినఁ బ్రీతి ధరియించి కుశుఁడు
జననికి మ్రొక్కి భు[9]జంబప్పళించె,
“వనజాక్షముఖ్యులు వచ్చిననైన

---

1. క. ఖ. అనిమిషాధిపుఁడై. .
2. క. విను బలాధికుఁడైన.
3. ఖ సమరముకఁ దోడుగాఁ జనుదెంచిరేని.
4. క. ఖ. నందఱిని.
5. క ఖ. విదళించి లవుని నే విడిపింత్తుఁ దల్లి!
6. క. గవచంబు నురుఖేటక ముగ్రబాణంబు
7. క. ఖ. అనవుండు
8 క. ఖ. కవచాదు లెలమి
9. భుజం బప్పళించి.

వనిలోన గెలువు నీ'' వని సీత పలికె.
ఎలమితో జానకి యిచ్చుదీవెనలఁ
బలుమాఱుఁ గైకొంచు బలువిల్లుమెఱయ
వి[1]లునారినినద మావేళ చండాంశు
కులు నారినినదంబుఁ గూడనొ[2]ప్పంగ
దె[3]సలునాలుగు చూచి దీప్తదివ్యాస్త్ర
విసరసముద్దండవీరసంకులము
రథికమనోజ్ఞసారథిజవానీత
రథనేమినిష్ఠురరావభీషణము
సమదవారణఘనశ్యామాయమాన
సముదగ్రమున నశ్వచయభయంకరము
నగుసేనఁ బొడగని యప్పుడాలవుని
మొగముఁగాననిచింత మొనసుఁ జెంపెసఁగఁ
గడుఁదమకంబునఁ గదలి యా[4]కుశుఁడు
తడయక రిపుసేనఁ ద[5]ఱియంగ నేఁగి
కరిఘటానికరంబుఁగని వి[6]జృంభించు
హరికిశోరముమాడ్కి యదలించి పలికె.

1. విలునారినినద మావేళ చండాంశు.
క. విలునారి నినదంబు వేళ చండాంశు.
2. క. నొప్పంగి. ఖ. నుప్పొంగి.
3. దిశలునాలుగుచూచి దీప్తదివ్యాస్త్ర.
4. యా ఘనుఁడు.
5. క. ధరియంగఁ బారి.
6. ఖ. విజృంభించి.

—: కుశుని సమరగర్జనము ; శత్రుఘ్నుని సైనికులపశకునములఁ గాంచుట :—

" హా[1]! పోక నిలునిలుఁ డోపికగలిగి
ప్రా[2]పైనబంధుఁ డాబలియుండు నాకు
విడిచెదరో పోరి వేగ ప్రాణములు
విడిచెదరో యొక్కవిధ మేరుకొనుఁడు
వీరపుంగవులార ! వినుఁడిట్టిచోటఁ
బో[3]రాడి గెలువక పోవఁడీకుశుఁడు "
అను[4]మాటవిని యప్పుడాయోధవరులు
ఘనభీతిఁ దమలోనఁ గ[5]లఁగుచు ననిరి
" కంటిరే వీరియాకారంబు న[6]లువు
బంటుపంతంబును బా[7]హుగర్వంబుఁ
గా[8]ండసముత్కటకార్ముకచర్మ
మ[9]ండలాగ్రోదగ్రమహనీయమూర్తిఁ

---

1. క హాహా నిలువుఁడీ వోపిక గలిగి.
2. క. ప్రాపైనబాలుండు బంధుండు నాకు
   ఖ. ప్రాపైన బంధుఁడీ బలియుండునాకు
3. క. పోరాడి గెలువకపోనీఁడు కుశుఁడు
   ఖ పోరాడి గెలువకపోవఁడు కుశుఁడు
4. క. ఆమాట.
5. క. కలుఁగుచు నిలిచి.
6. నలవు క నలుపు.
7. బాహువర్గంబు.
8. క. కాండసముత్కార. ఖ ఖాండసముత్కట.
9. క. మండలకోదండమహనీయమూర్తి.

గడఁగి యొక్కట లయకా[1]లుండు మనల
నడఁగింప తానువీఁడై వచ్చినాఁడొ! "
అ[2]నియని వెరఁగంద నప్పుడద్భుతము
మొనసి గార్ధభనాదములు పె[3]క్కులొదవెఁ
బడగ లొండొంటితోఁ బ[4]లుమాఱు రాసె
వ[5]డిగొని తరువులు వసుధపైఁబడియె
నద్దెస ఘో[6]షించె నాకాశవాణి
గ్ర[7]ద్దలు బెరసి ఘూత్కారములనొడిసె
నో[8]డి దప్పి కైదువ లొరలలోనున్న
ను[9]డికి తుత్తునియలై యుర్విపై రాలె.

—కుశశత్రుఘ్నుల యుద్ధము,
శత్రుఘ్నపరాభవము :-—

అనిపలుక నంతలో నమ్మహాభుజుఁడు
ఘనశరంబొక్కటి గదిసిన బెదరి

1. క. ఖ. కాలుఁడై మనల.
2. క అనియని వెరఁగంది యత్యద్భుతమున
ఖ. అనియని పలుకంగ నద్భుతంబుగను.
3. పెక్కులొదవ.
4. బలుమాఱు రాసి.
5. వడిగొన్న.
6. ఘోషించు.
7. గ్రద్దలు విరిసి నక్కరములు వొడిచె.
క. గద్దలు బెరసి ఘూత్కారముల కొడిసె.
ఖ. గ్రద్దలు వాపోయఘుముల బొడిచె.
8. క. మొ..... దువలొరలలో నున్న.
ఖ. తనరంగఁ గైదువ లొరలలోనున్న.
9. క.యునికిని తునకలై యూరిపై రాలె
ఖ. యునికినితునియలై యుర్విపై రాలె.

పెంధూళి మార్తాండబింబంబుఁ గప్పె
స[1]ంధిలేకుండంగ జగమెల్ల నిండె
బలములు చీకా[2]కుపడి ముహూర్తంబు
నిలిచి యిట్టట్టనేరక భ్రమసెఁ
గమలాప్తబింబంబు కనిన చీకట్లు
క్రమమున నాతనిఁగని విచ్చిపారె.
అప్పుడుగ్రాకారుఁడై వచ్చుకుశునిఁ
దప్పక లక్ష్మణుతమ్ముఁడు చూచి
త[3]నసైన్యపతితోడఁ దమకించి పలికె.
"చ[4]ని నిలుపుము బాలుఁ జండకాండములఁ
జెదరి పాఱిన మనసేనలనెల్లఁ
బదిలంబుగాఁ గూర్చి బ[5]రవసంబలర
నేవచ్చునందాఁక నీబా[6]లుతోడ
నీవు కయ్యముసేయు నే[7]ర్పుసంధిల్ల"
ననిన సేనాపతి యనిమొ[8]వేగంబె

1. సంధులేకుండంగ క. ఖ. సంద లేకుండంగ.
2. క. చీకాకుపడిరి మూర్తమును.
   ఖ. చీకాకుపడ ముహూర్తంబు.
3. తమ సైన్యపతితోడ
4. క. చని నిలుపు మీబాలు చండకొండముల.
   ఖ. చని నిల్పుమీబాలు చండఖాండముల.
5. క. బరవసంబమర. ఖ. పరవశంబమర.
6. ఖ. నిబ్బాలుతోడ.
7. క. నేర్పున మెఱసి. ఖ. నీనేర్పు మెఱసి
8. వేగంబు.

" చ[1]నియేను నాబాలు సమయించువాఁడఁ
ద[2]డయక నీప్రసాదంబున నతనిఁ
దొ[3]డరి చంపుట యెంత దుస్తరంబరయ "
ననిపల్కి బలవంతుఁడగు సైన్యవిభుఁడు
చనుదెంచి కుశుమీఁద స[4]న్నద్ధుఁడగుచు
" నిలునిలు బాలక ! నిన్ను నంతకుని
నిలయంబుఁజూడంగ[5] నేఁడుపంపెదను "
ననిపల్కి కుశుమీఁద నైదుబాణములఁ
గనుఁగొని[6] యేసె నాగ్రహమూర్తివోలె,
అవి నడుమనె కుశుండైదుబాణముల
నవలీలఁ ద్రుంచి సైన్యా[7]ధిపు నొంచె
నాలుగుశరముల నాలుగశ్వములఁ
దూలించి మించి సూతునితలఁద్రుంచి
విలుఁద్రుంచి యరదంబు వి[8]ఱిచి చక్రములఁ
బొలియించి కవచంబుఁ బొడిపొడిసేసి

---

1 క. చని యేను బాలుని. ఖ. చని యేను నబ్బాలు.
2 క. తరలక నీవు సన్నద్ధుఁడవు గమ్మనిన.
ఖ. తరలక నీ ప్రసాదంబున నతని.
3 దొడరి చంపుట యంత దుస్తరం బరయ.
క. దొరసి చంపుట యంత దుస్తరం బరయ.
4. క సమయజ్ఞుఁడగుచు.
5. ఖ. నే నంపెదనుచు.
6. క. ఖ. కనుఁగొని యేసె నాగ్రహము రెట్టింప
7 క.సేనాధిపు నొంచె.
8. క. ఖ, విఱిచి జోదులన.

పాపాత్ముఁడగువాని బాహుల రెండు
తూపుల నటికి తోడ్తోనె పాదముల
ఖండించి రెండు జంఘలఁ గత్తిరించి
కాండమొక్కట వాని కంఠంబుఁ[1] ద్రుంచె,
ధాత్రీశ ! యీగతిఁ దడయక కుశుఁడు
చి[2]త్రయుద్ధంబున సేనానిఁ జంపె.
ఆహవక్షోణిలో నతఁడిట్లు వడిన
హా[3]హానినాదంబులడరె సైన్యముల
నత్తరిఁ గోపించి యతనిసోదరుఁడు
మత్తవారణము నున్మత్తుఁడై కొలిపి
గండప్రదేశాళికలితనాదముల
మెండుగాఁ గుశునా[4]క్రమించె నావేళఁ
దగఁ గుశునెత్తురుఁ ద్రావిభూతములు
న[5]గుడంచు నొకశక్తి నతనిపై వైవ
నది మింటఁబెనుమంటలంట[6] లోకంబు
ల[7]దరంటఁ బఱతేఱ నలుకనాదంట
నారభసముఁజూచి యపుడైదుమెరుఁగు

1. క. ద్రెంచె.
2. క. చిత్రయుద్ధముఁజేసి సేనానిఁ జంపె.
3. ఆహానినాదంబు లడరె.
4. నాక్రమించినవేళ
5. నిగుడించె నొకశక్తి నరిదెంచి వైచె. ఖ. నగుడంచు నొకశక్తినగుఁడేగివైచే
6. క. ఖ. లోకములు
7. క. నదరంట బఱతెంచు నదరనాదంట.

నా[1]రసంబుల దాని నడుమనే త్రుంచె
నద్రిరెక్కలఁద్రుంచు య[2]మరేంద్రుపగిది
భద్రగజేంద్రంబుపదముల నాల్గు
చతురంబకంబులఁ జతురుఁడై తునుమ
నతఁడుగ్రగ[3]దఁగొని యతనిపైఁ గవియ
ఘనతరాశీవిషకల్పమై చాల
కనుపట్టు హస్తంబు గదతోడఁద్రుంచె
ధరమీఁదఁ జక్రంబుఁ దనవామపాణి
ధరియించి యాతఁడుద్దండత నడువఁ
జండకాండముల నాచక్రంబుతోడ
ఖండించెఁ గుశుఁడు తత్కరముఁ దోడ్తోన.
అంతటఁబోక రెండమ్ములఁ బదము
లి[4]ంతవింతలుగాఁగ నెదిరి కయ్యమునఁ
గాకుత్స్థునిపైఁ గుంభకర్ణుండు నడుచు
నాకృతి నవ్వీరుఁడతిసాహసమునఁ
గర[5]ములుఁ దెగియునుఁ గాళ్లునుఁ దెగియుఁ
బోరిఁబోరి భూరేణుపుంజంబుతోడ

---

1. నారసంబుల దోడిగి నడుమనే ద్రుంచె.
ఖ. నారసముల దాని నడుమనే త్రుంచె.
2. క. ఖ. నమరేంద్రుఁడనఁగ.
3. క. ఖ. గదఁ గొంచు.
4. లింతలింతలుగాఁగ నెదరి గయ్యమున
క. వింతవింతలుగాఁగ నెగసెఁ గయ్యమున.
ఖ. వింతవింతలుగాఁగ నేసెఁ గయ్యమున
5. క. కరములు దునిసియు కాళ్లను దెగియు.

ఝ[1]ర్ఝరితాఘాతజలధారలచట
నిర్ఝరంబులువోలె నిలువక వెడల
రవిఁబట్టఁ బఱతెంచు రాహుచందమునఁ
గ[2]విసి బాలునిమీఁదఁ గదిసె నాన[3]గుఁడు
కదురుచుఁ ద[4]నభిన్నకరముల నొక్క-
గదఁగొని ప[5]డవైచెఁ గడిఁదికోపమున
ధరణీశ! యా[6]గద తాఁకినవెనుక
యఱుగక ధీరుఁడై యాలవాగ్రజుఁడు
నగముపైఁ గోపించు నగవైరివోలె
నగవీరుమీఁద నెన్నగవొప్పఁ గుశుఁడు
పిడుగుకై వడి నొప్పు బెడిదంపుశరముఁ
దొడిగి యేయఁగనది దుర్దాంతమగుచు
ఘు[7]మఘుమతాచండకోటీరమగుచు
సమ[8]వర్తికరదండసమదండమగుచు

---

1. క. జర్జరితంగాస్త్రజలధార లొలుక.
ఖ. జర్జరితాంగాస్త్రజలధార లచట.
2. క. గవిసె బాలునిమీఁదఁ గడఁగె నాగయుఁడు.
ఖ. గదిసి బాలునిమీఁదఁ గడఁగె నానగుఁడు.
3. నానరుఁడు.
4. క. ఖ. తన పిన్నకంముల.
5. క. ఖ. వడి వైచె.
6. ఖ. యగ్గద.
7. ఘుమఘుమతాజండ కోటరంబగుచు.
క. ఘుమఘుమవిళితాండ కోటరంబగుచు.
8. క. సమవర్తికరదండచయదండ మగుచు.
ఖ. కరమర్థిఁ జెండాడఁ గరదండ మగుచు.

శతకోటిశతకోటిసమఘోషమగుచు
నతి[1]కాలకూటకూటాదీప్తమగుచుఁ
బ్ర[2]ళయప్రభంజనప్రాభవంబగుచు
బలుపంటలుమియుచుఁ బఱతెంచి కదిసి
మానితనవరత్నమకుటంబుతోడ
నానగాహ్వాయుతల నవలీలఁద్రుంచె.
అతనిశిరంబు మా[3]రారిగైకొన్నఁ
బ్రతిలేని శంకరాభరణమై యొప్పె.
ఆకీతి నగ[4]వీరుఁడడఁగినఁ గుశుఁడు
వారక మఱియు దుర్వారకోపమునఁ
బ్ర[5]ళయావసరదండపాణియుఁ బోలె
బ[6]లునారసము లేయ బలములోనపుడు
హరివజ్రధారచే న[7]వనిపైఁ బడిన
గిరులచందంబునఁ గో[8]డసె నేనుఁగులు
ను[9]రుతరరక్తంబులుఁ డుగక కురియ

1. క. ఖ. అతికాలకూటకూటాదిత్య మగుచు.
2. క. ప్రళయప్రభంజనప్రకరాబ్ధి యగుచు.
ఖ. ప్రళయప్రభంజన ప్రారంభ మగుచు.
3. క. మారారి గైకొనియె
4. క. నగవీరుఁడణఁగిన. ఖ. నగధీరుఁడణఁగిన.
5. క. ప్రళయవాసర.
6. క. బలునారసంబుల బలముల గెడరె.
7 క. నవనిపై నున్న.
8. గెడయు నేనుఁగులు. క. గెడయుచుఁ గూలె.
9. క. నుడువీధి రక్తంబు లుడుగక కురిసె.
ఖ. యురువీరు రక్తంబు లుడుగక కురిసె.

వరసత్వములు త్రుం[1]గి వ్రాలెడు భటులుఁ
గరులతోఁబడిన చక్రములతో సూతు
హరులతో ను[2]గ్గునుగ్గగు రథంబులునుఁ 36(
గడికండలై యంగకంబులు చెదరఁ
బ[3]డురాతులునుఁ గూల బహుపతాకములు
జడిగొన్న దివ్యాస్త్రసం[4]ఘట్టనమునఁ
బొడము నగ్నులఁ గాలు పొడవులునగుచుఁ
గన్యకావిక్రయగతికులై బ్రతుకు
యన్యాయశీలుర యాపాపమెల్ల
యమభయంకరదండహతుల నుగ్గైన
క్రమమున రిపులెల్లఁ గ[5]డికండలైరి.
అనుపమభుజుఁడైన యమ్మహాబలుని
ము[6]నుమునసైన్యంబు మొ[7]నపలేదయ్యె.
శత్రు[8]భీకరుఁడైన శత్రుఘ్నుఁడపుడు
శత్రు[9]శరాసనజ్యారవంబడరఁ

1. క. దూలి వ్రాలెడు భటులు
ఖ. గ్రక్కి వ్రాలెడు భటులు.
2. నుగ్గునుగ్గుగ.
3. క. పడుచురాతులు దూలిపడు పదాపములు.
ఖ. పడు రాతులనుఁ దూలు బహుపతాకములు.
4. క. ఖ. సంఘట్టనములు.
5. క. ఖడిఖండలైరి ఖ. కడిబండలైరి.
6. క. మనమున.
7. క. మొనచూపదయ్యె. ఖ మొనచరాదయ్యె.
8. క. ఖ శత్రుభీకరమూర్తి.
9. క. శస్త్రశరాసనజ్యారవంబడర.
ఖ. చైత్రశరాసనజ్యారవంబడర.

గోపారుణాక్షుఁడై కుశుమీఁదనైదు
తూపుల నిగుడింపఁ దో[1]డ్తోనె యతఁడు
శరపరంపరల నశ్వములతోఁగూడ
నరనాథురథము భ[2]గ్నంబుఁగా నేసి
య[3]నుపమాస్త్రంబుల నలుకతో నేసి
మానవేశ్వరుభుజమధ్యంబునందు
మఱియుఁ గోపంబున మం[4]డుచున్నాఱు
నెఱి[5]నారసంబుల నించె మర్మముల 37॥
మలయు మదోన్మత్తమాతంగవిభుఁడు
కులగిరీంద్రముమీఁదఁ గూలుచందమున
నా[6]వాఁడికోలల నరదంబుమీఁద
లా[7]వరి యొఱిగె మాళవికూర్మి మఱఁది
అప్పుడాలవుఁడును నలమిన మూర్ఛఁ
దెప్పిఱి తమయున్నదెసఁ జూచిమ్రొ[8]క్కెఁ

---

1. క. ఖ. తోడనే యతఁడు.
2. భగ్నములుగా నేసి
3. ఆనతపర్వాస్త్ర మలుకతో నేసె
   క. అనుపమాస్త్రంబులు అలుకతో నేయు.
   ఖ. అగతపర్వాశ్రము అలుకతో నేసి.
4 క. మండుచు నూఱు. ఖ. మనుజేశుమీఁద
5. క. నెఱి సాయకంబుల.
6. క. నావాఁడియమ్ముల నరదంబుమీఁద
   ఖ. నావాఁడికోలల నవశుఁడై యొరగ.
7. లావెది కొరిగె మాళవికూర్మిమఱచి
   క. లావెది యపుడు మాళవికూర్మిమఱఁది.
8. క. ఖ. మ్రొక్కె.

దనసహోదరుని నంతటఁ గౌఁగిలించి
యనురాగమునఁ గొనియాడె నాకుశుఁడు,
విడివడ్డతురగంబు వెసఁ దెచ్చిమగుడఁ
దడయక యటనొక్క త[1]రువునఁ గట్టి
వైరివాహనులింక వ[2]చ్చునో యనుచు
శూరులై యెదురుచూచుచుఁ బ్రతాపమునఁ
గవగూడి యిద్దఱుఁ గదలక యచటఁ
బవనాగ్నులనుఁబోలి భాసిల్లి రంత.

—: శత్రుఘ్నుఁడు రణరంగమున మూర్ఛిల్లుటఁ దెలిసి శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గదనమునకుఁ బంపుట —

హ[3]తశేషులగువార లారాఘవునకు
నతనిపాటెఱిఁగింప నరుదెంచి యెదుర
జ[4]గతీశ! హయమేధసవనార్థదండు
మృ[5]గచర్మరురుశృంగమేఖలాధరుని
భూ[6]మీసురాన్వితుఁ బుణ్యతిలాజ్య
హోమధూమారుణితోజ్జ్వలనయను
ము[7]నిజనాశ్రితు వీరముఖ్యుని హేమ

1. క ఖ. తరువుతోఁ గట్టి.
2. వత్తురో యనుచు.
3. హతశేషులగువారు నారాఘవునకు.
4. క. జగతీశ! హయమేధసవనార్థదండ.
5. క. మృగచర్మఖురశృంగిమేఘలాధరుని.
6. భూమీసురాన్విత.
   క భూమిసురాన్విత పుణ్యతిలాజ్య.
7. మునినాశ్రిత వీరముఖ్యుని హేమ.
   క. మునిజనస్తుత్యుని ముఖ్యుని హేమ.

జనకజాన్వితు ననుజన్మశోభితుని
దీక్షితు నృపకులాధిపు సర్వలోక
ర[1]క్షణాక్షము రఘురాముని గాంచి
"అవనీశతిలక ! మీయధ్వరాశ్వంబు
భువిమీఁదఁ దనయిచ్చఁ[2]బోవుచునుండ
నొక్కఁడై నను బ[3]ట్టుకుండెనంతంత
మ్రొ[4]క్కిరి భూపాలముఖ్యులందఱును ;
అతిసత్వరూపశౌర్యాదుల మీ[5]కుఁ
బ్రతివచ్చువాఁడొక్క బాలుండువచ్చి
యయ్యెడ నీసైన్యమంతయుఁ జూచి
యయ్యెడఁ దెగటార్చుయనువుఁ జింతించి
(యాయశ్వమునకుఁ దానడ్డమై యస్మ
దీయసైన్యంబులఁ దెగటార్చె నైచె.)*
అంతట నీతమ్ముఁడతనితోఁదొడరి
యంతకంతకుఁ బో[6]రి యలసి కోపించి
విలుఁద్రుంచి బాలుని వెసనంటఁగట్టి
బలియుఁడై యరదంబుపైఁ బెట్టి[7] తేఁగ

---

1. క. రక్షణగూఢాము రఘురాముఁ గాంచి
2. క బోవుచుండఁగను.
3 క. బట్టుకుండె నంతటన.
4. క. మ్రొక్కిరి రాజన్యముఖ్యులందఱును.
5. ఖ. నీకు
 * ఈపద్యము మాతృకలోనిదికాదు. క. ఖ. గ్రంథములలోనిది,
6. బోరి యడరి కోపించె
7 తేర.

బాణబాణాసనపాణియై యతని
ప్రా[1]ణతుల్యుండైన బాలుఁడొక్కరుఁడు
నరుదెంచి శత్రుఘ్ను నరవాయి గొనక
ధరణిపైఁబడనేసి దళములఁబ[2]ఱపె.
కొందఱు మూర్ఛిల్లి కూలిరి భీతిఁ
గొం[3]దఱు దిక్కులకునుఁ బారి" రనుచు
జెప్పిన పలుకులుఁ జె[4]విసోఁకనీక
తప్పించుకొనురీతిఁ దలయూఁచి పలికె.
" ఇట్టికాఱులు వల్కనేటికి మిమ్ముఁ
బట్టెనో! భూతంబు భ్రమనొందినారొ!
శత్రుఘ్నుఁ గూల్పంగఁ జాలునే యొకఁడు
చిత్రంబు "నావుండు శ్రీరాముఁ జూచి
"మ[5]నుజేశ! నిన్నొక్కమాఱుఁ బేర్కొన్న
జ[6]నులకు నెందు దోషము పొందదనిన
నెట్టన మి[7]ముఁగొల్చు నిత్యుల మమ్ముఁ
బట్టునే భూతంబు భ్ర[8]మ మాకుఁ గలదె

---

1 ప్రాణంబులైనట్టి. ఖ: ప్రాణబంధుండైన.
2. బరపి.
3 క ఖ జెంది కొందఱు దిక్కుచెడి పారిరనుచు.
4. క. చెవిసోఁకనీక. ఖ. చెవిసోఁకకుండ.
5. మనుజేశ! నిను నొక్కమాఱు పేర్కొన్న
క మనుజేశ! నిన్నొక్కమాట పేర్కొనిన.
6. క. ఖ. జనులకు నెట్టిదోషము బొందదనిన.
7. ఖ. నిను.
8. క. ఖ. భ్రమ గలదె మాకు.

బవరంబులో నేఁడు బాలునిచేత
జవ[1]మటి నిజముగా శత్రుఘ్నుఁడీల్గె "
ననవుండు శోకించి యారామచంద్రుఁ
డని[2]యెఁ జిత్తంబున నడలురెట్టింప
"నధికవీరుని లవణాసురుఁబట్టి
వ[3]ధియించె నెక్కడివాఁడిబాణమున
నట్టి నాతమ్ముని నని నొక్కపడుచు
నె[4]ట్టనఁ బడనేసె నీచులఁబోలి
యెట్టిపాపముననో యిపుడు నాతమ్ముఁ
డిట్టి[5]పాటునుఁబొందె నేమననేర్తు?
నామాటఁ జెల్లించు నాసహోదరుఁడు
సౌమి[6]త్రి! యెట్లు? నాచందానఁగూలె
నేనుదీక్షితుఁడనై యిట్లున్నవాఁడఁ
గానఁ గర్తవ్యంబుఁ గాదు క[7]య్యంబు

---

1. క. చావునిజంబుగా.
2. డనియెఁ జిత్రంబున.
3. క. వధియించె నొక్కట వాఁడిబాణము
4. నెట్టిన. క. ఖ. నెట్టనఁ జెడనేసె నీచునిఁబోలె.
5. డిట్టిపాపముఁబొందె నేమననేర్తు
   క. డిట్టిపాటునఁ బొందె నేమననేర్తు.
   ఖ. డిట్టిపాపమునొందె నేమననేర్తు.
6. సౌమిత్రి! యట్లు నాచందానఁ గూలె.
   క. సౌమిత్రి! వింటివే యీచందంబులెల్ల
   ఖ. సౌమిత్రి! వింటి యేచంధానఁగూలె.
7. క. ఖ. యుద్ధంబు.

కాళింగనేపాళ క[1]ర్ణాటగౌళ
చోళేంద్రముఖులైన శూరులతోడ
ఘనసైన్యములతోడఁ గద[2]లి నీకూర్చు
య[3]నుజుని దెసకేఁగి యన్న! లక్ష్మణుఁడ!
పడుచుల వధి[4]యింప బరవసంబొప్పఁ
గడు[5]జయంబగు నీకుఁ గదలిపొ”మ్మనిన
నలఘుఁడై సౌమిత్రి యన్నకు మ్రొక్కి
బలములతోఁ[6]గూడి పయనమై కద[7]లె.

—: అతిసంరంభమున లక్ష్మణసేనలు
సమరరంగమునుఁ జొచ్చుట :—

చేరు[8]వ వీరలక్ష్మీస్వయంవరముఁ
గోరి యొం[9]డొరులనుఁగూడి పిలుచుచు
మకు[10]టకంకణహారమణులచే నొప్పు
సకలభూషణముల జయ[11]మొప్పఁ దాల్చి 410

1. క. కర్ణాటలాట.
2. క. కదలినింగూర్చు. ఖ. కదలిన గూర్చు
3. యనుజుని దెసకేఁగి యన్నలక్ష్మణుఁడు.
క. యనుజునికడకేఁగుమన్న లక్ష్మణుఁడు
ఖ యనుజునికడకేఁగి యన్నలక్ష్మణుఁడు.
4 క. ఖ. దండింప
5. క. గడు జయంబుగ నీవు కదలిపొమ్మనిన
6. గూడ.
7. క ఖ. కదలి.
8 క. ఖ. చేరిన.
9. యొండొరువుల.
10. క. ఖ. మకుటకంకణహారమణినూపురాది.
11. క. చతురలైతాల్చి. ఖ సకలభూషణమాల్యచలము[illegible]ల్చి.

యరయ నందఱును రామా[1]వతారముల
కర[2]ణి నాహవరతికాంక్షులై నడవ
నయ్యె[3]డఁ గొందఱు లవునిప్రాయమునఁ
గయ్యంబువేడుకఁ గడలొత్తి కదలి
యార్చుచుఁ బంతంబుల[4]మర మీసములఁ
దీర్చుచు మ[5]గుడని తెగువతో నడవ
ధవళమాల్యాంబరధ్వజములతోడఁ
గువలయాధిప ! యొక్కకొందఱు నడవ
బహు[6]ధర్మవర్తనుల్ పదులు నూఱులును
బహ[7]సహస్రంబులై బలములు నడవ
దా[8]నవిప్రార్చనధర్మప్రియుండు
సేనా[9]నియై కాలజిత్తుండు నడవ

---

1. రామావతారముల.
2. కరుణ.
3. నయ్యెడఁ గొందఱు నలవుప్రాయంబు
   క. ఆయెడ మఱిఁగొందఱులవుప్రాయంబు.
   ఖ. నయ్యెడ మఱిఁగొందఱు లవునిప్రాయమున.
4. క. లదర. ఖ. లలర.
5. క. మగుడను తెగువతోఁజనిరి.
6. క బహుధర్మవంతులు పదులునూఱులును.
   ఖ. బహుధర్మవంతులు పదులనూర్వురును.
7. బహుసహస్రంబులై బలములోనడవ
   క. బహుసహస్రములైన బలములునడవ
8. క దానవాకృతులు నుద్దండబల్లాక.
   ఖ. దానవిప్రార్చన ధర్మతత్పరుఁడు.
9. ఖ సేనానియగుకాలజిత్తుండు నడవ.

నప్పుడు లక్ష్మణుండాసేనలోన
నొప్పెఁ జుక్కలలోని యుడురాజువోలె.
అరు[1]దారఁ జూర్ణంబులయ్యె నశ్వముల
ఖురఘట్టనంబులఁ గొండలెల్లెడల,
జడిగొన్న పొదలు వృక్షములుఁ దీఁగెలును
నడ[2]వంగ నుగ్గయ్యె నాసమయమున,
వా[3]హినీవేగంబువలను గంభీర
వా[4]హినీవేగంబు వారింపఁబడియె,
పలు[5]చనై నీరింకెఁ బైపైని బలసి
బలు[6]బిట్టు లెగసె నాపట్టులనెల్ల,
అప్పుడు తేరులు హా[7]రులును నడవ
నుప్పొం[8]గె రేణువు లొక్కటఁ గూడి
యా రేణువులతోడ నభ్రవ[9]ర్గములు

---

1. అరుదారకూర్మంబులైన యశ్వముల.
ఖ. అధరఁజూర్ణంబులయ్యె నశ్వముల.
2. క. అడవులునుగ్గయ్యె నాసమీపమున.
ఖ. అడవులనుగ్గయెఁ నాసమయమున
3. వాహినీవేగంబు వారింపఁబడియె.
4. నాహవశూరులై యాబలమునడవ.
5. క. పలుచనై నీరింకి పఁకంబుబలసి.
ఖ. పలుచనైనీరింకి పంకంబుమరసి.
౬. క. బలుబిలైయ్యెనా పల్లెలనెసఁగె.
ఖ. బలువిలులెగసె నాపటునమలెల్ల.
7. క. హరులును గరులు
8. క. నుప్పొంగి రేణువులొక్కటఁగూడి.
ఖ. నుప్పొంగిరేణువులొక్కటనెగసె.
9. క. ఖ. వర్గంబు.

పైరయంబునఁగ[1]ప్పి బలురొంపియయ్యె
నారొంపిఁ బెంపొంది యభ్రంబులెల్ల
వారక తమఘనత్వమునఁ జూపట్టె
నాయ[2]భ్రములు హస్తిహస్తఘాతముల
నాయతధ్వజదండహతులనుఁ జె[3]దరి
పది[4]దిశలకుఁబారి పంకభారమునఁ
గుది[5]కెలఁబడెను నాఘోషంబులెసఁగ,
ఘనఘటనిర్ఘోషఘం[6]టికారవము
లెనయంగఁ దేరులనేకంబు ల[7]మరె,
సెల[8]యేర్లతోడ నేచిన యద్రులనఁగ
గళ[9]దుగ్రమదమునఁ గరులు సొంపారె.
చూ[10]డనొప్పైన యాజోదులశ్వముల

1. నెత్తి. ఖ. నంటి.
2. యాహవములహస్తి హస్తఘాతముల.
3. జదరి. క. బెదరి.
4. క. పదిదిశలకునేఁగ ఖ. పదదిక్కులకునేఁగె.
5. క. కుదికలఁబడుచు మహాఘోషంబులెసఁగ.
   ఖ. కుదికెలఁబడుచున్న ఘోషంబులెగసె.
6. క. ఖ. గంభీరరవము.
7. క. లమర.
8. శిలయేర్లతోడనేర్చిన యద్రులనఁగ
   క. శిలయేరులనఁగ యేచినయద్రులనఁగ.
   ఖ. శిలయేరులవర యేచినయద్రులనఁగ.
9. కడునుగ్రరవముల కరులుసొంపారె.
10. క. చూడంగనొప్పగు జోకగుఱ్ఱములు.
   ఖ. చూడంగనొప్పగు జోకగుఱ్ఱముల.

నా[1]దించుచును వాహకావళి మెఱయ
ధర[2]ణి కంపింప నుద్ధతచర్మఖడ్గ
ధర[3]వీరభటుల మొత్తములు శోభిల్లె.
రా[4]జిల్లురథముల రవములనుగ్ర
వా[5]జులఘోషముల్ వరవీరభటుల
సింహనాదంబుల సింధురావళుల
బృం[6]హితంబుల మిన్ను బీఁటలువాఱ
నవ[7]ని యల్లలనాడ నమ్మహాబలము
జవ[8]మునఁబఱతెంచి సమరంబుఁజొచ్చె.

—: సేనఁజూచి కుశుండు కలఁగుట , లవుని ధైర్యోక్తులు —

బలవర్గములు మీఱఁ బటుగుణధ్వనులఁ
జెలఁ[9]గు లక్ష్మణకాలజిత్తులిద్దఱును

---

1. నాడించుచును మోహ నాకార్లు మెఱయ,
 క. నాడించుచును వాహకావళుల్ మెఱయ.
 ఖ. నాడింపుచును వాహకావళి మెఱసె.
2. ధరణిగంపింప నుద్ధతకార్ముకౌన.
3. క. వరవీరవరులు మొత్తములుశోభిల్ల
 ఖ. ధరవీరవరుల మొత్తములుశోభిల్ల.
4 రాజిల్లురథముల రాజిల్లురవము.
 ఖ. రాజిల్లురథముల రథముసొంపెక్క
5 వాలులఘోషముల్ వలవీరభటుల
6. బృంహితంబుగ మిన్నుబీఁటలువాఱె
7 యవనియల్లలవాడె యమ్మహాబలము.
8. క, జవమునఁ జనుదెంచి.
9. క. జెలఁగంగలక్ష్మణ కాలజిత్తుఁడును.
 ఖ. జెలఁగలక్ష్మణ కాలజిత్తులిద్దఱును.

రామక్రియావిఘ్నరతులైన యట్టి
భూమిజాసుతులనప్పుడు గాంచి యెదుర
బలములతోఁగూడఁ బడిన శత్రుఘ్నుఁ
దెలియంగఁగ[1]ని రోషదీప్తుఁడై నడవ
నపు[2]డు పైకొనివచ్చు నాసేనఁజూచి
నృపకుంజరునిఁజూచి ని[3]ర్భయుండగుచు
ననుపమరోషరక్తాక్షుఁడై కుశుఁడు
త[4]నసహోదరుతోడఁ దానప్పుడనియె,
"కరులువాజులు శతాంగములు యోధులును
నరుదు లెక్కింపంగ నలవిగాదెందు
నిప్పుడు కర్తవ్య మెయ్యది? మనకుఁ
జెప్పుమా" యనవుండు చిరునవ్వు నవ్వి 440
"కుశవీర! రిపు[5]గజాంకుశలీలఁ జాప
కుశ[6]లుండవై నిల్చి ఘోరబాణములఁ
బరిపక్వఫలములపగిది మస్తములఁ
దొరఁగించి నెత్తుటఁ దోఁగింతుగాక
మార్తు[7]నిప్పుడే మార్తుగాకిపుడు

1. గనుఁగొనిదీప్తుఁడై నడవ.
2. క. ఖ. నపుడుపై నేతెంచునాసేనఁజూచి.
3. క. నిర్భీతుఁడగుచు
4. క. ఖ. తనసహోదరునితోఁ దానప్పుడనియె.
5. రిపుగజాంకుశరేఖచాప.
6. క. (కుశలుండవై పే)ర్చి ఘోరబాణముల
ఖ. కుశలుండవైనీవు ఘోరబాణముల.
7. మార్తురనిపుడె ప్రమార్తుగాకిపుడు.

కర్తవ్యమో[1] తెలుప గలదె యీసేన
నలిరేఁగి మృగరాజునకు జంబుకములు
కలశ[2]జునకు నబ్ధికణములు నెదురె,
బలసి పెద్దలకృపాబలమును బాహు
బలమును గలనీకు బలమగణ్యంబె,
నేసాహ్యుఁడ నావాని శతంబులకు
జానకీ[3]తనయ! నీసామర్థ్యమహిమ
లె[4]మ్మ్మ సంగ్రామకేళికి నాయితమ్మ్మ
క్రమ్మ[5] చాపమునంబకములుఁ గైకొనుము
యి[6]ప్పుడీసేనల నేనె కయ్యమునఁ
గు[7]ప్పలుగానేలఁ గూల్తు నీక్షణము
వీర[8]పుంగవ! విల్లువిఱిగెఁ గయ్యంబుఁ
జేరి[9]న నేనేమి సేయుదు ననఘ!"

—లవుఁడు సూర్యునివలన దివ్యకార్ముకముఁ బడయుట;
కుశలవులు లక్ష్మణసేనలఁ గవియుట:—

అనుచు ని[10]శ్చలవృత్తి నప్పుడాలవుఁడు
తనభక్తిఁ గమలబాంధవుదిక్కుఁ జూచి 450

1. కర్తవ్యమెదిరింపఁ గలదెయీసేన.
2. క. ఖ. కలశజునకు నదికణములు నెగురె.
3. జానకీతనయుని సామర్థ్యమునకు.
4. క. లెమ్ము సంగ్రమకేళి కాయత్త (పడుము)
5. గమ్ము.
6 క. ఖ యిప్పుడీసేనలనెల్లఁ గయ్యమున
7. క. గుప్పలుగులుగాఁగూ....,న.ఖ. గుప్పలు గొన నేలఁ గూల్తువేగమున.
8 వీరపుంగవ! విలువిఱిఁగి కయ్యమున క. వీరపుంగవ! విల్లువిరిగెఁ గయ్యమున.
9. జేరనేనిదె నేమా. నేయుదుననిన ఖ. జేరినవె నేమి సేయుదుననఘ!
10. క. నిచ్చలదృష్టి. ఖ. నిశ్చలదృష్టి.

మ్రొక్కి సౌరస్తోత్రమున నమ్మహాత్ము
దక్క[1]క ప్రార్థింపఁ దదనంతరంబ
యాదిత్యుఁడును మెచ్చి యాబాలునకును
నాదరంబునఁ బ్రసన్నాత్ముఁడై య[2]పుడు
పస[3]నిపింజలతోడ బలుదొనతోడఁ
బ[4]సనిమించులనొప్పు బలునారితోడ
(ననుపమంబై దివ్యమైన కార్ముకము)*
మనుమని తనపిన్నమనుమనికిచ్చె.
వన[5]జాప్తు చేనిట్లు వరమైనవరముఁ
గొనిలవుండే తెంచి కుశునకు మ్రొక్కి
“ అనఘాత్మ ! మనగురుండైన వాల్మీకి
ఘ[6]నతరస్తోత్ర మొక్కటి నాకుఁ జెప్పె

---

1. దక్కఁగ బ్రార్థింప తననంతరంబ.
   క. తక్కకకీర్తింపఁ దదనంతరమున.
   ఖ. తక్కక కీర్తింపఁ దదనంతరంబు
2. క. నిలిచి
3. పళిండి పింజలతోడ బలునారితోడ
   క. పసనిపింజలు యంపదొనలతోడ.
4. విశిఖంబులగునట్టి వీరకార్ముకము.
   క. . . . . . . . . .మించులతోడ బలునారితోడ.
   ఖ. పసనిమించులయొప్పు బలునారితోడ.
   * ఈపంక్తి మాతృకలోనిదికాదు. క. ఖ. గ్రంథములలోని
5. వనజాప్తు చేనిట్లు వరమునదొనియు.
6 ఘనతరస్తోత్రముగా నాకునిచ్చె.
   ఖ ఘనతరస్తోత్ర మొక్కటి నాకునిచ్చె

నీమ[1]హాజపమున నిదెయొక్కవిల్లుఁ
గా[2]వించి వేగంబె కైకొంటి నేను
మఱియునస్త్రంబు లీమంత్రంబువలనఁ
దఱితోడ సిద్ధించుఁ ద[3]లఁచినయట్లు ”
అనిచెప్పి తమ్ముఁడునన్నయు సురలు
విను[4]తింపవిండ్లను వెసనెక్కువెట్టి
యవలీల శత్రుసైన్యాటవిమీఁదఁ
గవి[5]సిరి కార్చిచ్చు గాలియుఁబోలె. 46)
రెండుమేఘంబులు రేఁగి కోపమునఁ
గొండపైజడివానఁ గురియుచందమున
శ[6]రముల లక్ష్మణసైన్యంబుమీఁదఁ
గు[7]రిసిరాయిద్దఱు ఘోరవేగమునఁ
దలరి మైనాకమందరనగేంద్రములు
కలపంగఁగలఁగిన కలశాబ్ధిపోలె

---

1. నామహాజపమున నదియొక్కవిల్లు.
   క. నీమహాజపమున నీయొక్కవిల్లు.
   ఖ. నీమహాజపమున నిదియొక్కవిల్లు.
2. గావించి క. కావించి
3. క. దలఁచినవెల్ల.
4. వినుపింప.
5. గవిసినఁగార్చిచ్చు గాలియుంబోలె.
6. శరములు లక్ష్మణసేనలమీఁద
   క. శరవృష్టిఁగురిసె లక్ష్మణసేనమీఁద.
   ఖ. శరవృష్టియపుడు లక్ష్మణుసేనమీఁద.
7. క. కురి. . . . . . . . డివేగమున.

శరకుంతనారాచచ[1]క్రభల్లములు
బెరయంగ న[2]దిపడిఁబెల్లుమ్రోయుచునుఁ
గలఁగుచు నమ్మహాఘనులచే నొచ్చి
తలచెడి సంగరస్థలి నిల్వలేక
యచ్చెరువుగ నప్పుడరయోజనంబు
విచ్చిసైన్యంబెల్ల వెను[3]కకుఁబారె.

—: లవుండు లక్ష్మణబలములఁ
జెండాడి నేలఁగూల్చుట :—

క[4]నలి సౌమిత్రియుఁ గాలజిత్తుండు
ఘనతరాంబకములఁ గప్పిరాకుశునిఁ
దలకొని లవుమీఁద ద[5]శశతభ్రముల
బలములుఁగవిసె నుద్భటవృత్తి మెఱయ.
అ[6]నుచు జైమిని చెప్పనచ్చెరువంది
జనమేజయుఁడువల్కె స[7]వినయుండగుచు
" భ్ర[8]మిసంఖ్యయదియెంత? పరమమునీంద్ర !
క్రమమొప్ప[9]వినుపింపఁగాఁదగు "ననిన 470

1. ఖ. చక్రఖడ్గములఁ.
2. క. సుడిబడి భేర్లుమ్రోయుచును ఖ. సుడివడిపెల్లుమ్రోయుచును.
3. వెనువెనుకకుఁబారె.
4. కనియు.
5. దశశతభ్రములు ఖ. దశరథభ్రముల.
6. ఖ అనినజైమినిఁజూచి యచ్చెరువంది.
7. క. జైమినితోడ.
8. క. భ్రమసంఖ్య యిదియెంత ఖ భ్రమిసంఖ్య యవియెంత.
9. క. ఖ. నెఱిఁగింపఁ దగుననిన

జైమిని వ[1]ల్కె నాజననాథుతోడ
నీమహాసంఖ్య నీకెఱిఁగింతు వినుము
ఘనతుండములు మదోత్కటములునగుచుఁ
దనరారువరభద్రదంతులు నూఱు
తేరులు దంతిదంతికినొక్కవేయి
(తే[2]రి తేరికి నూఱు తేరినహారులు
హా[3]రిహారి ! యట్ల మహావీరభటులు
ధరణీశ ! యీగతిఁద[4]ప్పని లెక్క
భ్రమియననొప్పు నాభ్రమువొక్కవేయి)*
భ్రమయించుగర్జితాభ్రముల చందమున
రవిబింబసంకాశు రవికులాధీశు
లవుఁగప్పె నప్పుడాలము ఘోరమయ్యె,
ఒ[5]క్కనిపై నిట్లు నొక్కవేగమునఁ
బె[6]క్కుపంతములతోఁ బెక్కండ్రు కవిసి
వడిఁ[7] దమలోన నెవ్వనిఁ గన్నవారు

1. క. ఖ. పల్కె.
*ఈ రెండుపద్యములు మాతృకలోనివి కావు. క. ఖ గ్రంథములలోనివి.
2. క తేరు తేరుకు నూఱు.
3. ఖ. హారిహారికట్ల.
4. క. దప్పదీలెక్క.
5. నొక్కని నిట్టిట్లువొక్కవేగమున
ఖ నొక్కనిపైవీరుఁ డొక్కవేగమున
6. క. పెక్కుపంతంబులఁ బెక్కండ్రుగవిసి.
ఖ. పెక్కుతూర్యంబులఁ బెక్కండ్రుగవిసి
7. క. . . . . . . . . . .దాఁకి.
ఖ. వడిఁదమలోన నెవ్వారిఁగన్న వారి

పొడు[1]వుఁడు చిక్కెనిప్పుడు లవుండనుచుఁ
బట్టిన చలమునఁ బట్టిపోనీక
పట్టిసంబులఁ గ్రుమ్మి పారఁజిమ్మియునుఁ
గొంత[2]యుఁ దెలియక కోరిసైన్యంబు
కుం[3]తశూలంబులఁ గుదులగ్రుచ్చియునుఁ
దళ[4]తళమనుచు నడ్డళములఁజొచ్చి
తలఁ[5]కక పొడిచి యంతంతఁగూల్చియును
కాల[6]నాభీలకాళాంగములును
కాలవైచియు ఘోరరౌద్రంబు మెఱయ
గము[7]లుగా విషపన్నగములై నయాశు
గము[8]ల మర్మంబులఁ గాఁడనేసియును

---

1. పొడువుఁడు లవుఁడు యిప్పుడు చిక్కెననుచు.
2 క. కొంతయుఁదెలియక కొంతసైన్యముల.
ఖ. కొంతయుఁదెలియక కొంతసైన్యములు.
3. కుంతశూలంబులు గుదులుగ్రుచ్చియును.
క. కుంతంబులనుబూని గుదులుగ్రుచ్చియును.
ఖ. కుంతంబులొగిబూన్చి గుదులుగ్రుచ్చియును.
4 ఖ. ధళధళమనుచుఁ గత్తళములుచాఁచి
5 క. ఖ. తలఁకకపొడిచి యంతపనిగూర్చియును
6 కాలనాలాభిలకాలాంగములను
ఖ కౌలనాభిలకకాలాంగకములు.
7. గములుగావిషపన్నగములయాశుగము.
క గములు రాణింపఁ బన్నగముట్టియాశు
ఖ. గములుగావిష పన్నగములంటియాశు.
8, క. గములవర్ణంబులు.

నొం[1]డొరుముందల లొడిసి పట్టియునుఁ
చెం[2]డాడి సొంపెల్లఁ జెడఁగ మోదియునుఁ
గలఁ[3]గక నిలిచి ఖడ్గాఖడ్గిలీలఁ
గలయ ముష్టాముష్టిఁగ[4]తులఁ బోరియునుఁ
గల[5]గొన సందడి కయ్యమీభంగిఁ
జలి[6]పిరి ; లవుఁడు నాసమయంబునందుఁ
బ్రళయకాళాభీలఫా[7]లాక్షులీల
నలి[8]రేఁగి యురుసింహనాదంబు సేసి
విలుఁగొని మంటలు వె[9]డలుబాణముల
బలువిడి నేసి నిర్భ[10]యమూర్తి యగుచు
డెందం[11]బులవిసి వాఁడిమిఁదక్కి తన్ను

---

1. క. యొండొరుముందలల్ వొడసిమస్తకము
   ఖ. యొండొరుమస్తకంబొడిసి రాఁదిగిచి.
2. క చుట్టాడియును సౌమ్మసిల్లి మోదియును.
   ఖ. చెండాడియును సౌమ్మసిల్లిమోదియును
3 ఖ. కలఁగకనిలిచియు ఖడ్గాంగలీల
4. క గదలఁబోరియును.
5. కలగొనసందడి గలయనీభంగి.
   ఖ. కలగొనసందడి కయ్యమిభ్భంగి.
6. క సలిపిరాలవుఁడును సమయంబునందు.
7. క ఫాలాక్షుపగిది.
8. ఖ. నలిరేఁగియును సింహనాదంబుబెరయ.
9. క. వెలుఁగుబాణముల
   ఖ వెలుఁగుబాణములు.
10. ఖ. నిర్భరవృత్తియగుచు.
11. క. డెందంబుళలసి,

నంద[1]ఱు గొనకొనినట్లుగాఁ దిరుగ
నెన్ని[2]నరీతి భద్రేభంబు నూట
నిన్నూ[3]టఁ దురగంబు నేనూట భటుని
నూ[4]ఱు సారథులను నుగ్గునుగ్గాడి
పాఱఁ[5]గ నావేయిభ్రమములలో నెందుఁ
బొడవడకుండ నేర్పున లా[6]ఘవంబుఁ
గ[7]డిమియు మీఱ నొక్కటఁ దూపులేయ
మెఱ[8]సి చూపఱచూడ్కి మిఱుమిట్లు గొనఁగఁ
గొఱవిఁద్రిప్పిన తెఱంగున సం[9]చరించు
కౌశికశిష్యుని గాదిలిసుతుఁడు
కౌశికవిద్యకుఁ గడుజాణఁడనఁగఁ
తూ[10]ణీరపేటికఁ దోడ్తోన వెడలు

---

1. క. నందరంగగొనియట్లుగాదిరిగి
2. క. యెన్నినరీతి భద్రములునూఱు.
3 క. యిన్నూటఁదురగంబు లేనూఱుభటులు
4. నూఱునూఱు రథినుతలీలఁగాండి.
క. నూరుసారథులను ధరనుగ్గనుగ్గాడి
ఖ. నూఱునూఱుల రథికులనట్లుగొండి
5. వారకనాదియభ్రవములో నేడు
క. పారంగవేయి భద్రనాగముల
6. క. లాఘవమున. ఖ రాఘవమును
7. క. కడిమియుమీర నేర్పునఁదూపులేయ.
8 క. మెఱసెఁజూపరమాడ్కి
9. ఖ. సంచరింప
10. క, తూణీరపెట్లకుఁ దోడ్తోనవెడలు.

బాణపన్నగములఁ బట్టి మంత్రించి
క్రీడ[1]మై రిపుతనుగేహాంతరముల
నాడిం[2]చి ప్రాణంబులను బలిఁగొనుచు
లవుఁడు మండుచు మండలప్రచారముల
వివిధమార్గంబుల వే[3]సఁదిరుగు నింద్రు
కులిశంబు నగములఁ గోపించుభంగి
బ[4]లముల గుండెలు పగులనార్చుచునుఁ
గరు[5]ల నూఱును రథాంగముల లక్షయును
హరు[6]లకోటియు ధీరులగు శతకోటి
భటు[7]లనుఁ గలయట్టి భ్రమములట్టి భ్రమములఁ
బటులీల నాలుగుపదుల నొక్కరుఁడు 500
నొకముహూర్తంబున నుర్విపైఁగూ[8]ల్చె.

---

1. క్రీడమైరిపులను గేహాంతరముల.
   క. క్రీడమై తనరిపు గేహామాంతరము.
2. ఖ. క. నాటించి.
3. క. ఖ. వేడుకఁదిరుగు.
4. క. బలములవేపురఁ బడనార్చినట్లు.
   ఖ. బలములవెరఁగుడు వడనార్చునిట్లు.
5. గరులనూఱుల రథాంగములలక్షయును.
   క. ఖ కరులునూఱును రథాంగములు లక్షయును,
6. క. హరులుగోటియు తేరులుశతకోటి.
   ఖ. హరులుకోటియును ధీరులుశతకోటి.
7. భటులనుగలయట్టి భ్రమలుదిగ్భ్రమలు.
   ఖ. భటులునుగలయది భ్రమలంటభ్రములు,
8. ఖ. గూల్చె.

—: రణరంగమునఁ గుశునిఁ గానక లవుండు చింతిలుట :—

అకలంకవిక్రముండై యార్చి[1] పేర్చి
యాసింహవిక్రముండా గజభ్రమల
నాసురవృత్తిఁ జెం[2]డాడుచో లవుఁడు
"శలలభీకరమైన [3]శల్యంబెపోలె
కలయనాటిన యంబకములచే నొ[4]చ్చి
కుశుఁ[5]డు సైన్యంబులఁ గొల్తల నెట్టి
దశ[6]నొందెనో!" యని తల్లడమంది
దెస[7]లునాలుగుఁ జూచి దీప్తదివ్యాస్త్ర
విస[8]రసముద్దండవీరసంకులము
రథికమనోజ్ఞసా[9]రథి జవానీత
రథనేమినిష్ఠురారావభీకరము
సమ[10]దవారణఘనశ్యామాయమాన

---

1. క. యార్చియార్చి.
2. జెండాడుచోనవుడు.
3. క. శైలంబెపోలె. ఖ. శల్యంబుబోలె.
4. నొప్పి.
5. క. కుశుఁడుసైన్యంబు లరిగూలెనన్నట్టి.
6. దశనొందెనోయని యల్లడమందె.
   క. దెసఁబొందెనోయని తల్లడమందె.
   ఖ. దశఁబొందెనోయని తల్లడమంది
7. క. దిసలు. ఖ దిశలు
8. క. వీరసముద్దండ వీరసంకులము.
   ఖ విసరముదండడన వీరసంకులము.
9. క. సారథిజవానీక.. ఖ. సారథింజావనీక.
10. క. సమయవారణ ఘటాశ్యామాయమాన,

సము[1]దగ్రమును నశ్వచయభయంకరము
నగుసేనఁ గను[2]గొని యప్పుడాకుశునిఁ
దగఁ[3]గానలేక యత్తరిని నాలవుఁడు
"అ[4]క్కటా! యిపుడు మాయన్న యొక్కరుఁడు
యెక్కడఁ జిక్కెనో! యేమందు" ననుచు
నాలంబుఁ జాలించి య[5]పుడూరకుండె.

—: లవుండు రుధిరాక్షునితో భయంకరమగు యుద్ధముఁజేసి యతని నేలగూల్చుట :—

ఆలో[6]న నద్భుతమైన వేగమున 510
జ[7]ననాథ! రఘునాథశరణాగతుండు
విను లవణునిమామ వి[8]క్రమోద్ధతుఁడు
నధికుండు రుధిరాక్షుఁడనువాఁడు కపట
వి[9]ధిపరాయణుఁడు దోర్విభవదుర్జయుఁడు

---

1. క. సముదగ్రమగు.
2. క. ఖ. పొడగని.
3 క. మొగముఁగానక చింతమునిఁగె నాలవుఁడు
ఖ. మొగముఁగానక చింతమునింగి యాలవుఁడు.
4. ఖ. అక్కటా! మాయన్న యిపుడొక్కరుండు.
5. యాలవుఁడుండె. ఖ. యటులవుఁడుండె.
6. ఖ. నాలోననద్భుతంబైనవేగమున.
7 క జననాథ! యంతనాశ్చర్యంబుగాఁగ.
8. క. విక్రమోజ్వలుఁడు. ఖ. విక్రమోన్నతుఁడు.
9. క. విధమునవచ్చియా విభవదుర్జయుఁడు.
ఖ. విధిపరాయణుఁ దోర్విభుదుర్జయుండు,

చె¹నసి యొక్కట లవుచేతి విల్లూడిసి
కొనిపో²యె సైన్యంబుకో యని యార్వ ;
బలియుఁడై లవుఁడు నా³పగర వీక్షించి.
"నిలునిలు కపటాత్మ! నేర్పరివాడు
నీవేల ? క్రొవ్విరి నేఁడు నాచేతఁ
జావక యిఁ⁴క నెందుఁ జనఁగలవ" నుచుఁ
జక్రంబుఁగొని వైరిచక్రంబు వ⁵డఁకఁ
జక్రపాణియుఁబోలె సక్రోధుఁడగుచు
దంట్రయై తరుమ నాఁతడు పాఱలేక
మింటికి నెగయ భూమిజపిన్నకొడుకుఁ
దక్కక వాల్మీకిఁద⁶లఁచి సద్భక్తి
మ్రొక్కుచుఁ దనకు నమ్ముని యిచ్చినట్టి
వా⁷యుమంత్రంబును వడి జపియించి
వా⁸యుప్రసాదజవంబున నెగసి

1. చెనసియామరలవు చేతివిల్లూడిసి
   క. చెనసియొక్కట లవునిచేతి విల్లూడవి.
   ఖ చెనసియొక్కట లవుచేతివిల్లూడసి.
2. క. ఖోయనియార్వ. ఖ. కోవనియార్వ
3. క. పగతునీక్షించి.
4. యిఁక నేఁడు.
5. క. ఖ. వణఁక.
6. క. దలంచినభక్తి.
7 వాయుమంత్రమ్మున వడిజపియించి.
   క. వాయుమంత్రమునుఁ దీవ్రమునజపించి
   ఖ. వాయుమంత్రంబుఁ దీమ్రుజపియింప.
8. వాయుప్రభావ జవంబున నెగసి,

యురగంబునెత్తుట నొడలెల్లఁ దడిసి
యుర[1]వడి నెగయు మయూరంబెపోలె
(ఫలలంబునొడిసి యుప్పరముగా నెగయు
బలుడేగయునుఁబోలె బాలకుండపుడు
నుఱుక "నెవ్వనిమీఁద నుఱుకునో" యనుచు)*
వెఱచి సైన్యంబెల్ల వీరునిఁజూచి
య[2]లవుమై విండ్లను నమ్ములుఁ దొడిగి
సో[3]లయక గగనంబుఁ జూచెడివారు
పొ[4]దిగొన్న ఖేటకంబుల మస్తకములఁ
గదియించి యుందంద క[5]డునుండువారు
పిడుగుచందంబున భీమవిక్రముఁడు
"వ[6]డి మనమీఁద నవశ్యంబు నుఱుకు"
ననువారు మఱికొందఱరదాలక్రింద
గుని[7]కిల తలఁగ్రుక్కుకొనియెడివారు

---

1. యురువడినెగయ
* ఈమూడుపంక్తులు మాతృకలోనివికావు. క. ఖ. గ్రంథములలోనివి,
2. యెలమిమైవిండ్లును యమ్ములు దొడిగి.
3. సొలవక.
4. పొదిగొన్న క్రేవనంబులు మస్తకములు.
   క. పొదిగొన్న ఖేటకంబులమస్తములు.
5. క. ఖ. గప్పించువారు.
6. క. దనమీఁద.
7. గునికిలతలగుట్టి కొనిరొడువారు.
   క. గునికలతలబెట్టుకొని యుండువారు.
   ఖ. గునికిలతలఁ గుక్కుకొని యుండువారు.

బలుబిలంబులతో[1]డఁ బర్వతావళుల
పొలుపునఁబడి పెనుప్రోవులై యున్న
గజకళేబరము లొక్కటఁ జొరబాఱి
గజ[2]బిజించుచు భీతిఁ గలఁగెడువారు
చొరఁజోటులేక యచ్చో మహావీరు
లు[3]రుభయంబుఁ బాఱి యొండొరుఁ గడవ
శవ[4]ములలోఁ జొచ్చి చచ్చినయట్లు
బవరంబులోపలఁ బ[5]డియుండువారు
నగుచు సైన్యంబెల్ల హల్లకల్లోల
మగు[6]చుండె విలయకాలాబ్ధియుఁబోలె ;
ఆ[7]లోన దమనుండు నమలసుకేతు
కా[8]లసింహుఁడు జితక్లముఁడు ధార్మికుఁడు

---

1. క. ఖ. తోడి.
2 గజభజింపుచు. క. గజభిజయై.
3. లురుభయంకరములు యొండొరుఁగడవ.
క. లురుభయంబునబొంది యొండొర్లుగడవ.
4. క. శవములలోఁజొచ్చి చచ్చినట్లుండి.
ఖ శవములలోపలఁ చచ్చినయట్లు.
5. బడియొడివారు. ఖ. పడియున్నవారు.
6. మగుచు నావిలయకాలాగ్నియుబోలె.
క. మగుచుండె వెలయకాలాబ్ధియుంబోలె.
ఖ. మగుచుండి విలయకాలాబ్ధియుబోలె.
7. యాలోనమదచండు నమలసుకేతు.
క. యాలోనదమలుకడు(నమలుండు) నమలసుకెతు.
8. క. కాలజిత్తుండు సుధాక్రముఁడు ధార్మికుండు.

చం[1]ద్రశరన్నరశత్రుసూదనులు
సాంద్రకోపానలజ్వాలితాస్యులగుచు
మదియించి దశరథమంత్రినందనులు
పదుగురు నొక్కట బా[2]లుపైఁగవిసి
కుప్పించి శరములఁ గ్రూరులై యతని
నొప్పించి సమరవినోదంబు స[3]లిపి
చెద[4]రంగ నాతని చేతిచక్రంబుఁ
బదిపదిశరములఁ బడ నేసిరలుక ,
చక్రంబుఁ దునిసిన జానకీసుతుఁడు
సక్రోధమూర్తియై జగతిపై కుఱికి
పరిఘంబుఁగొని కూడఁబఱతెంచి చండ
క[5]రునికై వడి జితక్లము రూపుచూపి
“నిర్మాల మగుమోరి ! నేఁ[6]డు నీకిదియ
ధ[7]ర్మంబు పొమ్మ”ని ధార్మికుఁగూల్చి

1. క. చంద్రశరాన్నర శత్రుసూదనుఁడు.
ఖ. చంద్రశెరన్నద శత్రుసూదనులు
2. ఖ. బాలుపై నెగసె.
3. ఖ. సలప.
4. బిరుదులైయాతని పెద్దచక్రంబు.
క. చదురుపలై చెదర నాతనిచేతిచక్రంబు.
5. కరునికైవడివైరి చక్రంబుఁజొచ్చి.
క. కరునికైవడిజితాంక. . . . . . . .
6 నేఁడునీకిదియుం.
7. క ధర్మంముగొమ్మని ధార్మికుంగూల్చె.
ఖ. ధర్మంబువొమ్మని ధార్మికుఁగూల్చె.

యా[1]తపత్రముతోడ నరదంబుతోడఁ
గేతువుతోడ సుకేతును[2]గ్గాడి
యా[3]దిశాంతముగాఁగ నార్చుచు శత్రు
సూదనుండై శత్రుసూదనుఁ జం[4]పి
రౌద్రరసోద్రేకరయమున వీర
భద్రుఁడై చంద్రునిఁ బ[5]గులంగనేసి
గదల[6]పంక్తులఁ జాల కలయనొప్పించి
మద[7]నారిరేఖయై మదనుని గడపె.
ఆలోన సైన్యంబులందంద వణఁకఁ
గాలునిఁ గాలునికడకుఁబో న[8]సిపి
యమరగంధర్వసిద్ధాదులు వా[9]గడ

---

1. యాతతరథచక్ర మదరంబుతోడ.
 క. యాతపత్రములోడ. . . . . .
 ఖ. యాతపత్రములతోనరదంబుతోడ.
2. ఖ. నుగ్గాడ
3. క. ఆదశాంతముబగల నార్చుచువచ్చి.
 ఖ. ఆదశాంతరముగా నార్చుచుశత్రు.
4. క. ఖ. జంపె.
5 క. పగులంగ్రేసె. ఖ. భగ్నంబుసేసె.
6. గదలపంక్తులఁ జాలగడలినొప్పించి.
 క. కదనోగ్రపంతుల గలయనొప్పించి.
 ఖ. కదనపసక్తుల కదలనంకించి.
7. మదనాంగరేఖ లమ్మదనునిగడపి.
 క. మదనారిరేఖయై మదను. . . . . . .
 ఖ. మదమునరేఖయై మదునునిగడపె.
8. క. ఖ. ననిపె.
9. క. ఖ. పొగడ.

నమ[1]లతేజస్కుఁడై యమరఁ జెండాడి
సంహారవిక్రమక్షముఁడైన నార
సింహామూర్తియుబోలె సింహురూపడఁచి
పెళపెళనార్చుచుఁ బిడుగుచందమున
నలివలిగా శరన్నదుని యేపడఁచి
ఘనపరంపరల నొక్కట ను[2]గ్గుసేసె
మొనసిన పవమానమూర్తియుఁబోలె,
దొ[3]రలు పదుంద్రు నెత్తురులతోఁ గవచ
శరచాపభూషణజాలంబుతోడఁ
బలు[4]వురొక్కట వేదబాహ్యమానవులు
బలసి రౌరవమునఁ బడినట్లు బడిరి. 5
అప్పు[5]డు గదాపాణియై రుధిరాక్షుఁ
డపరభైరవమూర్తియై బా[6]లుఁగదిసెఁ
గై కొ[7]నకాతండుఁ గదిసె నందంద
పై కొ[8]ని యాగదాపరిఘసాధనులు

---

1. నమలతేజస్కు లాయములు జెండాడి.
ఖ యమలతేజస్కుఁడై యమలుచెండాడి.
2. నుగ్గుసేసి.
3. దొరలబదుంద్రె నెత్తురులతోగవయ
ఖ. దొరలుపదుంద్రె నెత్తురులతోకవచ.
4 బలువులొక్కట.
5. ఖ. అప్పుడగదపాణి.
6. బాలుఁగదిసి.
7. ఖ. కై కొనకతఁడునుఁ గవిసెనందంద
8. ఖ. పైకొనియుద్దలు పరఘనాదముల.

కర[1]ములు దళములు గళములుఁ దలలు
నురములు సంధులు నొండొండన[2]లియ
నొండొరు వ్రేయుచు నుగ్రకోపమున
గండభేరుండయు[3]గ్మంబునుఁబోలె
విడువక పె[4]నఁగిరీవిధమున గిరులు
వ[5]డఁకాడఁ జారణవరులుఁ గీర్తింప
దై[6]తేయసైతేయదారుణగతుల
భీ[7]తియుఁ బ్రీతియు బెరసె సేనలకు
నాలోనఁ దనగద నంకించి యా[8]తఁడు
బాలునితల వ్రేసె బా[9]హుగర్వమున
నటు వ్రేటువడి లవుండవనిపై వ్రా[10]లి

---

1. ఖ. కరములు ప్రక్కలు గళములుతలలు.
2. ఖ నవియ.
3. యుగ్మంబులబోలె.
4. క. ఖ. పెనఁగిరివ్విధమున గిరులు.
5. వడకాడ వారణవరులుగీర్తింప.
   క. వణఁకసారణసిద్ధవరులు గీర్తింప.
   ఖ. వణఁకవారణ సిద్ధవరులుగీర్తింప.
6. క. దైతేయసమతేయదారుణగతుల.
   ఖ. దైతేయనవితేయదారుణగతుల.
7. బ్రీతయు వి త్తియు బెరసెసేనలకు.
   క. ప్రీతియుభీతియు బెరసెసేనలకు.
   ఖ. ప్రీతియుభీతియుఁ బెనసెసేనలకు,
8. యసుర
9. క. బాహువర్గమున.
10. వ్రాలె.

యటముహూర్తమునకు న[1]ల్లనఁదెలిసి
కడుసంభ్రమమున దిగ్గజముచందమున
వడి[2]లేచియార్చుచు వసుధపైనున్న
కుం[3]తంబువట్టి యకుంఠితుండగుచు
నంత[4]టఁ గడువేగ యాతనిఁ గదిసి
దనుజవీరునితలఁ దాననె త్రుంచె.

—: లవుఁడు లక్ష్మణసేనలతోఁ యుద్ధముఁ జేయుట :—

తనవిల్లుఁగైకొని ధరవ్రయ్య నా[5]ర్చి
లక్ష్మణుసేనపై లం[6]ఘించి విజయ
లక్ష్మీమనోజ్ఞవల్లవుఁడైన లవుఁడు
కడఁ[7]గి మహావిషకల్పాశుగములఁ
గడుఁబెక్కులేసె నఖండవేగమున
నరుఁగ్రమ్మి హతశేషమగు తొమ్మనూట
యా[8]రువది భ్రమములంత నవనిఁగప్పటయు

---

1. క. యటముహూర్తంబున నొయ్యనందెలిసి.
ఖ. నటముహూర్తంబున కయ్యనందెలిసి.
2. క. ఖ. వడిఁబేర్చి.
3. క. ఖ. కుంతంబుఁగొని దైత్య కూడండఁబారి.
4. క. కుంతంబువట్టితోఁ గుటిలాత్ముఁడగుచు.
ఖ. కుంతలంబులఁబట్టి కుటిలాత్ముఁడగుచు.
5. క. ఖ. నార్చి.
6. లఘులీలవిజయ.
7. క. కణఁగియార్చియు విషకల్పాశుగముల.
ఖ. కణఁగియానిశితాస్త్రగములై నగముల.
8. అరువదిభ్రమములంత యంతఁగప్పటయు.
ఖ. అరవదిభ్రమములంత యవనిగప్పటయు.

గర్భంబులోపలఁ గదలకయున్న
యర్భకుండునుఁబోలె యాసేనలోన
బలుమంచు విఱియించు భానుఁడో! యనఁగ
బలునారసముల నబ్బలములఁ బ[1]ఱపె,
వెండియునా[2]సేన విడువక యతని
నొండొండఁగవిసి మహోగ్రవేగమునఁ
జండగదాకుంతశక్తినారాచ
భిండివాలాదుల బెట్టడరింపఁ
గ[3]నలి బాలుఁడు వట్టికసవుపైనడుచు
వన[4]పావకుఁడువోలె వడినేపురేఁగి
బలు[5]మంటలుమియు నంబకములఁదొడిగి
బ[6]లములఁజెండాడ బాహుగర్వమున
మొనసి పైకొని వీరముఖ్యులందఱునుఁ
గనలిపోవక మత్తకరులఁ గొల్చియును
హరులఁ దోలియు మహాహవవీరవరులఁ
బురిగొల్పియును రథంబులఁ బఱపియునుఁ
గొందఱు వీరులుక్కున నే[7]పురేఁగి

1. బరపి.
2. సాలోన.
3. క. కనలిపావకువట్టి కసవుపైనడుచు.
4. క. వనపావకునిబోలె.
5. క. బలుదుగ్రరవముల బాణముల్ తొడిగి.
6. క. బలములఁజెండాడి బాహువర్గమున.
7. క. క్రొవ్వుమీరి.

"యిం[1]దఱు నీబాలుకిటు వాఱనేల ?
యీ[2]మెయి విరథులై యినవంశుకడకు
నేమ[3]ని? పోయెద రిస్సిరో !" యనుచుఁ
దెలి[4]వి నొండొరులనుఁ దిట్టుచుమగుడఁ
దల[5]కొనుటయు మహోద్దండవేగమునఁ
దన్నునేమరక యంద[6]ఱకునుఁ జూడ
నన్ని[7]రూపంబులై యతివిచిత్రమునఁ
గో[8]దండవరచండగుణరావభరిత
రో[9]దోంతరాళుఁడై రుద్రుండువోలె
ఘ[10]నఘనప్రళయనిర్ఘాతసంఘాత
సునిశితాస్త్రంబుల సోనలుఁ గు[11]రిసె.

---

1. క. యిందఱుబాలుతోనిటఁబోరలేక
2. యిమ్మెయి.
   ఖ. యిమ్మేన.
3. క. యేమనిపోయెద మిస్సిరోయనుచు.
4. క. తెలియనొండొరులను.
5. ఖ. తలకొనుటయును వేతండవేగమున.
6. క. నందఱికినితెగువ.
   ఖ. నందఱకును సాకఁ.
7. క. అన్నిరూపంబులై నటు విచిత్రముగ.
   ఖ. దన్నిరూపంబులై యతి విచిత్రముగను.
8. క. కోదండవరచండగుణరావభరిత.
9 క. రోధోంతరాళుఁడై రుద్రుని. . . . . .
   ఖ. రోదాంతరాళుఁడై రుద్రుండుబోలె.
10. ఖ. ఘనతర.
11. క. కురియు.

త[1]నమీఁదనేయ నందఱు నొక్క తెగువ
ఘ[2]నచాపముల నంబకంబులఁ దొడిగి
యు[3]రక వారలనెల్ల నుర్విపై నతఁడు
కర[4]ములఁ గొలఁదికి ఖండించివైచి
తు[5]నుకలు నేలపైఁ దొరఁగక మున్నె
తునుమె రెండును మూఁడు తు[6]నియలుగాఁగఁ
గరతలంబులు మస్తకంబులుఁ దక్క
నిఱుగెలంకులఁ ద్రుం[7]చె నెలమిఁ జాపముల
శరధులకై కేలుఁజాఁప నాలోనఁ
గరములు దొనలు నొక్కటఁ ద్రుం[8]చివైచి
తెగఁ[9]బాపి దృష్టి సంధించి పైనేయఁ
దెగి[10]నయుర్వీరుల దృఢముష్టి సడల

---

1. తనమీఁదనడవ.
ఖ. తనమీఁదనెనయ.
2. క. ఘనరోషమున.
3. నురకవారలనెల్ల నుర్విపైయతఁడు.
క. నురకవారలఁజంప నొల్లక యతఁడు
ఖ. వురగవాలమ్ముల నొప్పింపనతడు.
4 గరులకొలందికి ఖండించివైచు.
క. కరములఁగొలఁదికి ఖండించివారి.
ఖ. గరులకొలందికి ఖండించివాని.
5. క ఖ. తునియలు.
6. క. ఖ. తునుకలుగాఁగ.
7. క. ఖ. ద్రుంచు.
8. ద్రుంచివైచు.
9. తెగఁబాపి దృష్టినితెగినయుర్వీరు.
10. దెగినయుర్వీరుల దృఢముష్టిసడిల.
క. యుడరిన దృఢముష్టియన్నియుసడలి

లీలమై మొగమున లేనవ్వులొలయ
వాలుఁదూపుల గు[1]ణావళుల నుగ్గాడి
యె[2]త్తిన కైదువలెల్లఁ దోడ్తోనఁ
ముత్తునియలుగాఁగఁ దునిమి కాల్బలముఁ
బదుల నూఱుల వేల బ[3]లియులనొక్క
కదు[4]పుగా వెలిచి యొక్కట నేర్పు మెఱసి
పడకుండ మేనులఁ బదములఁ గేలుఁ
దొడ[5]లును నిడువాలుఁదూపులఁ గ్రుచ్చి
ఖండితారణ్యంబుగతిఁ దోఁపఁ దలలఁ
జెండా[6]డి నిలువున జీవముల్ వెడల
వ్రాలకుండఁగ గజావళుల పాదముల
నేలతోఁ గీలించి నిశితబాణములఁ
గొం[7]డలగతిఁ బెనుకుప్పలుగాఁగఁ
గం[8]డల నెమ్ములఁ గడిమిమై రా[9]ల్చి

---

1. గుణావలులనుగ్గాడు క గుణావళులు చెండాడి.
   ఖ. గుణావలుల జక్కాడు.
2. క. యెత్తినకింక నొకెత్తుటనరుకు.
   ఖ యెత్తినకింక నొక్కఁతననరుకు.
3. క. ఖ. బలువురనొక్క
4. క. కదుపుగావించి.
5. ఖ. తొడవులు.
6. క. చెండాడినిలువున జీవముల్ వెడలు.
   ఖ. చెండాడునిలువున జీవములు వెడలు.
7. కొండలగతిజను గుంపులు గాఁగ.
8. కండలు నెమ్ములుంగడిమి మైరాల్చు.
9. క. రాల్చు.

కెరలి రౌతులఁ దలక్రిందుగా వ్రై[1]చి
యు[2]రవడిఁ బడనేయు నుత్తమాశ్వముల
ము[3]లు తెగఁగొని పగ్గముల నుగ్గునేసి
తొలఁగక రథసారథులఁ బారిచమరి
రమణకెక్కిన యతిరథమహారథుల
సమ[4]రథులను లీలఁ జక్కాడివ్రైచి
వీరరసావేశవివశుఁడై యిట్లు
భూరిపరాక్రమస్ఫు[5]రణమై నతఁడు
వర[6]రథద్వీప దుర్వారాశ్వమకర
శరమీనరక్తాంబు సమదేభశైల
హస్తవిద్రుమక[7]పాలానఘశుక్తి
విస్తా[8]రసితదంతవిశదమౌక్తికము

---

1. వ్రైచు
2. యొఱలుచుఁబడనేయు నుత్తమాశ్వముల.
3. క. ములుకొనిపగ్గములను నుగ్గుచేసి.
   ఖ. ములుకులుకొని పగ్గములునుగ్గునేసి
4. సమరవీథిని తలఁజెండాడివ్రైచి.
   క. సమరథులనవలీలఁ జక్కాడివ్రైచి.
   ఖ. సమరథులనులీలఁ జక్కాడివెండి.
5. క స్ఫురణంబుమెఱసి.
6. వరరథద్వీపకరాళాశ్వమకర.
7 కపాలానికశుక్తి.
8. విస్తారసితదంతవిరసమౌక్తికము.
   క. విస్తారశుద్ధాంతవిశదమౌక్తికము.
   ఖ. విస్తారనిశితదంతవిశదమౌక్తికము.

నగురణాంబుధి నో[1]లలాడు భూతములు
పొగడంగ లవుఁ[2]డటు వోరుచునుండె.

—: కుశుఁ డతిభయంకరమైన సమరమున లక్ష్మణసేనలఁ బరిమార్చుట ; లక్ష్మణపరాభవము :—

అటు సింహవిక్రముండైన యాకుశుఁడు
చటులబాణముల లక్ష్మణుని నొప్పించె,
కనలుచు మూఁడంబకముల వైదేహి
తనయుఁ గిరీటమాతఁడు దొల్లనేసె,
భ్రమ[3]ణచక్రంబను బాణంబుఁ దొడిగి
తమకించి బాలుఁడాతని ర[4]థంబేయఁ
జలియించి విలయజంఝామారుతమునఁ
బలుమాఱుఁ దిరిగెడు భర్మాద్రివోలె
కడిఁ[5]ది బాణము తాఁకి కంపించి రెండు
ఘడియలు తిరిగె లక్ష్మ[6]ణుమహారథము
క్షితినాథ ! భ్రమణంబుఁ జెంది యాతేరి
చతురశ్వములునుఁ బంచత్వంబుఁ గొందె,
వే[7]రొక్క తేరికి వెసదాఁటి కడిమి

1. క. నోడలాడభూతములు ఖ. నోలలాడిభూతములు.
2. క. లవుఁడటు బోరుచునుండె.
ఖ. లవుఁడట్లు బోరుచునుండె
3. భ్రమణచక్రంబును. క భ్రమణచక్రంబున.
4. క. ఖ. రథంబేసె
5. ఖ. కడిమి.
6. క. లక్ష్మణదేవురథము.
7. వేఱొక్కరథమెక్కి వెసదాంటికడిమి.

మీ[1]ర నావేళ సౌమిత్రి కోపించి
వివిధబాణముల నవ్వీరునికవచ
మవనిపైఁ బొడిపొడియై రాలనేసె,
కంచుకంబూడ్చిన కా[2]లాహివోలె
మిం[3]చెను బాలుండు మేమఱువెడలి
బహుళాంధకారంబుఁ బాసినబాల
మిహిరబింబమువోలె మేని తేజమున
నాసమయంబున నలమినఁ దప్పి
పాసి యాయూర్మిళాపతిమోముఁ జూచి
విన[4]యపూర్వమున నవ్వీరుఁడిట్లనియె.
''అ[5]నఘ ! వైరముమాని యాప్తుండవైతి 610
వపకారమని సేసితదియ నాకిపుడు
నుపకారమై తోఁచె నుల్లంబులోన
ధారుణీరమణ ! నాతనువున నున్న
భారంబు మా[6]న్చితి బంధుండవీవు
నలుదెఱంగుల సై[7]న్యభారంబు నీకుఁ

1. క. మీఱినవేళ సౌమిత్రికోపమున.
   ఖ మీరనావేళ సౌమిత్రికోపమున.
2. క. కాలాహిరీతి. ఖ. కాలాహిబోలె.
3. క మించినబాలుండు మెయిమరువెడలి.
   ఖ. మించునబాలకు మేనితేజములు.
4. క. వినయపూర్వకముగ నవ్వీరుఁడిట్లనియె
   ఖ. వినుమనియప్పు డవ్వీరుఁడిట్లనియె.
5. క. అపకారమునుసేసితనఘ ! నీవిపుడు.
6. క. ఖ. మాన్పితి.
7. క. సైన్యభారంబుననికి.

గలిగియున్నది ప్ర[1]తీకారంబు గాఁగ
నరసి యీభారంబు నడఁతు నాచేతి
బరు[2]వుఁజూచినఁ గదా ప్రమదంబు నీకు
నోపి[3]నతండ్రి ! నీవోర్తుగాక" నుచు
నాపినతండ్రిపై నా[4]గ్నేయశరము
భూమిజాతనయుఁడప్పుడు ప్రయోగింప
నామహాశరమున నగ్నికీలములు
ప[5]డిఁ బుట్టి దిశలు భూవలయంబు నిండ
నడరి లక్ష్మణదేవు నటు జు[6]ట్టుముట్టె,
రథముపై నిలువక రయమునఁ బంక్తి
రథసూతి వేరొక్కరథమున కరిగె.
కమనీయదివ్యా[7]స్త్రకములతో ఘోట
కములతో శకటాంగకములతో సు[8]రికి
తేరుసీరుగఁ జేసి దివ్యాస్త్రవహ్ని
నారాజవీరపై న్యాటవి నపుడు 620
యలమిఁబైకొని వడి హరులతో నరద
ము[9]లునంటియును గుంతములు నమరించి

---

1. క. ప్రతీకారంబునాకు.
2. క. బరువుఁజూచితిగాని ప్రమదంబెనీకు.
3. క. నోపినతండ్రనీ యోర్తు గాకనుచు.
4. క. నాగ్నేయబాణ.
5. పడముట్టి.
6. క. చుట్టుకొనియె.
7. క. దివ్యాంబకములతో.
8. నురకె.
9. ములు నంటి కుంతలములునమరించి.
   క. ఘులునంటి కుంతలంబ్బుల నంటగమరి.

పాటీరభూషణాంబరమాల్యములను
ఘోటకరథవీరకుంజరాంగములు
రాల్చి దివ్యాస్త్రశస్త్రముల రూ[1]పడఁచి
కాల్చి కాలానలకల్పమై కడఁగి
సైన్యంబు లాగ్నేయశర[2]మున నిట్లు
దైన్యం[3]బునొంద నంతట లక్ష్మణుండు
వారింపఁదలఁచి దుర్వారవేగమున
వారుణాస్త్రంబేయ వచ్చి యాశరము
మెఱుముల నుఱుముల మేఘజాలములఁ
దఱచువానల మహోదగ్రత మెఱసి
పరు[4]వాఱి యాగ్నేయబాణంబునడఁచి
పరువడి కుశుమీఁదఁ బర్వెఁ బర్వుటయు
నతఁడు వాయవ్యాస్త్ర మడరింప దానిఁ
బ్రతిహతంబుగఁ జేసెఁ బ్రతిలేని కడిమి
నది యక్షగం[5]ధర్వులడల భూతములు
చెదరంగ దిక్కులు చీ[6]కాకుపడఁగ
నేలయునింగియు నిండెఁ బెంధూళి
శైలంబులఁ గల నక్షత్రముల్ రాల

1. క. రూపణఁచి.
2. శలములనిట్లు.
3. దైన్యంబునొందె.
4. పరతెంచె యాగ్నేయబాణంబునడఁచి.
5. క. ఖ. గంధర్వులడర.
6. చీకాకుపడిరొ.

భయదకాలాసన్నఘాలాత్సుబాహు
జయపరిఘూవర్తజాతవాయువులు
కడ[1]చి సైన్యముల నాకసమునకెత్తె ;
కడుఁ[2]జిత్రముగ దేవగణము కీర్తింపఁ
గడిఁది వజ్రమున రె[3]క్కలు విదారింపఁ
బడని నూతనశైలపం[4]క్తులు కూడి
పురు[5]హూతుపై నెత్తిపోయెడి ననఁగఁ
గరులాకసంబునఁ గడువొప్పెఁ జూడ.
ప్రళయకాలమునాఁడు భానుబింబములు
బలసి దిక్కులనెల్లఁ బ్ర[6]భవించె ననుటఁ
దెలుపఁ బూ[7]నినయట్లు దేరులు పెక్కు
విల[8]సితప్రభలతో వినువీథి నమరె.
అలరుసూర్యుని[9] తేజు లాకారముఱకఁ
దల[10]మునఁ బ్రతిబింబితములైనపగిదిఁ

---

1. క. కడచి సైన్యంబు నాకసమునకెత్తి.
   ఖ. కడఁగు
2. కడుఁజిత్రమని దైవగణము కీర్తింప.
3. క. రెక్కలుద్రుంపఁ బడిన.
4. క. పంక్తులు నిగుడ.
5. క. పురుహూతుపై దండుపోయెనోయనఁగ.
6. క. ప్రభవించెననుచు. ఖ. ప్రభవించెననఁగ.
7. క బూనినరీతి.
8. క. విలసితభ్రమలతో.
9. ఖ. వాజులాకాశమురుక.
10. ఖ. తలంపునఁబ్రతిబింబ తతులైనపగిది.

బెక్కువన్నెలతోడ బె[1]రసి యశ్వములు
మిక్కిలి పొడవైన మింటఁజె[2]న్నొందె,
మనుజలోకముఁ జూచి మ[3]క్కువందివిరి
చను[4] సిద్ధయక్షఖేచరమూర్తులనఁగ
ధరణిపైఁ గాలూఁదఁ దర[5]ముగా కెగయు
దురు[6]వీరవరు లుబ్బి యుడువీథి మెఱసి,
కా[7]లాంతయమదండఘనసాధనముల
ధూళి దిక్కులనాఁచెఁ దూఁటులువోవఁ
గరులు దీవులు రథోత్కరములు నావ
లురుతరఛ[8]త్రంబు లుప్పొంగు నురువు
కమనీయతరలోహగ[9]దలుగ్రపన్న
గములు వాజులు జలగ్రహపరంపరలు
నల్లనై ప్రబ్బిన నాకంబు నీళ్లు
యెల్లెడఁ జెదరిన యిషువులు మీలు
బలుధూళిపటలంబు బడబాగ్నిశిఖలు
తలకొని యార్తనాదము మ్రోఁతగాఁగఁ

---

1. బెరసె నశ్వములు.
2. జెన్నొంది.
3. ఖ. మగుడంగఁదివిరి.
4 ఖ. చను యక్షసిద్ధఖేచరమూర్తు లనఁగ.
5. దరముగాకెయు.
6. ఖ. సురవీరమనుకుంభ ముడువీథికెగసె.
7. కాలాంతయమదండఘనసాధనములు.
ఖ. కాలాంతయమదండఘనసాధనములు.
8. ఖ. వజ్రంబు.
9. ఖ. గదలుసర్పములు.

"గడిమి మున్నేసె రాఘవుఁడింక నతని
కొడుకేమిసేయునో కో[1]పించి" యనుచు
లగువున మింటికి లవణార్ణవంబు
నెగసెనో! యననొప్పె నిఖిలసైన్యములు,
అని[2]లబాణముచేత నతిసాహసమునఁ
దని[3]మి సైన్యము భూమితోడనే నిలిపె
జానకీతనయుని సా[4]మర్థ్యమంత
సేనా[5]నియగు కాలజిత్తుండు చూచి
యారూఢకోపరసావేశుఁ డగుచు
ధీరుఁ[6]డా లక్ష్మణదేవుతో ననియె,
"ఏల[7]పాలార్చెద వీపిన్నపడుచుఁ
గూలనేయుదుఁ గాక కుంభినిమీఁద
నెడఁజొచ్చి నిలిపెద నీకుశావర్ణవముఁ
గడిమిమైఁ జెలియలికట్టచందమున
ల[8]వుఁడుఁ దోఁపకమున్నె లక్ష్మణా! యితని
బవరంబు లోపలఁ బడనేయువాఁడ

---

1. ఖ. కోపించియన్న.
2. అనిలబాణమునకు నతిసాయకమున.
   ఖ. అఖిలబాణము లాతఁడహిసాయకమున
3. ఖ. చనిమిసైన్యముడించెఁ దొలఁగకభువికి
4. క. ఖ. సంరంభమెల్ల.
5. జనితకోపుఁడు కాలజిత్తుండుచూచి.
6. ఖ. ధీరుఁడై.
7 యాలవార్చుచు విపిన్నపడుచు. క. యాలపలార్చె విపిన్నపడుచు
   ఖ. యాలపాలార్చెదు యీపిన్నపడుచు.
8. లవుఁడు దోఁపకయున్న లక్ష్మణా! యతని

నిత్తరి ననుజూడుమీ యంచుఁ" గాల
జిత్తుఁడప్పుడు కుశుఁ జేరనే తెంచి
పిడుగుమ్రోసినయట్ల భీమకార్ముకము
వడిమొరయింపుచు వాఁడప్పుడనియె.
"బ్రదుకంగ వలతేని బాలుఁడ! వేగ
చెదరిపొమ్మిదె చా[1]టిచెప్పెద నేను
నిక్కంబు మునిపుత్ర! నినుఁగూల్తు నాత్మ
నక్క[2]టికంబంతయైనను లేదు"
నావుండు జా[3]నకీనందనుండప్పు
డా[4]వీరవరునితో ననియె నవ్వుచునుఁ
"బాలుమాలిననీకుఁ బంకజాసనుఁడు
కా[5]లజిత్తను పేరుఁ గల్పించుటెట్లు
మి[6]న్నకపొమ్మిక మెకమెకపడక
చన్న[7]నీయడు పేరు సమకూర్చునట్లు
వట్టి[8]రజ్జులు పల్కవలదింకనిట్టి
పట్టున నీబాహుబలముఁ జూ[9]చెదను

1. క. చాటిచెప్పుచున్నాఁడ.
2. నక్కటూకంబంతయైనను లేదు.
3. క. జానకీనందనుం డపుడు. ఖ. జానకీనందుఁడు యపుడు.
4. క. నావీరవరునితో.
5. క. కాలజిత్తనుపేరు ఘటియింప నేల.
ఖ. కాలజిత్తని పేరు ఘటియింపు టెట్ల.
6. మిన్నకపో మెక మెడకంతికిపుడు.
7. క. చననియ్యండ పేరు సమకూర్చినట్లు
ఖ. చన్ననీయడి పేరు సమకూర్చునట్లు.
8. క. వట్టిరజ్జులు బలుకవలదింక నీవు. ఖ. వట్టిరజ్జులు పల్క వలదింకఁ జేత.
9. చూపెదవు

ఓరి ! నాముందట నొకముహూర్తంబు
ధీరత నిలువ మింతియు చా[1]లునిపుడు
పడుచులాడుచుఁ దృణభస్మపాయసము
లిడుభంగి నీ[2]మాట లెక్కడి? పెక్కు
జ[3]ల్పక ! విను నీకు సరియైన యట్టి
యల్పుండు నిన్ను సైన్యాధిపుఁ జేసె
నిదె నీవు చూడంగ నేఁడునాతమ్ముఁ
డదయుఁడై నీసేన నడఁచుచున్నాఁడు
కాం[4]డమే నొక్కటిఁ గడఁకఁ జేసెదను
ఖం[5]డింపు సత్వంబు గలదేనినీకు"
ననియ[6]ప్పుడేసె నో! యనిదివ్యులెల్ల
వినుతింప నాలుక వెసఁద్రెవ్వ నేసె
నటు ద్రెవ్వనేసి సేనాన్వితుండైన
కుటి[7]లాత్ముఁగని పల్కెఁ గుశుఁడు నవ్వుచును
"నిప్పుడు మానివై తే నొక్కబుద్ధిఁ
జెప్పెద నామాటఁ జేయు మూఢాత్మ !

---

1. క. చాలుననుచు.
2. క. నీమాట యెక్కడికెక్కు.
ఖ. నీమాట లెక్కడికెక్కు.
3. కల్పకనీతోడ సరియైనయట్టి.
క. ఖ. జల్పకనీతోడ సరివచ్చునట్టి.
4. క. కాండమేనొక్కటి కడఁకనేయుదును.
ఖ. కాండమొక్కటియేను కడఁకయేసెదను.
5. క. ఖ. ఖండింప
6. క. అనియప్పుడేసెను వాడివ్యులెల్ల. ఖ. ననియప్పుడేసె నోయ్యనిదివ్యులెల్ల
7. క. కుటిలాత్ముఁ గనిఁగొని కుశుఁడునవ్వుచును.

మా[1]నకయిఁకనోరి ! మౌనవ్రతంబు
పూనినాలుక నిన్నుఁ బూజ్యునిఁజేసె"
ననవుండు కోపించి యాకాలజిత్తుఁ
డనలకల్పంబైన యస్త్రంబుఁ దొడిగి
చనుదెంచి వెసనొంచి చని వామకరముఁ
గొనికాండవప్పుడా కుశుమీఁద నేసె,
అలుక లవాగ్రజుండా కాలజిత్తు
వలకేలుఁ దెగ[2]నేసి వాఁడిబాణముల
మకుటంబుతోఁ గూడ మస్తకంబేసి
(చీకాకు పడఁజేసె సేనలనెల్ల)*
నటు[3]గాలజిత్తుఁడా యవనిపైఁ బడినఁ
జటులవేగారంభసంరంభుఁడగుచు
నాజానుబాహులు నాభీలసాల
భు[4]జబలగర్వంబు భూరిరౌద్రంబు
విలసిల్ల సౌమిత్రివీరుఁడె కవిసి
బలువానతఱచుగా బాణంబు లేసె
నాబాణములు నిండె నవనియు దిశలు
నాబాలకుఁడు నొచ్చె నని సేనలార్చె
శరములు మూఁడేసి సౌమిత్రి మ[5]ఱియు

1. క. మానకయింక నీమౌనివ్రతంబు.
2. దెగనేసె.
   * ఈపంక్తిమాతృకలోనిదికాదు.
3. ఖ. అటుగాలజిత్తుఁ డయ్యవనిపైబడిన
4. భూజితరాగంబు భూరిరౌద్రంబు.
   ఖ, పూజితుగాఁగ నుపాంగరౌద్రంబు
5. ఖ. యవుడు.

బర[1]గించెఁ దోడ్తోన బాలకుమీఁద
గురుశక్తియును గదాకుంతఖడ్గములఁ
బరశుతోమరచర్మ పటు[2]సాధనముల
నేడు[3] కైదువలును నేపుమై బాలుఁ
డేడే[4]డు తునుకలై యిలఁ బడనేసి
సింహనాదము నేసి చెలఁగి యవ్వీర
సింహుండు 'నిలు' మని చేయెత్తి పలికె,
గిటికొన్న రుచులతో గృధ్రపక్షముల
గఱులతో మంటలుఁ గ్రమ్మెడువాని
ధారుణీధరపక్షదళనోగ్రవజ్ర
ధారలగతి నిశితములైన వాని
(నాదిత్య తులితంబులగువాని మర్మ
భేదులై మహిమచే నేర్చినవానిఁ
బెనుఁబాములనుఁబోలి భీకరాకృతులఁ
దనర వాల్మీకిదత్తములైనవాని)*
నైదునారసముల నతఁడు మంత్రించి
యాదిత్యకులవీరు నదర్వంటనేసె,
నదిమంటలుమియుచు నద్రులువడఁక
భువితల్లడిల్ల నంబుధులెల్లఁ గలఁగ

1. ఖ. పరగించెఁదోడనబ్బాలకుమీఁద.
2. ఖ. పటుసాయకములు.
3. నేడుకైదువలున్న యేపుమైబాలు.
4. యేడుతునియలై యిలఁబడనేసె.

* ఈపద్యములు మాతృకలోనివికావు.
ఖ. గ్రంథములోనివి.

హారిదంతములు మ్రోయ నఱ్కుండుఁ దప్ప
నఱు[1]గఁ జుక్కలురాల నందంద వచ్చి
యు[2]రవడి లక్ష్మణునురము నాటుటయు
ధరణిపై నొఱిగె నాదశరథాత్మజుఁడు,
ప్రభ దూలి యుర్విపైఁ బడియున్న దివస
విభునిచందంబున విలసిల్లె నతఁడు.
అటు మహాసేనఁ జెండాడుచు లవుఁడు
పటుతరధ్వనినార్చె బ్రహ్మాండమవియ
నదివిని కుశుఁడప్పుడార్చుచు దాఁటి
కదనరంగంబునఁ గరుఁడుండుపోలె
కదియంగఁ జని లవుంగని చుట్టియున్న
మద[3]గజేంద్రులఁ గాంచి మనుజేంద్ర! యలఁఘు
తోడనే పొడము సంతోషరోషముల
తోడ[4] నాఘునునకుఁ దోడయ్యె నెలమి
నన్నయుఁ దమ్ముఁడు నాగజభ్రముల
నన్నిటఁ దెగటార్చిరధిక వేగమున,
ధరణీశ! వాల్మీకిదత్తబాణముల
నిరవశేషంబయ్యె నిఖిలసైన్యములు
నప్పుడిద్దఱుఁ దమయాశ్రమభూమిఁ
దప్పక చూచుచుఁ దాముండిరంత.

1. నురుచుక్కలు రాల నుగ్రతవచ్చి.
2. యురువిడి.
3. ఖ. మదగజంబులఁగని మనుజేంద్ర! యతఁడు
4. ఖ. తోడనాఘునులునుఁ దోడ్తోడ నెలమి.

—: శ్రీరాముండు లక్ష్మణుని వృత్తాంతము నరసిరమ్మని దూతల నంపఁ బ్రయత్నించుట :—

భాగీరథీతీరభాగంబునందు
యాగమంటపమున నారామవిభుఁడు
వాచంయములుఁ గొల్వ వలనుండు భరతుఁ
జూచి లక్ష్మణుఁ దలంచుచు నానతిచ్చె.
"అక్కటా! సీతమ్ముఁడైన శత్రుఘ్ను
నుక్కణంచినయట్టి యుగ్రవిక్రముల
హయచోరకుల గెల్చి యన్న! సౌమిత్రి
జయమున నేలకో! చనుదేక తడసెఁ
గలలోననైన లక్ష్మణదేవుఁ గదియఁ
దలఁ[1]కునొక్కట జగత్త్రయముననైన
నొదఁగక చావక యురవడి నతని
నెదురించి నిలువంగ నేగ[2]ర్వినేర్చు?
వెఱవక పెక్కండ్రు వీరులతోడ
మెఱసికోపంబున మీ[3]రు లక్ష్మణునిఁ
గనుఁగొని యోతండ్రి! కావవే యనుచు
మనుబుద్ధి శి[4]శువులు మానిరో! పోరఁ
గాకున్నఁబోరాడి కడచిరో! నిలువ

1 దలఁకుమొక్కట జగత్త్రియముననైన.
క. దలఁకునొక్కట జగత్త్రియమునంబోలి
ఖ. దలఁతునొక్కట జగత్త్రియముననైన.
2. క. నేగర్వియోర్చు. ఖ. నేగర్వియొప్పు.
3. క. ఖ. మీరిలక్ష్మణుని
4. ఖ. కుశలవుల్.

లేక[1]మైమఱచి త్రెళ్లిరో భూ[2]మిమీఁదఁ
దనలావుమైఁ బోరి ధరఁగూలి యున్న
యనుజునిఁ దెచ్చునో! యతఁడమ్మకడకుఁ
గడునుగ్రుఁడైన లక్ష్మణుఁ జూచి మి[3]గుల
వడఁకుచు "వీ[4]రెంతవారు నీకెదురఁ
గడుఁదప్పు సేసినకార్యఘాతకుల
విడువవే చంపక వీరాగ్రగణ్య!"
అని బాలకులతల్లి యర్థిఁ బ్రార్థింప
విని లక్ష్మణుఁడు వారి విడిచెనో! కాక
తెలఁ[5]గేమి యాగంబు దినములు మూఁడు
కొఱఁతయై యున్నది కొదవడునొక్కొ!
చని[6]రకో! బాలురు శత్రుఘ్నుఁ బట్టి
కొ[7]ని యెచ్చటికినైనఁ గుటిలభావమున
నరవ[8]రసుతుఁడైన నన్నుఁ గైకొనక
యా[9]రుణతనూజుని నటఁ బొలుగొనక

1. ఖ. లేకమైమఱచిరో నీల్గిరో ధరను
2. క. భువిమీఁద.
3. క. ఖ. మగుడ.
4. క. నీయెంతవారు నీయెదుర. ఖ. వీరెంతవారు నీయెదుర.
5. క. ఖ. తెలఁగేది.
6. క. చనిరకో బాలు రాశత్రుఘ్నుఁబట్టి
7. క. కొని యెచటికినైన
8. క. ఖ. నరలోకసుతుఁడైన.
9. యరుణతనూజుని నకపాయిగొనక.
ఖ. యరుణతనూజుని యడఁబాయగొనక.

యా[1]విభీషణు మెచ్చకంగదు మహిమ
భావించి యాత్మలోఁ బా[2]టిగాఁ గొనక
యక్కటా! ఘనుఁడైన హ[3]నుమంతునైన
లెక్క[4]సేయక మారులేని లక్ష్మణుని
సర[5]కుసేయక నినుఁ జండవిక్రమునిఁ
జి[6]రయశోధామునిఁ జీరికిఁ గొనక
పడుచులు తురగంబుఁ బట్టిరి కంటె
విడి[7]పింప నింకేమి వెరవకో! మనకుఁ
బనుపుము సౌమిత్రిపాటిల్లఁ దెలియ
జ[8]నమనోభిజ్ఞుల సందేశహరులఁ
దురగంబు తెలుఁగు శత్రుఘ్నునిపోక
పరమసాహసులైన బాలురవిధము

1. క. యావిభీషణుని యామేలెయంగదుని.
ఖ యావిభీషణు యెంచకంగదు మహిమ.
2. క. పాయకనీవు.
3. హనుమంతులైన.
4 లెక్కసేయకమారు లెన్నిలక్ష్మణుని.
క. లెక్కసేయకమారులేని యబ్బలము.
ఖ. లెక్కసేయక మారులేని నీలునిని.
5. సరకుసేయక నిను చండవిక్రముని.
క. సరకుసేయక నిన్ను చండవిక్రముఁడ!
6. ఖ. జిరయశోధారుని
7. ఖ విడిపింప మనకేది వెరవకోయనుచు.
8. జనమనోభిజ్ఞయు సందేశనమున.
క. జనమనోభిజులు సందీప్తవరులు.
ఖ. జనమనోభిన్నులసందేశధరుల,

నేమియు విన[1]బడ దెట్లొనో ! కాని
నామది కలంగెడు నరనాథపుత్ర !'
నా[2]వుండు భరతుఁడు న్నతబుద్ధిపరుల
నేవు[3]ర రప్పించె నినవంశుకడకు
నప్పుడాదూతలకనియె భూపాలుఁ
"డిప్పుడు మీరెటేఁగి యె[4]ల్ల యత్నములఁ
జని యవశ్యంబు మా సౌమిత్రితోడ
వినుపింపఁదగు నెల్ల విధములమీరు
మోహనాస్త్రములచే మోహితులైన
నాహ[6]వంబున సుప్తులై యున్నవైన
శిశువులఁ జంపక చేఁగావవలయు
దశరథాత్మజ ! వారితప్పులు మఱచి
బలవంతులగు వీర[7]భటులెల్ల నపుడు
కొలువ[8]నెల్లడలఁ బేర్కొన వన్నెకెక్క

1. క. వినబడదెట్లకో కాక.
2. ఖ. నావుండు భరతుఁడున్నత బలాధిపుల.
3 క. నేవురరప్పించి ఖ వేవురరప్పించె.
4. ఖ. యిన్నియత్నముల
5. నెన్ని.
6 నాహవంబున సుఖులైయున్నవైన.
క. ఆహవంబున సుప్తులై వున్న నైన.
ఖ. ఆహవంబున సుఖులైయున్నయట్టి.
7. క. వీరభటులలో నీవు.
8. గొలువనెల్లందు బేర్కొనవన్నెకెక్క.
క. కొలువంగవీడ్కొని యెక్కుడువేడ్కతోడ.
ఖ. కొలువనెల్లెడలఁ బేర్కొన వన్నెకెక్క.

యతి[1]రథోత్తముఁడవై యాజులఁ దేరి
చతురుండవగు నయశాలివి నీవు
గతిలేని పడుచులఁ గటకటా ! నాకుఁ
బ్ర[2]తియె చంపఁగనని పరికించి కాఁచి
వన[3]జాప్తకులవీర ! వారినాకడకుఁ
గొనిరమ్ము నీదయాగుణము సొంపారఁ 730
బ[4]రులచేఁ గడుఁబరాభవముఁ బొందియునుఁ
గరుణార్ద్రచిత్తులై కలఁగరెవ్వారు
వారుగదా పుణ్యవర్తనులనఁగ
ధారుణిపైఁ గీర్తిఁ దన[5]రెడువారు
బాలురు సీతరూ[6]పంబుల నన్నుఁ
బోలెడువారని పొందుగావింటి
వారి నెమ్మోములు వైదేహిముఖము
నారయ నొకచందమని రెల్లచ[7]రులు
(బాలకులేమైనఁ బలికిన మీరు
చాలమన్నన జేసి సంప్రీతితోడఁ)*

---

1. క. అతివిరోత్తముఁగైన యావాలిసుతుఁడు
ఖ. అతరథోత్తముఁడవై యాజులందతిని.
2 బ్రతియెచెప్పంగనని పరికించికాఁచి.
ఖ ప్రతియుచప్పక కని పరికించికాఁచి.
3. ఖ. వనజాప్తకులచంద్ర !
4. ఖ. పరువడి వారిపైఁ బటుకటాక్షమును.
5. దనరెడువారు.
6. క. రూపంబులనుండ
7. క జనులు.
* ఈపద్యము మాతృకలోనిదిదికాదు, ఖ. గ్రంథములోనిది.

ద[1]ప్పక మీతల్లిదండ్రు లెవ్వారు ?
చె[2]ప్పుఁడీయడవులఁ జివుకంగ నేల ?
మీనామమెయ్యది ? మీతల్లి యెచటఁ ?
దా[3]నుండు వినుపింపఁదగు నాకు ననుచు
నల్లన[4] వారల నడిగి వృత్తాంత
మెల్ల[5]ను నరసి నీవిటకుఁ దోడ్తెమ్ము"
అని చెప్పుఁడని రాముఁడాత్మదూతలకు
వినఁగఁ జెప్పుచునున్న వేళఁ జిత్రముగ

—. సౌమిత్రి పరాభవము నెఱిఁగి శ్రీరాముఁడు భరతుని సమరమునకుఁ బంపుట, అతిసంరంభమున భరతుఁడు సమరమునకుఁ గదలుట —

ననఘ! నెత్తుటఁదోఁగి హారామ! రామ!
యనుచు మోమున దైన్యమధికమై తోఁప
సౌమి[6]త్రియోధులు చనుదెంచి మ్రొక్కి
"రామ! భయార్తుల రక్షింపు మమ్ము
ఘనసైన్యములతోడఁ గదలి లక్ష్మణుఁడు
చని మూర్ఛనట్లున్న శత్రుఘ్నుఁ గాంచి

1 క. తప్పక మీ తల్లిదండ్రి యెవ్వారు. ఖ తప్పకయు మగుడీ దయతోడయేమి
2. క చెప్పుడీ యడవిలో చివుకంగ నేల
ఖ. చెప్పుడీయడవిలో చివుకంగ నేమి.
3 క. తగు గాకయునిన. ఖ. దనరు దనసుచు
4. ఖ నల్ల జనంబుల
5. మెల్లన నరసిమీరిటకుఁ దోడ్తెండు. ఖ మెల్లన నరసి నీవిటకుఁ దోడ్తెమ్ము
6 క సౌమిత్రిబంట్లును జనుదెంచి మ్రొక్కి
ఖ. సౌమిత్రిభృత్యులు చనుదెంచి యపుడు.

యలు[1]కయుఁ గోపంబు నడర నాకుశునిఁ
దల[2]పడి యతనితోఁ దడవు పోరాడె
నప్పుడస్త్రములు నీయనుజుపైఁ గుశుఁడు
కప్పె[3] మేఘముభంగిఁ గడఁకతో నతఁడు
పీతాంబరుఁడు తనపిన్ననాఁ డలుకఁ
బూతనాదులనెల్లఁ బొరిఁగొన్నయట్లు
జతురంగబలము నాశ్చర్యముగాఁగ
నతఁ[4]డొక్కఁడనిఁ గూల్చె నతిబాలుఁడయ్యుఁ
గడిమిమై లక్ష్మణకాలజిత్తులనుఁ
బడనేసె నక్షీణబాణజాలముల
సౌమి[5]త్రులిద్దరు జగతిపైఁబడిన
నేము[6]వచ్చితిమి నీకిది యెఱింగింపఁ
జనుము నీవచటికి సైన్యంబుతోడ
ఘనుఁ[7]డ! నీసేసెడిక్రతువేల? యిపుడు
కుశుఁడను ప్రళయాంతకుఁడు రాకమున్నె
దశరథాత్మజ! నీవు త[8]గఁబొమ్ము లెమ్ము",

1 క యలుకయు శోకంబు నడర నాకుశుని.
ఖ. యలుకయు రోషాగ్ని యలమి నాకుశుని
2. క. తలపడి యనిలోనఁ దడవు గాఁబోరి.
ఖ తలకొని యనిలోన దడవుగాఁబోరి
3. గప్పెదెవుర గొండకరణిగావించి.
4. ఖ. నతులితంబుగఁ గూల్చె.
5. ఖ. నా మహాత్మునిచేత నందఱుపడిన.
6. ఖ మేమువచ్చితిమి మీకిది యెఱిఁగింప.
7. ఖ. ఘనుఁడ! నీచేసెడి క్రతువేటి దిప్పుడు
8. ఖ. తగఁబోవలెమ్ము.

అని[1]న యోధులమాట లన్నియుఁ దెలియ
వినియప్పు డురుశోకవిపధిలో మునిఁగి
ధర[2]ణీశ్వరుఁడు మూర్ఛఁ దనమేను మఱచి
భర[3]తుని యెదుటనే పడియె భూస్థలిని,
పడిన నొయ్యన నెత్తి భరతుఁడందంద
త[4]డిపె శీతలవారిఁ దనువుఁ గన్నులను
సకలేశుఁ డారామచంద్రుండు మూర్ఛ
నొకకొంత ప్రొద్దున కొయ్యనఁ దెలిసి
తమ్ము[5]లఁ దలఁచి నేత్రములఁ గన్నీరు
గ్ర[6]మ్మ నిట్లనియేడ్చెఁ గడఁగి రాఘవుఁడు
(నొక్కట యెలుగెత్తి "యోమహావీర!
యె[7]క్కడి మరణంబు యొలసె నీకిపుడు)*
హా నిత్యవిక్రమ! హా నిర్మలాత్మ!
హా నీకు నిటువంటి హాని వాటిల్లె
నే[8]నేమి చెప్పిన నెదురాడ కెందుఁ

1. ఖ. అనిన యార్తులమాటలన్నియు.
2. ధరణీశుఁడును తనమేనును మఱచి
3. భరతుని యెదురునఁ బడియె. ఖ భరతుని యెదురనే పడియె.
4. క. తడిపి శీతలవారిఁదనువుఁ గ్రమ్మఁగను.
5 ఖ. తమ్మునిఁదలఁచి.
6. గ్రమ్మనిట్లనియె నొక్కట యెలుగెత్తి.
   * ఈ పద్యము మాతృకలోనిదికాదు. ఖ. గ్రంథములోనిది.
7. యెక్కడి మరణంబు యెనగూడెనీకు
8. క. నేనేమిచెప్పిన నెదురాడ వెందు. ఖ. యేమెందువచ్చిన నెదురాడవీవు.

బూ[1]ని సేసెడి నిన్నుఁ బోనాడుకొంటిఁ
దండ్రి! నన్నరసితి దయతోడఁ దల్లి
దండ్రుల మఱ[2]పించి దండకాటవుల
నీవు నన్నాహారనిద్రలుఁ బా[3]సి
యా[4]వేళఁ గొలిచితి వాసాహసమున
నను[5]రాగ మొనరించుటదియె కాదిపుడు
మన[6]మున నారనిమంటఁ గల్పించె
నా[7]మేఘనాధుఁ డట్లాజిరంగమున
నీమ[8]హాస్త్రంబుల నేలపైఁగూలె
నట్టినీవల్పుండవై యొక్కతపసి
పట్టిచే నారడిపడితివే య[9]నఘ!
యొ[10]క్కడి యీయాగ మొక్కడి దీక్ష
య[11]క్కటా! సౌమిత్రులటు గూలియుండ

---

1. ప్రూనిసేయుదు నిన్ను పోనాడుకొంటి.
క. ప్రూనిచేసితి నిన్ను పోనాడుకొంటి.
2 మఱపించె
3. ఖ. మాని.
4 యావేళఁగొలిచితి వాసాహసంబు.
5. క. అనురాగమునఁ బొందెనది నాకనిపుడు
ఖ. అనురాగ మొదలించునదియె నేఁడిపుడు
6. క. వరమున నాతనిమంటఁ గల్పించె. ఖ. మనమున నేరనిమంటఁ గల్పించె.
7. క. ఆమెఘనాథుని నాజిరంగమున ఖ. ఆమేఘనాథు బిట్టాజిరంగమున
8. క. నీమహాస్త్రంబుల నేలపైఁగూల్చి ఖ. నీమహాస్త్రములచే నేలపైఁగూలె.
9. ఖ. తండ్రి!
10 క యొక్కడియాగంబు యొక్కడిదీక్ష
11. క. అక్కడ సౌమిత్రి యటఁ గూలియుండ.
ఖ. అక్కట సౌమిత్రియటు గూలియుండ.

నీచోట నేగతి నెట్లున్నవారో
య[1]చ్చోటి కేఁగెద ననుమానమేల ?
తమ్ముఁడ ! నా[2]కిమ్ము ధనువున స్త్రములుఁ
దెమ్మన్న భరతుండు ధీరుఁడై పలికె.
"జగదేకవీరుని సౌమిత్రిఁ గ[3]దిసి
జగతిపైఁ గూల్పంగఁజాలునే యొకఁడు
తుదలేని భయమున దూ[4]తలాచంద
మిది[5]యదియని నిక్కమెఱుఁగ రేమియును
ధాత్రీశ ! యా[6]పుణ్యధనులకు మోహ
మాత్ర[7]ముఁ లేదన్న మరణమెక్కడిది ?
అ[8]ది సర్వమును నిజంబరయ నచ్చటికి
నిదె[9] పోవుచున్నాఁడ నేను నీయాజ్ఞఁ
బగవా[10]రినిద్దఱ బంధించి రథము
నాగలపై నిడుకొని యు[11]రుశక్తి మెఱయ
ననుజులతోఁ గూడనరుదెంతు నిపుడు

1. యచ్చటికేఁగద
2. క. ఖ. నాకింక.
3. ఖ. గదియ
4. క. దూతలీభంగి ఖ. దూతలీచంద
5. క. మిదినిక్కమని కార్య మెఱుఁగ రేమియును
6 ఖ. యీపుణ్యధనులకు.
7. క. నాస్త్రంబులేదన్న
8. క. అదియు సర్వము.
9. క. ఖ. యిదెపోవుచున్నాడ యేనుమీయాజ్ఞ.
10. బగవారినందఱ.
11. నుతశక్తి మెఱయ.

మను[1]జేంద్ర! నీమది మఱుఁగంగనేల?"
అన[2]విని రఘురాముఁ డావాక్యములకుఁ
దనలోన మెచ్చి యాతనితోడ ననియె.
"తమ్ముఁడ! నీకూర్చు త[3]మ్ములచోట
నెమ్మ[4]యి నున్నారొ యేఁగుమచ్చటికి
దుర[5]మునకిదె నీకుఁ దోడుగావచ్చు
నరి[6]లోకభీకరమగు వీరబలము
ఘనశత్రుగర్వాంధకారప్రచండ
వనజాతమిత్రుండు వాలిపుత్రుండు
పర[7]మసాహసవైరిపటలజీమూత
హార[8]ణజగత్ప్రాణుఁడగు సుషేణుండు
అక్షీణబలజితాహంకారవీర
యక్షుదై తేయుఁ డాయాంజనేయుండు
భీకరాహితగోత్రభేదనాదిత్య
లోకనాయకుఁడు భల్లూకనాయకుఁడు

---

1. క. మనుజేంద్ర! నీమది అడఁలంగవలదు
ఖ. మనుజేంద్ర! శమమందు మఱుఁగంగనేల.
2. ఖ. అనవుండు రఘురాముఁ డావాక్యములకు
3. క. తమ్ములెచ్చోట ఖ. తమ్ముఁడెచ్చోట.
4. ఖ. ఉమ్ముల నున్నారొ యరుగుమచ్చటికి.
5. క. దురమున నీకిదె. ఖ దురమున నిదెనీకు.
6. క. నరలోకభీషణమగు వీరబలము. ఖ. నరిలోకభీషణమగువీరబలము.
7. ఖ. పరమసాహస వీరపటలజీమూత.
8. హారణ జగత్ప్రాణుఁడగు సుశేషుండు.
ఖ. హారణజగత్ప్రాణుండునగు సుషేణుండు.

నీ[1]వీరవరులతో నిప్పుడే కదలి
వే[2]వేగ నేఁగుము వీరాగ్రగణ్య!
పలికిన మనతండ్రిపలుకు రక్షింపఁ
దలఁచి నేఁబోయితి దండకాటవికి
నన[3]ఘుండ! నాయాజ్ఞ నరిగి సోదరుల
బలముతో ను[4]ద్ధరింపఁగ వేళనీకు"
ననవుండు భరతేశుఁడౌఁగాక యనుచు
జననాథునకు మ్రొక్కి సద్భక్తితోడ
శరచాపఖడ్గాదిసకలాయుధముల
ధరియించి రోషాగ్నిఁ దమకంబుఁ బెనుపఁ
దేరెక్కి రణకళాధీరుఁడై ప్లవగ
వీరులు పెక్కండ్రు వేడ్కతోఁ గొలువ
దానవాకృతులు నుద్దండభల్లూక
సేనాధిపతులునుఁ జేరి తోనడువ
విమ[5]లాక్ష! యాశుగావృతరథావళులు
కమలాప్తమూర్తులగతి నొప్పి నడువ
ఖరమహోదరకుంభకర్ణవిస్ఫూర్తిఁ
గరులు రావణసేనకై వడి నడువ
నావ[6]ర్తకాలశంకాభీలహరులు

1. యీవీరవరులతో నిప్పుడు గదలి
2. క. వేవేగనరుగుము, ఖ వేవేగనరుగుమీ
3. క. ననఘుండ! నాయాజ్ఞ యాదరి సోదరుఁడ!
4. నుద్ధరింపఁగ నీకువేళ. క. నుద్ధరింపఁగవేళ యిపుడు
5. ఖ. విమలాక్ష యాశుగాన్వితరథాంగములు.
6. ఆవర్తకాండశంఖాభీలహరులు.

భావింప జలధుల పరుసున నడుప
గైరికవరరత్నక[1]టకవైచిత్ర
వీరులు కొండలవిధమున నడువ
జననాయకుఁడు సుదర్శనపాంచజన్య
వినుతుఁడై హరిమూర్తివిధమున నడువ
నాసమయంబున నాకాశగంగ
నాసరస్వతిఁ జేసె నవనీరజంబు
నలిరేఁ[2]గి యాశాంగలను నొక్కమఱియుఁ
బలి[3]కించె భేరుల భాంకారరవము
పసఁదప్పి సేనల భరియింపలేక
దెసలకెల్లను నోరుఁ దెఱచుచందమున
వారక ధరయెల్ల వ్రయ్యలువారె
ధారు[4]ణీశ్వర! యిట్లు దళములతోడ
నతఁడు గంగాతీరమప్పుడు కదిసి
మతిమంతుఁడగు హనుమంతున కనిరె.

— భరతుని యాజ్ఞప్రకారము హనుమంతుఁడు లక్ష్మణశత్రుఘ్నులఁ దెచ్చుట —

"వచ్చిన యీవీరసైన్యంబులోనఁ
జొచ్చి సర్వంబును శోధించి యందు

1. ఖ. కటికవైచిత్ర.
2. ఖ నలిరేఁగి యాసేనలను నొక్కమరియు.
3. బరికించి భేరుల భాంకారరవము.
4. ఖ ధారుణీనాయక.

దుర[1]ములోఁ బడిన శత్రుఘ్నులక్ష్మణులఁ
బరికించి యశ్వంబుభంగియు నరసి
ర[2]మ్మ'' నీవనవుండు రాజేంద్ర! యతఁడు
గ్రమ్మ[3]న నేఁగి గంగానది దాఁటి
ప్రతిపక్షపాలితప్రతిమానసకల
చతురంగమైయున్న జ[4]న్నరంగమున
జానకివడుపాటుఁ జర్చించి వగల
నూనిన భూదేవి కురుభక్తి మ్రొక్కి
దే[5]వి! నీమది రామదేవుపైఁ గింక
భావింపవలదని ప్రా[6]ర్థించునట్లు
ఘనకుశాంబకములఁ గలయంగనాటి
యనిలోనఁ బడియున్న య[7]ధిపులఁగాంచి
తన[8]భుజబలమునఁ దడయక యెత్తి
కొనివచ్చె నాకైకకొడుకున్నకడకు.
అప్పుడు భరతేశుఁ డాకుశాస్త్రములఁ
గప్పి మూర్ఛిల్లిన ఘను[9]ల నిద్దఱను

---

1. ధరమీఁదఁ బడిన శత్రుఘ్న లక్ష్మణుల.
2. రమ్మనీ వనవుండు రాజేంద్ర! యనుచు.
3. యతఁడు గ్రక్కునను గంగానదిదాఁటి
4. క. సమరరంగమున.
5. ఖ. దేవి! నీపతిరామదేవుపైకింక.
6. ప్రార్థించినట్లు.
7. క. యావీరవరుల.
8. క. తనభుజబలిమిని తడయకయెత్తి
9. క. ఖ. ఘనులనిద్దఱిని.

జనవందితుల రాజ[1]చంద్రుని కూర్మి
యనుజులఁ దేరి[2]పై నల్లన నిడుచు
నందంద మదిలోన నడరి సమీర
నందనుతో రాజనందనుండనియె.
"శత్రుఘ్ను లక్ష్మణుఁ జంపి యీరామ
ధాత్రీశుబలములఁ దఱిమి చెండాడి
యే[3]చోట నున్నారొ యీకుమారకులు
చూచితే పవనజ! సోద్యమీ తెఱఁగు
ధా[4]రుణి శిశువవతారులై సమర
శూరులై వర్తించు సురలొ! కిన్నరులొ!
కాక సిద్ధాదులో! గంధర్వవరులొ!
నాకు మానవులన్న నమ్మికగాదు"
అని[5]న సమీరణి యధిపుతో ననియె.
"మను[6]కులాధీశ్వర! మనలక్ష్మణుండు
పడు[7]చులచే మూర్ఛఁబడినచందమునఁ
బడడింద్రజిత్తుని పటుసాయకముల"
నని వెఱఁగందుచు నవనీశుతోడ

1. క. రాజచంద్రుఁ గూర్మి
2. క. తేరుపైనల్లనం బెట్టి, ఖ. తేరిపైనల్లనఁ బెట్టె.
3. యచ్చోట నున్నారొ యాకుమారకుల
క. ఖ. యెచ్చోట నున్నారొ యీకుమారకుల.
4. క. ఖ. ధారుణి శిశువేషధారులై సమర.
5. అనిన సమీరనుండధిపుతో ననియె
6. మనుకులాధీశుఁడు మనలక్ష్మణుండు.
7. పడుచుచేమూర్ఛిల్లి పడిన చందమున.

ననిలసూనుఁడు వల్కె, నా సేనలోన
ఘనసింహనాదముల్ కడు శంఖములును
మొనసి యద్భుతముగా మ్రోసె నంతయును.

—: కుశుఁడు భరతసైన్యముల మూర్ఛిల్లఁజేయుట ;
భరతపరాభవము :—

దీపితాటోపంబు దివ్యచాపంబుఁ
గోపంబుఁ దోఁపంగఁ గుశుఁడేఁగుదెంచె,
పటుచర్మవరఖడ్గపాణియై లవుఁడు
పటపట గుండెలు పగలనార్చుచును
దిక్కులు నేలయుఁ ది[1]విరి నిప్పుకలుఁ
గ్రక్కువాలమ్ములఁ గప్పుచు వచ్చె.
'పెంపేది కుశుఁడు కోపించి తండ్రులనుఁ
జంపెఁ జంపెడినిదె చంపుచున్నాఁడు
య[2]రసి వారణ సేయవైతేని యతని
గురుఁడైన నినుఁబొందు గురుహత్యఫలము'
యని మునీంద్రుని దూఱ నహిలోకమునకుఁ
జని[3]నక్కై వడిఁ గ్రుంకె జలజాప్తుఁడంత.
చటులాంధకారంబు చ[4]దల భూరేణు
పటలంబునకుఁ దోడుపడియె నెం[5]తయును

1. క. దివిరి నిప్పులును. ఖ. దివియు నిప్పుకలు.
2. క. అరసి నివారింపవైతివే యతని.
3. ఖ. జనియెనో యనఁ గ్రుంకె.
4. పడలభూరేణు. క. చెదలభూరేణు.
5. క. నంతటను.

క్షితినాథ ! యప్పుడా సేన[1]లు భ్రమసి
యిత[2]రులఁ దమ్మును నెఱుఁగంగలేక
పలు[3]మాఱుఁ గౌశికప్లవభీతిఁ బొంది
పులుఁగులు నడురేయిఁ బో[4]రలుచందమున
నొఱలియుఁ బడియు నొండొరులఁ బిల్చియునుఁ
దెఱలియు మఱలియుఁ దిరుగుడుపడియు
నత్తరి రౌతుల నవనిపైఁ గో[5]డపి
యు[6]త్తమాశ్వంబులు నుఱుకంగఁదొడఁగె,
రథి[7]కుల సూతుల రయమునఁ గూల్చి
రథ[8]ముల వడిగొన రణవీథిఁ బఱపి
కడువేగమునఁ దమకంబులు జాఱి
పడు[9]నట్లుగాఁ బాఱె భద్రనాగములు,
నా[10]యోధనంబున నవని కంపింప
నాయుధంబుల వైచి య[11]రిగిరి భటులు,

1. సేనలభ్రమసి
2. క. యితరులఁ దమ్ముల.
3. క. పలుమాఱు కౌశికోపాప్లవభీతి
4. క. వొరలు చందమున.
5 గడపి.
6 క ఖ. యుత్తమాశ్వములు పెల్లుఱుకంగఁ దొడఁగె.
7. రథికుల సూతుల రయమునఁ గూల్చె,
ఖ. రథికులు సూతులు రయమునఁ గూల.
8. రథములు వడిగొన రణవీథిఁబరపె.
9. క. పడినట్లుగా.
10. క. నాయోధనంబుల.
11. ఖ. యరిగెడి భటులు.

పొగలేని శిఖి వట్టిపాదలపైఁ గవియు
పగిది నాలవుఁడంత బల[1]ముపైఁ గవిసి
తుం[2]డంబులుగ గజతుండంబు లవని
మం[3]డలంబున రాల్చు మహితకాండముల
శతములు వేలు లక్షలు భ[4]ద్రకరులు
ధృ[5]తిమీరి జిరజిరఁ దిరుగంగసేయు,
కొన్నిటి క్రకచాదిఘోరాయుధముల
ఛి[6]న్నభిన్నములుగాఁ జేయు నంగముల,
(నెఱియ భల్లములఁ గొన్నింటికుంభములఁ)*
దెఱచి ముత్తియముల ది[7]శలఁ బోఁజల్లు,
మఱియుఁ గొన్నిటి చం[8]డమండలాగ్రమున
మెఱుఁ[9]గు దంతంబులు మెఱసి నుగ్గాడు

1. బలములఁ గదిసి.
2. ఖ. తుండంబులును గజతుండంబులవని.
3. క మండలంబునిండి మహితకాండములు
   ఖ. మండలంబులురాల్చు మహితకాండముల
4. క. భద్రకములు.
5. క. దుత్తిర్ల జిరజిరతిరుగు నేనుగులు.
   ఖ. ధృతిదూరి జరజర
6. భిన్నభిన్నముఁ జేయు నంగముల.
   క. భిన్నభిన్నఁ జేయు భీకరాస్త్రముల
   ఖ. భిన్నభిన్నము సేయు బెరయునంగములు.
   * ఈ పంక్తి మాతృకలోనిది కాదు. ఖ. గ్రంథములోనిది.
7 ఖ. దెసలఁబోఁజల్లు.
8. క. చండమండలాగ్రములు, ఖ. చండమండలాగ్రముల
9. క. మెఱయుదంతంబులు మెఱసినుగ్గాడి.
   ఖ. మెఱయుదంతంబులు మెఱసినుగ్గాడు.

నా[1]ఘాతముల మంటలందంద పొడమ
రాఘవు నురుబలారణ్యంబుఁ బొదివి
సమ[2]సిన ఘనదివ్యశస్త్రఖడ్గములు
సమిధలుగాఁగ మాంసంబులు మేసి
క్రోలుచునాడు గృధ్రముల పక్షములు
తాలవృంతములుగాఁ దఱి[3]గొని వెలుఁగఁ
బొదలి యందంద యద్భుతముగాఁ గాల్చె,
మె[4]దలెడు నృపులెల్ల మిడుతలై పడిరి.
అశనికల్పములైన యమ్ములుఁ దొడిగి
కు[5]శుఁడేసెఁ బీనుఁగుగుంపులు గాఁగఁ
జటులనూపురచారుచ[6]రణాఖండములు
ఘటి[7]తాంగదాయతకరభాగములును
మణికుండలాంచితమస్తకంబులును
గణనమీఱిన హస్తికరభంగములునుఁ
బొడలేక సంగర భూమిపై దొరుఁగ
న[8]డరిపై పై నేసె నధిక బాణముల

1. నాఘాతముల మంటలందంద పొడమి.
ఖ. నాఘాతమున మంటలందంద పొడమి.
2. క. సమసిన బహుబాణశస్త్రఖండములు.
3. దఱిగొని యుఱక.
4. క. ఖ. మెదలెడి.
5. క. ఖ. కుశుఁడేసెఁ బీనుగకుప్పలుగాఁగ
6. చరణకాండములు.
7. క. ఘటితాంగదాయకకరభంగములను
ఖ. ఘటితాంగదాయక కరబాణములును
8. క. నవనిపైఁబ్రడ్డనేసి రధిక బాణములు

క్షో[1]ణీరుహాంబులఁ జూచి కుఠార
పా[2]ణి కొమ్మలతోడఁ బడఁగొట్టుభంగిఁ
గ[3]డఁగి వీరులనెల్లఁ గాళ్లనుఁద్రెవ్వఁ
బడనేసె నతిఘోరబల[4]ముల నంత
హా[5]హారవంబులు నతని యార్పులునుఁ
గా[6]హాళభేరినికాయనాదములు
దండి[7]వీరోగ్రభేతాళాదిహాస
చండఘోషణములు జగమెల్లనిండె,
పొగడుచు సురకోటి పువ్వులవానఁ
దగునని జానకీతనయులమీఁదఁ
గురియించి బహుజయఘో[8]షంబు లిచ్చె
సురదుందుభులు మ్రోసె సొరిదిమై మింటఁ
గుళ[9]వీరకోదండగుణనినాదంబు
దశదిశభరితమై తనరె నెంతయునుఁ
గడుభీతి నెత్తురుఁ గ్ర[10]క్కుచుఁ జెవుడు
పడియె దిగ్గజములు భ్రమసె భూతములు

1. క. క్షోణిరవంబులు ఖ. శోణితకవముల,
2 క. పాణికొమ్మలతోడఁ బడఁగొట్టినట్లు
3. ఖ. కడిది వీరులనెల్లఁ గాళ్లు ద్రెవ్వగను.
4. ఫల్ల జాలముల
5. ఖ. హాహారవంబులున్నతి యారుపులను.
6. కాహళభేరి తమ్మటనాదములును.
7. క. ఖ. దండివీరోగ్రభేతాళాట్టహాస.
8. క. ఘోషంబు లెసఁగ
9. క. ఖ. కుళవీరు.
10. ఖ. గ్రక్కుచునుండు.

నుర[1]లెఁ జుక్కలు మింట నురగవల్లభుఁడు
తెరలెఁ గ[2]చ్ఛపకులాధిపుఁడు లెక్కనంత
రాజు[3]నుఁ బూర్వాపరజ్ఞుండునైన
రాజునకెంతయు రక్షింపఁగలదు
కొడుకులఁ దండ్రుల ఘోరాజివలన
నుడిగింతునని వచ్చి యుడిగింపలేక
ము[4]నుఁగుచు మంజిష్టిమునుఁగుఁదాఁ దిగిచి
కొనియెనో! కాక యీగుణనిధి యనఁగ
ను[5]దయించిబలముతో నుడువీధి నిలిచి
వదలక పోరాడువారలఁ జూచి
జగతి నానావర్ణసముపేతమగుచు
నెగసిన రజములో హిమరోచి యణఁగె.
పని[6]వడి యప్పుడాపంక్తిముఖారి
తనయులీరీతి నుద్దండతఁ జూప
భరతుఁడప్పుడు సేనపాటెల్లఁ జూచి
దొరలతో దైన్యంబుతోడ నిట్లనియె.

---

1. ఉరికెజుక్కలు మింట నురగవల్లభుఁడు
2. క. గచ్ఛపకులాధిపుఁ డులికెనంత.
   ఖ. గచ్ఛపకులాధిపుఁడును వణఁకె.
3. క. రాజులు పూర్వపరజ్ఞులైనట్టి
   ఖ. రాజునుఁ బూర్వపరజ్ఞుండునైన.
4. ఖ. మునుఁగుచు మంజిష్టిమునుఁగురాఁ దిగిచి.
5. ఖ. నుదయించె.
6. ఖ. పనిగొని

"యము[1]లు నాలయకాల యమునిచందమున
సమ[2]యింపఁ దొడఁగిరి సైన్యంబునెల్ల
నక్క[3]టా ! యీసేన కాపదవచ్చె
నొక్క[4]భంగిగ నేను నొడలెత్తి చూడ"
ననుచుఁ జిం[5]తాక్రాంతుఁడైన నాలోన
హనుమంతుఁడనియె న[6]య్యవనీశుతోడ
" పరికించి చూచితే భర[7]తేశ ! వీరి
శర[8]లాఘవంబునుఁ జటులవేగమును
నాకృ[9]తి మైచాయ నలువునుఁ జూడు
మీ[10]కుమారులు రాఘవేంద్రసన్నిభులు
అది కారణంబుగా నఖిలసైన్యముల
గుదిగొన రణములోఁ గూల్చిరీభంగిఁ

---

1. యమ్ముల తలయ కాలయము చందమున.
ఖ. యమమృత్యువులఁ బోలె యిరువురుతోఁషరి.
2. సమయించి దొడఁగిరి సైన్యంబులెల్ల.
ఖ. సమయింపఁ దొడఁగిరి సైన్యంబులెల్ల
క సమయింపఁ దొడఁగిరి మనసైన్యంబులెల్ల.
3. ఖ. అకట ! యాశ్రితులకు నాపదవచ్చె.
4. క. నొకభంగిగాదు నే నొడలెత్తి చూడ
ఖ. నొకభంగిగాను నే నొడలెత్తి చూడ.
5. క. ఖ జింతాక్రాంతుఁడయ్యె
6. ఖ. నాయవనీశుతోడ
7. భరతేశ ! తెలియ.
8. శరలాఘవంబునఁ జటులవేగము[illegible]
9 నాకృతి మైచాయ నాలవుఁ జూడు.
10. ఖ. యీ కుమారులు.

గావున వీరినిఁ గయ్యంబులోన
దేవ[1]తాదులకైన ధృష్టింపరాదు"
అని వాయుజుఁడు వల్క నాలోనఁ గుశుఁడు
తనసహోదరునితోఁ ద[2]గనిట్లు వలికె
"గుఱ్ఱంబునిదె పట్టుకొనిపోవ సేన
యడ్డాడుచున్నది యనుజన్మ! కంటె
యెన్నియత్నంబుల నీతురగంబుఁ
గన్నిడి జతనమై కా[3]వుమీ వత్స!
ఈపని[4] నీపని యేనెంతకైన
నోపుదు సేనల నుర్వఁ గూల్చెదను"
అనిచెప్పి కుశుఁడు రామానుజుఁ గదియఁ
జనుదెంచి పలికె నాసైన్యంబు బెదరఁ
"జన్నశత్రుఘ్నులక్ష్మణు సైని[5]కులనుఁ
గన్నారఁ జూడు మేగతినున్నవారో
వడితోడ నినుఁ జంపవ[6]చ్చిన నన్నుఁ
గడిఁది శాత్రవునెఱుఁగవె కుశాహ్వయుని
ధరణీశ! నీవు నీ[7]తమ్ములున్నెడకు
నరుగుమిచ్చట నొంటి[8]నహ్వామే నిలువ"

---

1. దేవదానవులకు
2. క. ఖ. దానప్పుడనియె
3. ఖ. కావుము వత్స!
4. ఖ యీపని నీకు నేనెన్ని యత్నముల
5. సైన్యకులను.
6. ఖ. వచ్చుచున్నట్టి.
7. నీతమ్ముఁడున్నెడకు.
8. ఖ. నశుహామేనిలువ.

నని పేర్చిబాలుఁ డిట్లాడువాక్యముల
విని తెంపుసేయక వి[1]వరించిపలికె.
"ఓమహాహవశూర! యురుచాపధార!
రామక్రియావిస్ఫురతుఁడ! వినుమింక
నీవు నాసుతుఁడవు నినుఁ బోరిగొనక
పో[2]వంగ విడిచితిఁ బొమ్ము వేగమున
నెలకొన్న కృపతోడ సీతల్లిఁ జూడ
వ[3]లదు మిన్నక పొమ్ము వైరంబు తగదు
నయశాలి భరతుండు ననుఁబట్టి విడిచె
దయతోడ ననుచు మీ[4]తల్లితోఁ జెప్పు
పె[5]రిఁగి సోదరులఁ జంపితిగాన నిన్ను
ధరణిపైఁ గూల్పంగఁ దగువగునైనఁ
దనయునిసత్వంబుఁ దండ్రిమెచ్చంగఁ
జ[6]నుఁగాని కోపింపఁ జ[7]నదెందు వత్స!"
అని భరతుఁడు వల్క నా[8]మాటవినియు
విననిచందంబున వెసనల్గి కుశుఁడు
వసుధేశుపైఁ బెక్కువరసాయకముల

1. ఖ. వివరింపఁ బలికె.
2. ఖ. పోవంగనిచ్చితి.
3. వలయునింతయెచాలు వైరంబువలదు.
4. క. మీతల్లితోఁ జెపుమ, ఖ. మీతల్లితోఁ జెప్పుము.
5 పరఁగి.
6. క. జనకుఁడు గోపింప
7. ఖ. జన నెందు వత్స!
8. క. నంతలోఁ గుశుఁడు

వె[1]సగించి వెండియు నేడింట నొంచి
యం[2]తట మూఁడువేలమ్ముల జాంబ
వం[3]తుని నొకకోల వాయునందనునిఁ
గదిసి వేయింట నంగదవీరు నేడు
పదు[4]ల నన్నలు నేడు భయదాగ్రకముల
నా[5]సుషేణుని నేసె నరువదేనింట
నాసమయంబున న[6]ప్పుడేవురనుఁ
బెనుమూర్ఛలనుఁ గప్పి పృథివిపైఁబడిరి.
ఘ[7]నశైలములతోడఁ గంపించె వసుధ
యప్పుడు నభమెఱ్ఱనై శోణితములుఁ
దొప్పదోఁగిన నేల దొరసి భూపాల!
గతరాజమండలకమనీయకములు
వి[8]తతరణంబును వీతతారకలు
ప్రగుణితాంబరమణిప్రభల నుజ్జ్వలము
నగుచుఁ జూడఁగ నొప్పెనంతఁ బూర్వమునఁ
గలువలుఁ దలర జక్కవలెల్ల నలర
బలుమంచుఁ దొలఁగ దిక్పటలంబు చెలఁగ

1. వెసనించి వెండియు వేగ నేడింట.
2. నాయతదశకంబు ననుజాంబవంతు
3. వాయునందనుని నర్వదింట నొప్పించి.
4. క. పదియింట నీలుని పటుసాయకముల
5. నాసుషేణుని నేసె నలుకరెట్టింప
6. క. నప్పుడందఱు.
7. క. ఘనశైలముఁబోలె కంపించె వసుధ.
   ఖ. ఘనశైలములతోడఁ గంపింప నిట్లు
8. వితతారణంబును.

సరసిజంబులు నిక్క జనులెల్ల మ్రొక్క
సు[1]రతకాంతులు వీడ సురుచులుఁ గూడ
ఘ[2]నమైన మనుమల కదనంబుఁ జూడఁ
జను[3]దెంచెననఁ దోఁచె జలజబాంధవుఁడు.
ఇ[4]టులసైన్యంబులు యిద్దఱిచేతఁ
బటుశరంబులఁ గూలెఁ బార్థివనాథ!
అవనీశుకోదండ మాఱుబాణముల
లవములై పడనేసె లవుఁడెడఁ జొచ్చి
యాలోనఁ గాలు చేయాడంగనీక
కాలజీలమూతానుకారియై కుశుఁడు
గుణరవంబురుములు కోదండమమర
గ[5]ణనాథుచాపంబుగా నంపవానఁ
గు[6]రిసె వెండియు దివ్యఘోరబాణముల
నరు[7]డైన భరతాగ్ని నార్చి పెల్లార్చె.
అటు భరతుఁడు మూర్ఛ నవనిపైఁబడినఁ
బటుకోపయుక్తుఁడై పవమానసుతుఁడు
పడుచ! నాచేనిదె బవరంబులోనఁ
బ[8]డక నీవిఁక నెట్లు బ్రతికెదవనుచుఁ

1. సురతకాంతలు వీడ సురలెల్లఁగూడ
2. ఖ. ఘనులైన మనుమల కయ్యంబుఁ జూడ
3. ఖ. జనుదెంచె ననఁగను జలజబాంధవుడు.
4. యిట్లుసైన్యంబులు యిద్దఱిచేత.
5. ఖ. గణనాథ చాపంబుగా
6. గురిసెవెండియుఁబడి ఘోరబాణముల
7. నరుఁడైన.
8. బడికాకిక నెట్లు బ్రతికెద వనుచు.

గెరలుచు నొకమహాగిరిఁ బెల్లగించి
ధరణీశ! ధ[1]రణిజాతనయుపై నేసె
నిడువాలుఁగన్నుల నెగయుకోపమునఁ
గడువాఁడిశరము లొక్కటవింటఁ దొడిగి
యచ్చెరువుగఁ గు[2]శుండటు దనమీఁద
వ[3]చ్చు నాకుధరంబు వడినుగ్గుసేసె.
కౌరవచర్మాభిరాముఁడై బాలుఁ
డా రేణువులు మేన నలమిన నొ[4]ప్పె
నరుడైన త్రిపురజయా[5]వసానమునఁ
బరిపూర్ణుఁడగు ఖం[6]డపరశువుఁబోలె.
అటు విక్రమించి లవాగ్రజుండపుడు
పటుతరకోదండపాండిత్యమమరఁ
గాంచనపుంఖాంబకమ్ముల దిశల
నించి మూర్ఛిలఁజేసె ని[7]ఖిలసైనికుల
హ[8]తశేషభటులంత నాకుశుఁ జూచి
యతిభీతిమైఁ బారిరవని కంపింప
నెత్తుటఁ దోఁగిన నిఖిలాంగకములు

---

1. ఖ. ధరణిజాతనయుపై వైచె
2. ఖ. గుశుండటు దనమీఁద.
3. ఖ వచ్చునకు్కధరంబు.
4 నొప్పా.
5. త్రిపురజయావసానముల.
6. ఖ. ఖండపరశుండుపోలె.
7. నిఖిలసైన్యములు.
8. హతశేషజనులంత.

క్రొత్తఁ బూచిన ప్రమోదుగుల గేలిసేయఁ
బఱతెంచి యారామభద్రునిఁ గాంచి
యొఱఁగించి రొకరీతి నెలుఁగులుచెదర.

—. తల్లి వారించినను వినక శ్రీరాముఁడు
కదనరంగమునకుఁ గదలుట .—

తరణికులేశుఁడా దశరథాత్మజుఁడు
భరతాదివీరులఁ బలుమాఱుఁ దలఁచి
పడుచుల సేఁతయు భావించి వెఱఁగు
న[1]డలుకోపంబున నడరనాక్షణమె
త[2]మతల్లిఁ గని మ్రొక్కి తమ్ములు చనిన
క్ర[3]మములుఁ బరుల యక్రమములఁ జెప్పి
యనికి నేఁగెద నన్న ; నన్న ! యీవేళఁ
జనవలదన్న ! యీసరవియే మున్ను
తెలిసినదాన నెంతయు లక్ష్మణుండు
కొలువంగ వన[4]ము వీడ్కొనివచ్చి నీవు
సంతోషమొదవ రాజ్యముసేయుచుండ
నంత నేనొకనాఁడు యవనిజఁ జూచి
"య[5]డవులఁ బదునాలుగబ్దంబు లెట్లు?
యిడు[6]ములఁ బొందితి" రెఱఁగింపుమనిన

---

1. నడలుకోపంబున నడవ నక్షణము.
2. తనతల్లి.
3. క్రమములు బరులయాక్రమములఁ జెప్పి.
4. దపము
5. ఖ. యడవులఁ బధ్నాలు గబ్దంబులెట్లు.
6. యిడుములఁ బొందిరి వెఱఁగింపు మనిన.

ధాత్రీతనూజ యంతయుఁ జెప్పె మీరు
చి[1]త్రకూటము విసర్జించిన తెఱఁగు
మొ[2]దలుగాఁ దాఁ బంక్తిముఖుచేతఁ జక్క-
ట[3]దితుదగా నాకు నంతయుఁ జెప్పి
కాకుత్స్థు తెఱఁగు లంకాపురి నున్న
నా[4]కు నజ్ఞాత పుత్ర! లక్ష్మణుని
నడుగుడు మీరన్న నప్పుడాఘనుని
నడిగిన నతఁడు మీయడుగులుఁగొలువఁ
బనివినవలయు నీపంచినయట్టి
పనివినవలయు నీపట్టున నాకు
నెఱిఁగింపఁ దడవు తల్లిప్పుడే నెల్ల
తెఱఁగులఁ బటమునఁ దేటఁగా వ్రాసి
యనిపెద జనకరాజాత్మజచేత
వినుఁడని యట్లగావించె నాఘనుఁడు
సీత యాపటము వీక్షించి నాతోడ
నే తెఱంగునుఁ జెప్పకేడ్చుచు నున్న
నాలోన సౌమిత్రి యరుదెంచి సీత!
యేల దుఃఖించెద? వెఱిఁగింపుమనిన
"నుభయపార్శ్వంబుల నున్నారు రామ
విభుఁ గొల్చియిద్దఱు విధుబింబముఖులు
యీలోన నిదెకంటి నిదెనాకు సవతి

1. చిత్రకూటమున విహరించు తెఱఁగు
2. మొదలు గాఁదాఁ బంక్తి ముఖుచేతజిక్కి-
3. నదితుదగానాకు నంతయుఁజెప్పె
4. నాకు నజ్ఞాతమంతయును లక్ష్మణుని

పాలింత యనుభవింపఁగ నాకు సుదతి
యజుఁడు వ్రాసిన వ్రాత యింతియెకాని
నిజము లక్ష్మణ! యిది నీవాడఁగాదు
నృపవరుండేకపత్నీవ్రతుండగుట
కపటమై పటమునఁ గాన్పించె" ననుచు
బడలి యప్పుడు మ్రానుపడియె నావేళఁ
బడియె నాధరణి నేర్పడియెఁ గన్నీరు
సౌమిత్రి యప్పుడాజనకజ కనియె.
"రామ! యీప్రతిమలు రాములుగారు
శ్రీరామునకును గౌశికుఁడిచ్చినట్టి
దారుణజృంభకాస్త్రములన్న" నపుడు
సీత యంతయు విశ్వసింపకయున్న
నాతండు మంత్రింప నవియమ్మలయ్యె
గ్రమ్మన సీత యా[1]కాండద్వయంబుఁ
దెమ్మన లక్ష్మణదేవుండు[2] నిచ్చి
చనుటయు సవతిమత్సరమునఁ జేసి
ననుగంధముగ దాని నూరుకత్రావె
గర్భిణియయ్యె నాకాంతలో నున్న
యర్భకులందు నేనయ్యస్త్రమహిమ
మొన్నఁగానలకు నమ్మద్దియ చనఁగ
నన్న! యేఁ గరమున నంటిగర్భంబు

1. యాకాండధ్వజంబు.

2. యిచ్చె

నివిరి మంత్రించిన నీ[1]దైన దివ్య
కవచమంత్రం బమోఘంబుగా నిపుడు
యీమహాత్మకులందు ననఘ! నీదైన
సా[2]మర్థ్యమంతయు సరి సంక్రమించె
నదిగాన వారు నీయా[3]త్మజులగుదు
రి[4]దిసందియము లేదు యింతిక నాకు
నా[5]కుమారకులు నియ్యనిలోన నీకు
నో[6]కుమారకుఁడ! సాధ్యులుగారు పోకు"
మన[7]వుండు విని, రాముఁడమ్మతో ననియె
"జనని! నీవాక్యంబు సత్యమానైన
సుతులకుఁ దెగడనుజులవద్దనైన
నతి[8]కష్టుఁడన రాముననరె భూప్రజలు
అరులఁ జంపుటయొండె యనుజులయెదుట
సు[9]రుఁగక నిలిచి చచ్చుటయొండెగాక

---

1. నీదైన్య.
2. సామర్థ్యమంతయు సంగ్రహమించె.
3. యాత్మజులగుట
4. యదిసందియు గాక యంతికనాకు. క. అదియునుసందేహంబు యింతయు లేదు.
   ఖ. యిది సందియము లేదు యింతెయికాని.
5. క. ఆకుమారకుల కయ్యంబులోనీకు
   ఖ. ఆకుమారకులు కయ్యములోన నీకు.
6. క. నోకుమారక ! యింక సాధ్యంబుగాదు.
   ఖ. నోకుమారక ! యసాధ్యులు నీవుపోకు.
7. అనవుండు రాముండు అమ్మతో ననియె.
8. ఖ. అతికష్టుఁడే రాముఁడనరె భూప్రజలు
9. క. శూరతనిలిచి చచ్చుట యొండెగాక.

ధ[1]నువున బాణంబు ధరియించు నృపుఁడు
తనువునఁ బ్రాణంబు ధరియించునట్లు
జనియెద’’ ననుచుఁ గౌసల్యకు మ్రొక్కి
జననాయకుఁడు రామచంద్రుఁ డవ్వేళ
విశిఖబాణాసనవి[2]విధసాయకుఁడు
దశదిశవిదళనోద్ధతవి[3]ధాయకుఁడు
మహిత[4]ధీరోదాత్త మానసోజ్వలుఁడు
సహజసన్నాహప్రచారుండు నగుచు
వెడ[5]లె వేగమున నవ్వీరునిఁ గొల్చి
వెడలిరి వైతేయవిభుఁడు నర్కజుఁడు
తదనుచారులు వీరదైత్యవానరులు
కద[6]లి రసంఖ్యాతగణములతోడ.
ఈకలహము పుట్టుటెల్ల నాకూతు
శోకంబునకు నాదిసూచ[7]కంబయ్యె
శిశువులపైఁ బెక్కుసేనలుఁ గూడి
దశరథతనయుండు దండెత్తివచ్చె

1. ధనువున బాణంబు ధరియించునపుడు.
ఖ. ధనువును బాణంబు ధరియించునృపుడు.
2 క. వివిధసాధనుఁడు. ఖ. వివిధసాధకుఁడు.
3. క. సాధనుండు.
4. మహితవీరోద్ధాంత మానసోద్ధతుఁడు
క. మహితశూరోదాత్త మానసోజ్వలుఁడు
5. క. వెడలె వీరులుతన్ను వేడ్కతోఁ గొల్వ
6. కదలిరి సంఖ్యాత గణములతోడ.
7. సూచితంబయ్యె.

నాకోపముడుపరే యనుచు దివ్యులకు
భూకాంత మొ[1]ఱవెట్టఁ బోవుచందమున
బలుఘూళి[2] యాకాశభాగంబు నిండె,
విలయకాలము[3]వోలె విశ్వంబులదరె
జల[4]దరింపఁగఁ జొచ్చె సప్తపాతాళ
(ములు[5] సప్తసాగరములు సప్తగిరులు) *
సప్తాశ్వుఁడును స[6]ప్తసంయమీశ్వరులు
సప్తతాళధ్వంసి సంరంభమునకు.

—: శ్రీరాముఁడు కుశలవులఁ గాంచి
వారివృత్తాంతము నడుగుట :—

అం[7]త భూపాలకుండతివేగ నడచి
కాం[8]తారమున కేఁగి కపిరాజుతోడ
నేలకు ఁ[?]వేఁగుగా నెర[9]పినట్లున్న

1. మొఱవెట్టి
2. క. యాకాశపదమున కెగసె. ఖ యాకాశపథమున కెగసె.
3. క. బోలెవిశ్వంబు నిండె. ఖ. బోలెవిశ్వంబునిండి.
4. జలదరింపఁజొచ్చె సప్తలోకములు.
క. జలధిగంపఁగఁ జొచ్చె.........తాళ.
ఖ. జలధరింపఁగఁ జొచ్చె సప్తపాతాళ
* ఈ పంక్తిమాతృకలోనిదికాదు. క. ఖ. గ్రంథములలోనిది.
5. సప్తసాగరములు సప్తశైలములు.
6. క. ఖ. సప్తసంయమీగణము.
7. క. అంతభూపాలకుండాధర నడచి ఖ. అంతభూపాలకుండందఱఁ గడచి.
8. కాంతారమునకేఁగె.
9. నెరపినట్లుండె.

బా[1]లసాయకహతబహుళసైన్యములఁ
గనుఁ[2]గొంచు విస్మయకలితాత్ముఁడగుచుఁ
జను[3]దెంచు శ్రీరామజననాథుఁడెదుర
ధ[4]నురాదిదివ్యసాధనములతోడఁ
(దనసరివైనట్టి తనువులతోడఁ)*
గాకపక్షముల వల్కలములతోడఁ
జే[5]కొని యనురక్తిసిక్తాంగులగుచుఁ
గడునొప్పు బాలురఁ గని కృపారసము
క[6]డలొత్తఁగా నయకలితుఁడై పలికె.
"ఇట్టి మీరిద్దఱు నెవ్వరివారు?
నెట్టన విలువిద్య నేర్పిరెవ్వారు?
కదనచాతురి యెట్లు గలిగె? వేదములఁ
జదివించిరెవ్వరు? సముచితాంగముల
జననియెవ్వతె మీకు? జన[7]కుఁడెవ్వాఁడు?

---

1. క ఖ బాలనాయకహతబహుళసైన్యముల
2. గనుఁగొంచు విస్మయకలితాంగుఁ డగుచు.
   క. గనుఁగొని విస్మయకలితుడై యపుడు.
   ఖ. గనుఁగొని విస్మయకలితాత్ముఁ డగుచు.
3. చనుదెంచి శ్రీరామజననాథునెదుర.
4. క. తనరారు దివ్యసాధనములతోడ.
   * ఈ పంక్తి మాతృకలోనిది కాదు. క. గ్రంథములోనిది.
5. జేకొనుయనురక్తి సిక్తాంగు లగుచు.
   క. జేకొనియనురక్తి సిక్తాంగుఁ డగుచు.
   ఖ. జేకొనిరక్త సిక్తాంగులు నగుచు.
6. కడలెత్తఁగా నయాకలితుఁడై పలికె.
7. ఖ. జనకుఁ డెవ్వారు.

వి[1]నుపింపుడెచ్చోట ? విహరింతు "రనిన
నామాట విని కుశుండప్పుడా రామ
భూమీశుతోడ నేర్పున మారువల్కె.
"ధరణీశ! మాకులస్థాననామములఁ
బరికించి యడుగంగఁ బ[2]నియేమి యిపుడు?
యీమెయి మాకథ లెఱుఁగంగఁ గార్య
మే[3]మి? నీకును మాకు నెయ్యూరిపొందు?
మనుజేంద్ర! యిపుడు నీమాటకుత్తరముఁ
జనుఁజెప్ప నినుబోఁటి చంచలాత్మునకుఁ
(గడువేగ యుద్ధంబుఁ గా[4]వింపవేల?
తడవుసేయుట రాచధర్మమే నీకు
విడువుమీమాటలు వెయ్యేల? హయము
విడుతునే యేనిట్లు విం[5]దుమాటలకు)*
మగుడు మీ[6]యూరికే మగవాఁడవైన
నిగుడు కయ్యమునకు ని[7]ర్ణయంబిదియె"
అనిపూని ధీరత నాడువాక్యముల

---

1. వినుపించురెచ్చోట విహరింతురనిన క. వినుపింపుడెచ్చోట విహరింతువనిన.
ఖ. వినుపింపుయెచ్చోట విహరింతువనిన.
2. క. బనియేమినీకు.
3. ఖ. మేమి మీకును మాకు నేయూరిపొందు.
4. క. ఖ. గావింపుమేల
5. క. వెడదమాటలకు.
* ఈ రెండు పద్యములు మాతృకలోనివికావు. క. ఖ. గ్రంథములలోనివి.
6 క. మీపురికిని.
7. నిర్ణయంబిదియు.

విని రామచంద్రుండు వెండియు ననియె.
"శిశు[1]వులు మీతోడఁ జెనసి పోరాడఁ
గుశుఁడ! నాచిత్తంబు కొలుపదీవేళఁ
బగ చంపఁదగియుండు భ్రాతృఘాతకుఁడ
వగుదు వైననుఁ గృప యటు సేయనీదు'
అనుమానమేల? నేనడిగిన తెఱఁగు
వినిపింపు మంతయు వి[2]వరంబుగాఁగ
ననుటయు సకలలోకానందకరము
జననాథునకు మహాసంతోషకరము
నగుమాట వలికె నయ్యవనిజాసుతుఁడు
జగతీశ! రఘురామచంద్రునితోడ
"మమ్మునట్టడవిలో మనుజేంద్ర! యన్న
దమ్ములఁ గనియె సీతామహాదేవి 980
చాలి యంతకుఁ దానె జాతకర్మములఁ
(జౌలోపనయనాది సకలకృత్యముల)*
నొ[3]నరించి వాల్మీకి యుక్తమార్గమున
ఘ[4]నమైనకృప దివ్యగానంబు నేర్పి

---

1. శిశువత్స గాననినుఁ జెనసిపోరాడ.
2. ఖ. వినఁబ్రేమనాకు
   * ఈ పంక్తి మాతృకలోనిది కాదు, క. ఖ. గ్రంథములలోనిది.
3. నొనరించె వాల్మీకి యుక్తమార్గమున.
4. ఘనమైన కృపదివ్య గానంబు నేర్పె.
   క. ఘనకృపామతిగానఁ గావ్యంబుఁ జెప్పె.
   ఖ. దినకరకుల నాథ! దివ్యగానములు.

వేదంబులను ధనుర్వేదంబు సకల
వేదాంగములఁ జదివించె నమ్మౌని
కరుణఁ బాపక్షయకరమును సౌఖ్య
కరమును బ[1]హులాభకరమును నైన
శ్రీరామచరితంబుఁ జె[2]ప్పె మాకెలమి
ధారుణీనాయక! తత్ప్రసాదమున
లలితదృష్టియు ననాలస్యబుద్ధియునుఁ
గలిమియు స్వాస్థ్యంబుఁ గలిగె మాకిపుడు
రామచరిత్రపరాయణత్వమున
సా[3]మర్థ్యమంతయు సమకూరెఁగాన
(నిఖిలభీకరమైన నీసేనలెల్ల) *
న[4]ఖిలబాణంబుల నణఁచితిమేము
పుత్రదారాదుల పొందుననీకు
ధాత్రీశ! తలఁచినఁ దలఁపువెగ్గలము
అని కేఁగి ముందటి యర్థంబు మఱచి
వెనుకతలంతురే వీరపుంగవులు 990
జయమెది పడిన నీసైన్యంబుఁ జూచి
భయమైన వేగంబె పయనమై పొమ్ము"
అని ననప్పుడు 'సీత' యని యెడుపేరఁ

1. ఖ. బహులోభ కరమానునైన.
2. జెప్పిమాకెలమి.
* ఈ పంక్తి మాతృకలోనిది కాదు. ఖ. గ్రంథములోనిది.
3. సామర్థ్య మంతయు సమకూర్చెఁగాన.
ఖ. సామర్థ్య మెంతయు సమకూరెఁగాన.
4. నిఖిల బాణముల నణఁచితి మేము.

దనయులచే విని ధరణీశ్వరుండు
పొరిగొన్న వగలతోఁ బొడమిన మూర్ఛ
నర్దదంబుపైఁ ద్రెళ్లె నవనీశ్వరుండు.
ఒకముహూర్తంబున నొయ్యనఁ దెలిసి
యొకభంగి నురుధైర్యయుక్తుఁడై విభుఁడు
భానునందనుఁ జూచి పలికె "సుగ్రీవ!
యేనరుపుత్రులో! యీకుమారకులు
అ[1]నఘ! మున్నెఱుఁగవే" యనిన సుగ్రీవుఁ
డనియె రామునితోడ హస్తముల్ మొగిచి
"వెఱవొందఁ జూచితే వీరు పురాణ
పురు[2]షవంశజులు గాఁబోలుదు రధిప!
క్షితినాథచంద్ర! నీశ్రీమూర్తి యెదురఁ
బ్రతిబింబయుగళంబుభంగి నున్నారు
కాకు[3]న్న బాలు రీకరణిఁ గయ్యమున
నీకెదురై పోర నేర్తురే వీరు"

—: నీలుఁడాదిగా నిఖిలసైనికులు మూర్ఛిల్లుట .—

అని యర్కజుఁడుఁ జెప్ప నం[4]తలో నీలుఁ
డను[5] మహావానరుం డతిసాహసమున 1000

1. యనఘ! మున్నెఱుఁగుదే యనిన సుగ్రీవుఁ.
2 పురుషులయశము గాబోలును యధిప.
3. ఖ. కాకున్న బాలురీకయ్యంబులోన.
4. ఖ. నాలోన నీలుఁ.
5. ఖ. డును మహానదిదాఁటి యతిసాహసమున.

నాసి[1]సువులు చూడ నశ్వంబు విడిచె,
గాసిల్లి లవుఁడన్నఁ గనుఁగొని యపుడు
"వినుచలంబున సేన విడియించి వచ్చి
మనతోడి నయగారి మాటలాడుచును
వీనిచేఁ దురగంబు విడువంగఁ బనిచెఁ
దానరయంగనే తగవరి విభుఁడు
దళములతోడ నీతనిఁ బడ్రవేయ
వలయునెమ్మ" ని గుణధ్వని సేసి యార్చి
పడవాలు నీలునిఁ బడవాలుతూపు
లడరించి వైరిసైన్యంబులు బెదర
నతనిరక్తంబుచే నవనిపై నీల
శతము లాతనితోడ సమరూపశౌర్య
సమసమరారంభజ[2]యమహోపాయ
సముదగ్రములు పుట్టి స[3]మరమంతయునుఁ
దమ[4]మయమైయుండఁ దనరు కోపమునఁ
దమమీఁదఁ గ[5]విసిన ధరణిజాసుతులు
వివిధబాణంబుల వృష్టిఁ గల్పించు
యవనిపైఁ బడనేసి రతిలాఘవమున.

---

1. నాశిశువులు.
2. జయసహోపాయ.
3. ఖ. సమరమెంతయును.
4. ఖ. దమమయంబై యుండ.
5. ఖ. గదిసిన.

నీలుర నీగతి నె[1]సమార్చి బాణ
జాలంబుఁ దక్కిన సైన్యంబుమీఁద
నిగుడించి రెంతయు నిష్ఠురభంగి.
జగతీశచంద్ర! యీసమయంబునందు
ధరణిపైఁబ[2]డి మదోద్ధతి దక్కియున్న
కరులు దావాగ్నులఁ గాలిన గిరులు
తొ[3]నఁకంగఁ గలయ నెత్తురుతోడఁ బారలు
మనుజేంద్రులింకిన మడువుల మీలు
మొత్తంబులై హారములనుండి రాలు
ముత్తియంబులు మొల్లమొగ్గలఁ దఱచు
శరపరంపరల జర్ఝరితులై బె[4]గడఁ
దరు[5]చరేంద్రులు వడి దాఁటుచందమున
వేవేగ రణభూమి విడిచి పె[6]ల్లురుకు
మా[7]వుల గము లెండమావులు గాఁగ
సమరంబు మండువేసవియునుఁ బోలె
తెమ[8]లక మఱియు నాదృఢపరాక్రములు

---

1. నెపమార్చి.
2. ఖ. బడి యధోగతి దక్కియున్న.
3. తొనరంగవలయు నెత్తురుతోడ బారలు.
   ఖ. తనగుచుగలయ నెత్తురులలో బారయ.
4. ఖ బెగడు.
5. ఖ. తరుచరేంద్రులు తడదాఁకినవేళ.
6. ఖ. వెల్లురుకు
7. ఖ. మావులు.
8. తెరలక.

యే[1]వీరు నురవడి నెన్ని బాణముల
నేవిధంబునఁ గూలు నెం[2]తయుఁ దెలియ
నా[3]వీరు నావడి నన్ని బాణముల
నా[4]విధంబునఁ గూల్చి రన్ని బాణముల
నటు[5] నీలుఁడాదిగా నఖిలసైనికులు
పటుతరాంబకములఁ బడిరి మూర్ఛిల్లి.

—: శ్రీరామపరాభవము :—

అక్కజంబుగ నప్పు డారామచంద్రుఁ
డొక్కండె చిక్కె నయ్యుద్ధరంగమున
నరనాథ! నరులు వానరులును హరులు
కరులుఁ దేరులుఁ జాపకట్టుగాఁ బొ[6]డిసఁ
గనుఁగొని ధరమీఁద గతజీవులైన
యనుజులఁ గనుఁగొని యపుడేమి! చెప్ప
కొ[7]డుకు తాఁబెటిఁగియు ఘోరాంధకార
మడరినఁ దెలియక యు[8]తులాగ్రహముఁనఁ

---

1. ఖ. యేవీరుఁడెదిరిన నన్ని బాణముల.
2. నంతయుఁదెలియ. ఖ. నదియునుఁదెలిపి
3. ఖ. నావీరునామరి.
4. ఖ. వేవేగ సేసిరవ్వేళ సైన్యములు.
5. నటు నీలుఁడాదిగా నఖిలసైనికుల.
   ఖ. అటునటునాదిగా నఖిలసైన్యములు.
6. బడిరి.
7. ఖ. కొడుకుల పుట్టెటిఁగిఘోరాంధకార.
8. ఖ. యతులాగ్రమునను.

ప్రళయకాలానల[1]ప్రతిబింబ మగుచు
వెలుఁగు వాలమ్ములు వెల్లిఁ బైఁబఱపె,
లక్షించి యాకుశలవులు కోపమున
నక్షతాస్త్రము లేసి యాసాయకములఁ
గడిఁది వైరుల జయకాంక్షలతోడఁ
బొడిఁ జేసి యార్చిరప్పుడు మిన్నువగుల
జగములు వడఁక నచ్చలమున మఱియుఁ
దెగువ రాఘవుఁడేయు దివ్యబాణములఁ
బ్రతిదివ్యసాయకప్రకరంబు లేసి
యతివేగమునఁ ద్రుంచి రాకుమారకులు
యారణం బఖిలలోకానేకచిత్ర
కారణంబయ్యె నాకాలంబునందు. 1030
అలసి రాఘవుఁడప్పు డాకుమారకుల
బలమునుఁ దనబాహుబలమునుఁ జూడ
సరిమైన నీక్షించి సంగ్రామ ముడిగి
యరుదంది యేయక యట్లూరకుండె.
అప్పుడు కుశలవు లమ్ములవానఁ
గప్పి రావిభు[2]మీఁదఁ గరలాఘవమున
నావాఁడియమ్ముల నలసి యారామ
భూవరుండొఱిగె నప్పుడు తేరిమీఁద.

1. ఖ. ప్రతిమంబులగుచు
2. ఖ. రఘువీరు.

—: కుశలవులు శ్రీరామచంద్రాదుల భూషణాదులనుఁ గైకొని హనుమజ్జాంబవంతులఁ దోడ్కొని యాశ్రమ భూమికింజని సీతకుఁ దమజయమునుఁ దెల్పుట :—

ఒఱిగిన నప్పు డాయుర్వీశుచంద
మెఱిఁగి వారుగ వచ్చిరిద్దఱు సుతులు
ధరణీశు నరదంబుఁ ద[1]నయన్నకిచ్చి
పఱఁగిన బాల్యచా[2]పలమున లవుఁడు
"మాతల్లిఁ దొలఁగించి మఖముఁ గావింప
నీతియే రఘునాథ! నీకేల? దీక్ష"
వలదని మా[3]న్పిన వడువున రత్న
లలితకాంచనకుండలములఁ గై[4]కొనియు
మకుటహారాంగదమణినూపురాది
సకలభూషణములఁ జతురుఁడై కొనియె,
పడియున్న శత్రుఘ్నభరతలక్ష్మణుల
తొడవులఁ దక్కిన దొరలసొమ్ములను
ధనురాది సకలసాధనములఁ దిగిచి
కొనివచ్చి వేడ్కఁ గుశునకుఁ జూపి
యనిలోన వికృతాంగులై పడియున్న
హనుమంతు ఋక్షేశు నటఁజూపి వీరి
వాలాయమునఁ గొ[5]నివచ్చెదఁ బర్ణ

1. ఖ దమయన్నకిచ్చి.
2. చాపమున లవుండు. ఖ. చాపమున నావుండు.
3. ఖ. మాన్చిన.
4. గైకొనియె.
5. గొంచువచ్చెదఁ బర్ణ.

శాల[1]కు నుభయపార్శ్వంబులయందు
నిద్దఱుఁ గట్టిన నెపుడు జానకికిఁ
బ్రొ[2]ద్దుపుత్తురు నవ్వుఁ బుట్టించి వీరు
హేమవర్ణంబైన యితని తేరిక్కి
భూ[3]మిజాతనయ! యిప్పుడు మృతులైన
యధికులఁ గపికులేంద్రాదుల వీర
నిధులఁ జూచెద నేను నీయాజ్ఞ సేసి"
అని యన్నతోలవుండాడువాక్యముల
విని భీతులై ఋక్షవిభుఁడు వాయుజుఁడుఁ
బడి[4]యుండి కపటంబు బలుమూర్ఛఁ దాల్చి
మిడుకఁ గాలును జేయి మెదలింప వెఱచి
యచ్చెరువుగఁ గన్ను[5]లట మూసి యూర్పు
లుచ్చకబీరంబు వోవంగఁ బెట్టి
శవములసంగడిఁ జచ్చినయట్లు
నవనిపైఁ బడియుండి యాతండు తమ్ముఁ
జూ[6]చినఁ జూడరు చూడకయున్న
జూచి యీగతి వెఱచుచు నుండిరంత,
మంతనంబున హనుమంతుండు జాంబ

1. శాలల నుభయపార్శ్వంబులయందు.
2. ఖ. బ్రొద్దుపుత్తురు.
3. ఖ. భూమిజతనయు లప్పుడు మృతంబైన.
4. ఖ. బడియుండ్రి.
5. ఖ. గన్నులవిమూసి.
6. చూచినఁ జూడ్కులు జూడకయున్న.

వంతుతో ననియె నావరవీరుఁ జూపి
"పడుచులచే రామభద్రాదు లిట్లు
బడినచందముఁ గంటె[1] భల్లూకనాథ!
నిను నేమి సేయునో! నిర్దయబుద్ధి
నను నెంతఁ బఱచునో! నరనాథసూనుఁ
డేమిసేయఁగవచ్చు నీలవుచేత
నేమివచ్చిన వచ్చెనిది దైవకృతము
జానకిముందఱఁ జావు దానైనఁ
గానిమ్ము బ్రదుకైనఁ గానిమ్ము లెస్స"
అని పల్కుచుండంగ నప్పుడాలవుఁడు
జననాథచంద్ర! లక్ష్మణురథంబెక్కి
చనుదెంచి కాంచనశైలసీలాద్రు
ల[2]ననొప్పఁ బడియున్న యావీరవరుల
నడరు వేడుక నెత్తి యరదంబుమీఁద
ని[3]డుకొని రణరంగ మీక్షింపఁ దొ[4]డఁగె,
కొఱప్రాణములతోడఁ గూలియున్నాఁడుఁ
గఱచు క్రోతులఁ జూచి కదిసి నవ్వుచును 1060
దనుజులనెత్తురుఁ ద్రావి చిత్తమునఁ
దని[5]వొంది త్రేన్చు భూతములఁ జూచుచునుఁ

1. ఖ. గంటి.
2. ఖ. లననేలఁ బడియున్న.
3. ఖ. నిడికొని.
4. ఖ. దొణఁగె.
5. దనివొంటి.

గపటమూర్ఛితులైన కపులు భీతిల్ల
గుపితుఁడై కోదండగుణము మీటుచునుఁ
దను మెచ్చి భేతాళతతులు కీర్తింప
వినుచు నద్భుతములు వెండియు నగుచుఁ
గొండలచందానఁ గూలిన కరటి
తుండంబులును ఘ[1]నతురగఖండము లు
వీరాంగకంబున విటతాటమైన
తేరులు తునకలై తెగిన కైదువులు
న[2]నుపమంబగు తనయురదంబు వఱప
ననువు గాకుండిన నల్లన న[3]గుచు
వెల్లియై పా[4]ఱెడి వీరరక్తంబు
నెల్లభూతంబులు నిండఁ దోలుచునుఁ
గనలి యాబ్రహ్మాండగముల నుగ్గాడి
తనివోంది తిరుగు యంతకునిచందమున
సరిలేని నిజభుజశౌర్యవిస్ఫురణఁ
దిరిగి యారణమెల్లఁ దే[5]ఱంగఁ జూచి
వచ్చి యగ్రజుపాదవనరుహంబులకు
ని[6]చ్చలోఁ జొక్కుచు నెఱిఁగి యిట్లనియె. 1070
"నీచేతఁ జచ్చిన నిఖలసైన్యములఁ

1. ఖ. ధర.
2. ఖ. నమపమంబై తన యురదంబుఁ బఱప.
3. ఖ. చనుచు.
4 ఖ పాఱెడు.
5 తెఱఁగెల్లఁ జూచి.
6. ఖ. నిచ్చలో మ్రొక్కుచు నిట్లనిపలికె.

జూచి వచ్చితిఁ జెప్పి చూప నచ్చెరువు
నెడపక వచ్చు వాహినులు వాహినులు
క[1]డలేని కరటిభంగములు భంగములు
ఘ[2]నరథతురగచక్రములు చక్రములు
వనచరావళు లుగ్రవనచరావళులు
గ్రాలు క[3]పాలశంఖములు శంఖములు
కీలాలములు గ్రమ్ముకీలాలములునుఁ
బరపైన రాఘవబలసముద్రమునఁ
దిరుగుడు వడక యీఁదితివి చేయీఁతఁ
బ్రతివీరవరులఁ జంపఁగ నీవెకాని
యితరవీరులకెల్ల నేభంగి దొరకుఁ
గావున సకలలోకంబులం దెల్ల
నీవె శూరుఁడ వన్న! నేనెంతవాఁడ"
ననవుండు కుశుఁ డప్పు డనియె "నీయట్టి
యనుజుఁడుఁ గలుగంగ నదియెంత నాకు
నీజాంబవంతుని నీవాయుసుతుని
వాజిని భూషణావళులును గొంచు
న[4]క్కడ మనచంద మరయంగ లేక
పొక్కు జానకిఁ జూడఁ బో[5]దమీక్షణమె" 1080

1. కడలేని కరములు గములు భంగములు.
2. ఖ. ఘనరథముక్తచక్రములు చక్రములు.
3. ఖ. కపోల.
4. ఖ. నక్కటా.
5. బోదమీక్షణము.

అనుచు నిద్దఱుఁ దమయురదంబు లెక్కి-
హ[1]నుమంతు బలవంతు నాజాంబవంతు
నాభరణాదులు సర్వంబుఁ దెచ్చి
యాభూమిజకు మ్రొక్కి- యఖిలంబుఁ జె[2]ప్పి
"యా[3]రామచంద్రుని నవలీల గెలిచి
వారక భరతుని వసుధపైఁగూల్చి
సౌమిత్రిఁ బడనేసి శత్రుఘ్ను నొంచి
యామహాశూరుల యాభరణముల
నిమ్ములఁ దెచ్చితి మీాక్షింపు మి[4]ప్పు
డమ్మ! నీకిదె వినోదార్థంబు గాఁగ
ము[5]దసలి యెలుఁగును మొఱఁగు మర్కటము
నిదె కొనివచ్చితి మెలమిమైఁ జూడు."

—: జానకి కుశలవుల మాటలను విని మిగులఁ గుందుట; జాంబవద్ధనుమంతుల వదలఁజేయుట :—

అని యిద్దఱునుఁ జెప్ప నామాటలెల్ల
విని మహీనందన విస్మయంబంది
గాలిచేఁ గంపించు కదళీకాతరువు
పోలిక వడఁకుచుఁ బుత్రులకనియె.

1. ఖ. హనుమంతు బలవంతుఁడగు జాంబవంతు
2 ఖ. జెప్ప.
3. యారామచంద్రుల.
4. మిపుడు.
5. ముసలి యెలుంగును మొరగు మర్కటము.

“మీసాహసంబున మీర[1]కార్యంబు
సేసి[2]తి రిటమీఁదఁ జెప్పెడిదేమి?
వెలసిన యారామవిభుని మీరిపుడు
గెలిచితి మనుట మిక్కిలి యసంగతము
యారామునకు మీకు నంతరాంతరము
నేరూపమున నది యెన్నిచూచినను
మృగకులాధిపునకు మృ[3]గశాబమునకు
నగునట్లు గాని సామ్యంబనరాదు,
ఆమహారాజు రామావనీశ్వరుఁడు
భీమసంగరకళాభీషణమూర్తి
సని మీరు గెలిచితిమను వింతవార్త
వినఁగూడ దింక నేవిధమకో! కాని
మెలఁకువ సుతులార! మీరును [4]నేనుఁ
దెలియకుండఁగ నిన్నిదివసంబు లుంటి
మ[5]కట! నాయజ్ఞాతమైన వర్తనము
ప్రకటమై యారడిపడియె మీచేత,
వెడలంగ నడచిన విభునిఁ జం[6]పించెఁ
గొడుకులచేఁ గడుఁ గ్రూరత న[7]నుచు

1. మీరెగార్యంబు.
2. ఖ చేసితిరిటమీఁదఁ జెప్పెటిదేమి.
3. మృగశాబకునకు. ఖ. మృగశాబకముల.
4. నన్ను.
5. యకట.
6. జంపించి.
7. మెఱసి.

ననుఁ బ్రువ్వఁ దిట్టరె న[1]రులెల్ల నాఁడుఁ
జనునె యీ చేటును సడియునుఁ గంటి
నీకలహమును మున్నేమాత్రమైన
నాకెఱింగింపక నావిభుఁ జంపి
వెఱవక కడఫటు వినుపించుకొల్ల
నుఱుమని పిడుగయ్యె నో పుత్రులార!
పుత్రులే నాకడుపునఁ బుట్టినట్టి
శత్రులుగాక యీ సమయంబునందుఁ
గట్టిఁడిసుతులార! కడుపున మీరు
పుట్టితి రేకీడుఁ బుట్టించుకొఱకు
నెక్కడఁజొత్తు మిమ్మెన నేర్తు
నిక్కడ నాభాగ్య మిట్లుండె'' ననుచుఁ
జింతించి లవుఁ జూచి సీతయిట్లనియె
నంతరంగంబున నడరినకరుణ.
''అన్న! వాల్మీకి దానరుదేకమున్నె
యెన్నఁ గీర్తికి నెక్కునితని సీతనిని
నత్యంతమాన్యుల నభిమానధనుల
నిత్యసత్యుల గుణాన్వితుల నుత్తములఁ
గడలేని కృపతోడఁ గయ్యంబులోన
విడువవే'' యనవుండు వెసమ్రొక్కి లవుఁడు
బలవంతులగు కపిభల్లూకపతులఁ
గలనులోననె డించి క్రమ్మర వచ్చె.

1. నరులెల్ల నాడ.

—: నారదునివలన దాశరథులపరాభవము నెఱింగిన వాల్మీకి తన
యాశ్రమముఁజేరి కుశునివలన సర్వము నెఱింగి
దాశరథుల మూర్ఛఁ బోఁగొట్టుట :—

అనురక్తి నారదుండాకార్య మెల్లఁ
ద[1]నదుచిత్తంబునుఁ దనియంగఁ జూచి
పనివడి రయమునఁ బాతాళలోక
మునకేఁగి వాల్మీకిమునివరుఁ గాంచి
కు[2]శలవు లలుకమై ఘోరాజిలోన
దశరథసుతుల నందఱ గెల్చినట్టి
తెఱఁగెంతయునుఁ దేటతెల్లంబుగాఁగ
నెఱిఁగింప వరుణున కెంతయుఁ[3] జెప్పి
గొనకొని మునులతోఁగూడ[4] నేతెంచెఁ
దనవనంబునకుఁ బాతాళంబు వి[5]డిచి
జననాథ! ముని యిట్లు జనుదెంచి మహిమఁ
దనరు నిజాశ్రమద్వారంబునందు
నాదిత్యతేజుల నధికుల న[6]స్త్ర
వేదమూర్తులబోలె వెలయు బాలకుల

1. దనకుఁ జిత్తంబు దనియంగఁ జూచి.
2. ఖ. కుశలవు లలవులై ఘోరాహవమున.
3. జెప్ప.
4. గూడ నేతెంచి.
5. వెడలి.
6. ఖ. శస్త్ర.

నడరి లోకము నెల్ల న[1]డఁగింపఁ గోరి
పోడమిరో! యననొప్పు భూ[2]రివిక్రముల
నిశితాస్త్రచాపతూణీరభీకరులఁ
గుశలవాఖ్యులఁ గనుఁగొనియె నా[3]లోన
నె[4]దురుగాఁ జని వారలిద్దఱు మౌని
పదములకెరఁగినఁ బలికె నాఘనుఁడు.
"జననాథుసేనతో సంగరంబయ్యె
నని శ్రుతాశ్రుతముగా నచ్చోట వింటి
నావార్త నిక్కమా? యఖిలంబు నాకు
నీవెఱింగింపుమా నిఖిలైకవీర! 1120
మిమ్ము నాటవుగదా! మిగుల బాణములు
సమ్మదంబే కదా జానకీపుత్ర!"
అనవుండు కుశుఁడప్పు డామునీశ్వరునిఁ
గనుఁగొని నిజహస్తకమలముల్ మొగిచి
"ఓతండ్రి! నీకృప నొండేల పుట్టు
నే తెఱంగున మాకు నెలమియే కాక
కరుణాత్మ! వెడవెడ కయ్యంబు పుట్టె

1. నడపంగఁగోరి ఖ. నణఁగింపఁగోరి.
2. భూరివిక్రమున.
3. ఖ. నావేళ.
4. నెదురుగాఁ జనువార లిద్దఱుమౌని.

న[1]రులతోడనెకూడ నదిశాంతమయ్యె,
భావింపఁగా నిత్యపావనంబైన
యీవనంబున జీవహింస వా[2]టిల్లె
న[3]ను వెఱపున్నది యంతియెకాని
మ[4]నసులోపల భీతి మఱియుండు లేదు,
కార్ముకకౌక్షేయకరవాలపరిఘ
చర్మపాణులు రాజశతములు బలయు
నాటోపవారణస్యందనసుభట
ఘో[5]టకనికరసంకులమైన బలము
తనవెంట నడువ నుత్తమహయంబొకటి
చ[6]నుదెంచి తాపసాశ్రమభూమిఁ దిరుగఁ
గనుఁ[7]గొని యాతురంగములలాటమునఁ
గనకపత్రిక లీలఁ గనుఁగొని లవుఁడు
యిదె[8] వీరుఁడగు రాఘవేంద్రుని హయము
కది[9]సి శౌర్యంబునఁ గని పట్టనొప్పు

---

1. ఖ. నరులతోడనుఁ గూడు.
2. ఖ. పాటిల్లె.
3. ఖ ననివెరవున్నది.
4. ఖ. మనములోపల భీతి మఱియుండులేక.
5. ఖ. ఘోటకరథికసంకులమైన బలము.
6. ఖ. చనుదెంచి యావనాశ్రమభూమిఁ దిరుగ.
7. గనుఁగొన.
8. ఖ. యిది.
9. కదిసి శౌర్యంబునఁ గనిపట్టుటొప్పు.

నని యందు వ్రాసిన యక్షరపంక్తిఁ
గని "యేను వీరుండఁ గానకో!" యనుచుఁ
దడయక తురగంబుఁ దరువుతోఁ గట్టి
కడలేని సేనలఁ గడతేర్చి పుచ్చి
తురగరక్షకుని శత్రుఘ్నునిఁ గూ[1]ల్చి
శరపరంపరల ల[2]క్ష్మణుశక్తినణఁచి
భరతుని రామభూపాలశేఖరుని
వ[3]రబలంబులతోడ వసుధపైఁ గూల్చి"
న[4]నిన హాహారవంబడరించి మౌని
జననాథ! మునులతోఁ జనుదెంచి యెదుర
సముచితానుష్ఠానసమయంబెపోలె
స[5]ముదగ్రకుశలవక్షతకాండ మగుచు
నరు[6]దారఁ జొరరాని యడవియుబోలె
శర[7]భకేసరిగజసమవేత మగుచుఁ
గా[8]రుమించులతోటి గగనంబెపోలె
యారక్తధారాధరాకీర్ణ మగుచు

1. ఖ. గెలిచి.
2. లక్ష్మణువిదళించి
3. ఖ. నరిబలంబులతోడ నవనిపైఁ గూల్చి.
4. నని మహాహావరవంబడరించి మౌని.
ఖ. ననిన హాహారవంబడరించె మౌని.
5. సముదగ్రకుశలవాక్షతకాండమగుచు.
6 ఖ. నరుదేర.
7. ఖ. శరభకేతన.
8. కారుమించులనాటి గగనంబెపోలె.

నరనాథుఁ బా[1]లించు నగరంబె పోలె
శరపరిఘోద్యానసంకీర్ణ మగుచు 1140
ధృతరాష్ట్రనందను తేజంబె పోలె
హతధర్మగుణవిజయాదిత్యఁ మగుచుఁ
బా[2]లుపొంద ఢాకినీభూతభేతాళ
కలకలధ్వనికల కలని కేతెంచి
యనుజులతోఁగూడ నవ[3]శుఁడై యున్న
జననాథుపై మంత్రసా[4]మర్థ్య మమరఁ
దలకొన్న భక్తితోఁ దనకమండలము
జలముల మంత్రించి చల్లెఁ; జల్లుటయుఁ
ద[5]మ్ములతోఁగూడఁ దనమూర్ఛఁ దెలిసెఁ
గ్రమ్మర నిదుర[6]మేల్కొనినట్లు విభుఁడు.
ఇంద్రాదిసురసంఘ మెలమితో రామ
చంద్రుపై సురపుష్పజాలవర్షముల
నరుదారఁ గురియించి రమృతంబుసోన
బెరయించి మొరయించి పృథులదుందుభులు,
కామధేనువు మింటఁ గదిసి యారామ
భూమీశుపై దుగ్ధములు నిండఁ బిదికె

---

1. పాటించు.
2 పొలుపొందదానికి భూతభేతాళ.
3. ఖ. నవనిపైనున్న.
4. ఖ. సామర్థ్యముగను.
5. దమ్ములతోఁగూడఁ దనమూర్ఛఁదెలిసి.
6. మేల్కనినట్లు.

నప్పుడు[1] జీవితులై రాజసుతులు
తెప్పి[2]ఱిరగచరుల్ తేఱిరి చరులు
బ్రదికె నశ్వములు స[3]త్రాణించె గరులు
ముదమందె భల్లూకములు మూ[4]ర్ఛఁదెలిసి
యమృతసిక్తాంగులై యందఱుఁ గనక
విమ[5]లవర్ణంబుల విలసిల్లిరంత.

—: శ్రీరాముఁడు వాల్మీకివాక్యములచే శాంతిఁబొంది
కుశలవులఁ గని సంతసిల్లుట :—

ఆ[6]సమయంబున ననుజులతోడ
నాసీనుఁడైన సీతాధిపుతోడ
వాల్మీకి నిర్మలవాక్యుఁడై పలికె.
"తాల్మిఁ గైకొను రామ! ధరణీశచంద్ర!
గాసిల్లి యిపుడు నీఘనకుమారకులు
చేసిన నేరమిఁ జిత్తంబులోనఁ
ద[7]లఁపక నీదైన దయఁజూడు మింక
నల[8]ఘుతేజోధామ! అభిరామ! రామ!

---

1. ఖ. అప్పుడు జీవితులై రాదినురులు.
2. దెప్పిరిగరచరుల్ దేరిరిచరులు.
3. ఖ. సత్రాణించెఁ గరులు.
4. ఖ. మూర్ఛఁదేరి.
5 ఖ. విమలవర్ణంబులై వెలసిల్లిరంత
6. ఖ. నాసమయంబున ననుజులుఁదాను.
7. ఖ దలఁపక కృపఁజూడ తగఁ గృపానాథ!
8. ఖ. అలఘుశౌర్యోద్ధామ! అభిరామ! రామ!

అపరాధిఁ గని సేయు నాశాంతికంటెఁ
దపమేది? రఘునాథ! త్రైలోక్యనాథ!
అటమీఁద నీసుతు లత్యంతబాలు
ర[1]టక్రింద మీచంద మెఱుఁగ రేమియును
ననఘాత్మ! గుణియైన నవగుణియైనఁ
దన[2]యుల కలుగునే తండ్రి యెచ్చోటఁ
దన[3]యుల తేజంబు తత్పరాక్రమము
జనకుని కరయంగ సంతోషకరము
ధరణీశ! తాటకదర్పంబు మా[4]న్చి
పరశురాముని బాహుబలము వారించి 1160
ఖరుఁ ద్రుంచి దూషణు ఖండించి మూఁడు
శిరములవాని నిర్జించి మారీచు
మడియించి యావాలి మర్దించి జలధిఁ
గడుఁ గట్టి యాకుంభకర్ణు భంజించి
దశకంఠు విదళించి తనరు నీయలుక
శి[5]శువులమీఁద రుచించునే చెపుమ
రామ! నీవాదినారాయణమూర్తి
వామహాదేవి సీతాంగన లక్ష్మి

---

1. లిటక్రింద నీచంద మెఱుఁగ కేమియును
2. దనయులకలుఁగునే తండ్రియచ్చోట
ఖ. తనయులకలుగుఁనే తండ్రియివ్వోట.
3 ఖ. తనయులతేజంబు తత్ప్రకారంబు
4. ఖ. మాపి.
5. శిశువులమీఁద రుదించునే రామ !

ఘనులైన వీరు నీగర్భసంభవులు
జననాథ! నీకెట్లు సాధ్యు[1]లయ్యెదరు?
ధారుణీశ్వర! నీవు తలఁపు నామాట
నోరామ! పరమార్థ మూహించి చూడు
నీతలంపునఁ జూడు నిజముగా నోడి
నాతఁడెవ్వఁడో గెల్చినాతఁ డెవ్వండొ
యె[2]ట్లును రఘురామ! యియ్యకార్యంబు
పు[3]ట్టునె నేనున్న, భూమిజ విన్నఁ
బనివడి వరుణుండు ప్రార్థింప నతల
మున కేఁగి యజ్ఞార్థమున నుంటి నచట
నజ్ఞాత మిదినాకు" ననిన వాల్మీకి
విజ్ఞాపనస్థితి విని వివేకించి
జగతీశ్వరుఁడు సంతసమ్మునఁ బులక
లెగయ నిట్లనియె మునీంద్రునిఁ జూచి
"తన[4]ర నీమాటలు తప్పవన్నియును
మనమున నొండనుమానంబు లేదు
ఓకరుణాత్మ! నీవున్న నీభంగి
మాకు నీకలహంబు మాలోన నగునె!
రయమున శిశువుల రప్పించు చూడఁ
బ్రియము పుట్టెడు నా[5]త్మఁ బెద్దయు నేఁడు"

1 సాధ్యమయ్యెదరు.
2. ఖ. అట్లును రఘురామ! అయినకార్యంబు.
3. ఖ. పుట్టునే నావనభూమి నేనుండ.
4. ఖ. అనఘాత్మ! తప్పదీవాడినమాట.
5. ఖ. నాకుఁబెద్దయువేడ్క.

అ[1]నిన శిష్యులఁ బంచి యారామచంద్రు
తనయుల [2]రప్పించెఁ దాపసోత్తముఁడు
నరనాథ! తుంబురునారదులనఁగఁ
గరముల వీణెలఁ గ[3]రమొప్పఁ బట్టి
మది వికసింప రామాయణంబెలమిఁ
జ[4]దువుచుఁ గోమలస్వరములు మెఱయఁ
దనుఁబోలు నిత్యసౌందర్యంబుతోడఁ
దనువులు ధరియించి తనమ్రోల నున్న
యావీరముఖ్యులు యాత్మజులగుట
భా[5]వించి యారామభద్రుండు తెలిసి
సన్నపు నగ వాస్యచం[6]ద్రబింబమున
వెన్నలగతిమీర వేడ్క నందనులఁ
గరమొప్పఁ బలుమాఱుఁ గౌఁగిటఁ జేర్చి
ప[7]రమానురక్తుఁడై పలికెఁ దమ్మునికి
జానకీవదనలక్షణము లీఘనుల
యా[8]ననంబుల నందమయ్యె సౌమిత్రి!
దే[9]హంబు లరయ విదేహతనూజ

1. యతని శిష్యులఁబంచి యారామచంద్రు
2. రప్పించి.
3. ఖ. గరమొప్పఁబూని.
4. ఖ. జదువుచుఁ గోయిలస్వరములు మెఱయ.
5. ఖ. భావింప.
6. ఖ. చంద్రబింబంబు.
7. ఖ. పరమానురక్తిమై పలికె దమ్ములకు
8. ఖ. యాననంబునఁ గానరయ్యె సౌమిత్రి!
9. ఖ. వైదేహితనూజ.

దేహంబునట్లు సందేహంబు లేదు,
కోమలస్వరము లాకో[1]మలియట్ల
నీమహాత్మ్యలఁ జూచి యొ[2]సఁగెడిఁ బ్రియము,
తడయక మంను సీతావియోగాగ్ని
నడఁగించె వీరలయా[3]లింగనంబు,
వి[4]డువని వగలతో వెచ్చిన హృదయ
ముడుకారి సం[5]తోషమొందె నాకిపుడు,
అఖిలనిర్జరులును 'న[6]ఖిలవానరులు
నఖిలదానవులును నఖిలమానవులు
నఖిలలోకులుఁ జూడ ననుపమామోఘ
నిఖి[7]లాస్త్రవైచిత్రి నెఱవేది ఘనులు
హరిహరబ్రహ్మశక్రాదులకైనఁ
బరికింపరాని మద్బాణజాలములఁ
దాలఁగక నాతోడఁ దా[8]డరి నన్నిట్లు
గె[9]లిచిరి వీరొక్క క్రీడయొపోలె
కావున వీరు నాకాంచిన తనయు

1. ఖ. కోమలిరీతి.
2. యొసఁగినప్రియము. ఖ. యొసఁగెటిప్రియము.
3. యాలింగనముల.
4. విడువనివగలు గావించిన హృదయ
5. ఖ. సంతోషమొదవె నాకిపుడు.
6. ఖ. నఖిలమౌనులును.
7. నిఖిలాస్త్రవైచిత్రనెఱవేది ఘనులు.
   ఖ. నిఖిలాస్త్రవైచిత్రినెఱపెన ఘనులు
8. ఖ దోడరినయట్ల.
9. ఖ. గెలిచిరి వీరొక క్రీడయుబోలె.

తే[1]విధంబున నిజంబెసఁగ సత్కులము ?
అ[2]రసి నీవెఱుఁగుదే యవనిజసుతుల
చరితంబు వినుపింపు సకలంబు నాకు"
అని[3] రాఘవుఁడు వల్క నపుడు సౌమిత్రి
యనియెఁ జేతులు మో[4]డ్చి యందఱు వినఁగ
"యనఘ ! ప్రసూతికి నాసన్నమైన
జనకజ నేఁదెచ్చి జాహ్నవిపొంత
నడవిలో విడిచితి నపుడు మూర్ఛిల్లి
పడియె నంతటిలోనఁ బనివింటి మగుడ
నవనిజవృత్తాంత మటమీఁద నెఱుఁగ
నవనీశ ! మీయాజ్ఞ యట్టిదె కాదె."

—: వాల్మీకి శ్రీరామునకుఁ గుశలవుల జన్మప్రకారముఁ దెలియఁజెప్పుట :—

అనవుండు వాల్మీకి యనియె నా[5]క్షణము
"జన[6]వర! నేమును సకలశిష్యులునుఁ
బరికించి య[7]జ్ఞయూపమునకుఁ దగిన
తరువులనఱక నంతనఁ బోవుచుండి
యనుపమంబగు నొక్కయార్తనాదంబు

1. ఖ. నేవిధంబున నిజంబెనఁగెఁ దత్కులము.
2. అరసినీ వెఱుఁగదే. ఖ. అరసినీవెఱుఁగవే
3. ఖ. ననియెరాఘవునకు ననియెసౌమిత్రి
4. మొగిచి.
5. ఖ. నాక్షణమె.
6. ఖ. జననాథ ! యేమును
7. ఖ. యజ్ఞయూపములకుఁదగిన

వి[1]ని యచ్చటికిఁ బోయి వేదన నొంది
తలవీడ నేడ్చుచుఁ దల[2]రి దైవంబు
సొలయుచు దెసలెల్లఁ జూచుచు నచటఁ
గందిన కదళీకాకాండంబులీలఁ
బెంధూళి పైఁగప్పి పృథివిపై నున్న
యవ[3]నిజఁ బొడఁగాంచి యార్ద్రవాక్యముల
ధవళాక్షి! యెవ్వరిదాన? వీవనిన
ననుకంప జనియింప నార్తి రెట్టింప
జనకజ వ[4]లికె నాసమయంబునందు
"జనకుఁగూఁతుర రామజనలోకవిభుని
వనితను దశరథేశ్వరుని కోడలను
నా[5]పేరు జానకి ననువారిఁ బాపి
పా[6]పపుదైవంబు పంపెఁ గానలకు
న[7]పవాదభీతుఁడై యధిపతి నన్ను
నెపములేకయుఁ గడు నిర్దయబుద్ధిఁ
దనతమ్ముఁడగు సుమిత్రాతనూభవునిఁ
బనుప నాతఁడు నన్ను వ[8]నివడి తెచ్చి

---

1. ఖ వినియచ్చటికి నేఁగి వెరవుననొంది
2. ఖ. దలఁకి.
3. యవనిజఁ బొడఁగాంచి యార్తవాక్యముల.
4. ఖ. పలికె.
5. నాపేరు జానకినని వారిబాపి. ఖ. నాపేరుజానకిననువారు నెల్ల.
6. పాపిదైవంబు పాల్పుకానలకు. ఖ. బాపెఁపాపపువిధి పరఁగంగనన్ను.
7. నపరాధభీతుఁడై యధిపతినన్ను.
8. ఖ. వనిబడఁ దెచ్చి.

యడవులఁ ద్రోచి నేఁడరిగె నో తండ్రి!
కడు దిక్కుమాలితిఁ గావవే" యనుచు
వివరింప నామాట వినియ నేకాదు
రవికులాధీశ్వర! రాయైనఁ గరఁగు
నడ[1]లును వారించి యాలోకమాతఁ
దోడుకొనిపోయి యిం[2]తుల కొప్పగింప
నొ[3]కపర్ణశాలలో నుండె మాయాజ్ఞ
నొకదినంబెండుగా నుడుగనివగల
నతినిష్టఁ గందమూలాహారనియతిఁ
గతిపయదినములఁ గ[4]డప నంతటను
సుముహూర్తమున రాత్రి సుదతి భాగ్యమున
నమడలఁ గాంచె రామావనీనాథ!
ఒ[5]గి జాతకర్మంబు లొనరఁ జేయించి
ని[6]గమోక్తవిధి నుపనీతులఁ జేసి
వేద[7]పారంగుల వివిధశస్త్రాస్త్ర
వేదు[8]లఁ గావించి వీరికే నడిద

---

1. యడలువారించి యాయాలోకమాత
 ఖ. నడలువారించిన నాలోకమాత
2. యింతుల కొప్పగించి. ఖ. యింతుల కప్పగించి.
3. యొకపర్ణశాలలోనుండి మాయాజ్ఞ. ఖ. యొకపర్ణశాలల
4. గడపునంతటను.
5. యొగిజాతకర్మంబు లొనరింపజప్ప
6. నిగమోక్తవిధి నుపనీతులఁ జేయ.
7. ఖ. వేదపారఁగులఁ గావించి మహాస్త్ర
8. వేదులఁగావింప వీరికేనద్ద.
 ఖ. వేదుల.........వీరికెల్లడల.

జాలంబు లిచ్చితి జననాధ! నేను
చాలశౌర్యముల విస్తారులై రంత,
జన[1]నాథ ! నీవు నీజనకుండు నేను
జన[2]కాధిపుఁడు నొక్కచందంబె కాన
వినుము నాచేత నీవిహితకృ[3]త్యంబు
లొనరింపఁబడియె రామోర్వీశ!'' యనియె.
అ[4]నిన దయాబుద్ధి నంగీకరించి
''మని[5]చితి శిశువుల మము విచారించి
ధాత్రి[6]లో నీప్రసాదమునఁ కెవ్వారు
పాత్రు[7]లౌదురో వారు పరమపావనులు''
అని మునిఁ గొనియాడి యాదశరథుని
తనయుఁ డప్పుడు నిజతనయులఁ జూచి
''మీ[8]రెవ్వరెచ్చోట? మెలఁగుదు రిపుడు
యేరాజనందను? లేమి నామములు?
వినయలక్షణగుణాన్వితుల[9]నాహితుల
వినుపింపవలయు మీవృత్తాంత'' మనిన

---

1. జననాథ! నీవును జనకుండు నేను.
2. ఖ. జనకాధిపుండొక్క చందంబెకాన
3. ఖ. కృత్యములు.
4. ఖ. అనినదయాంబుధి యంగీకరించి
5. ఖ. మనిచితి శిష్యుల మనివిచారించి.
6. ధాత్రిలో నీప్రసాదమున కింపారు.
7. పాత్రులౌదురువారు పరమపావనులు
8. మీరెవ్వరిచ్చోట మెలఁగుదురిపుడు.
ఖ. మీరెవ్వరెచ్చట మెలఁగునురిపుడు.
9. నాహితుల.

నాదయానిధితోడ నారాముతోడ
నాదిత్యకులుతోడ ననిరి నందనులు
"వాల్మీకిసంయమీశ్వరుని శిష్యులము
క[1]ల్మషరహిత నీకామిని యగుచుఁ
ద[2]గు భూమితనయానందనుల మిద్దఱము
జ[3]గతి నారూఢిఁ గుశలవులమేము
నీకు ద్రోహుల మవనీతచిత్తులము
కాకుస్థ! మాతప్పుఁ గావవే తండ్రి!"
అని యిద్దఱునుఁ దనయడుగులఁ బడినఁ
గనుఁగొని యందంద కౌఁగిటఁ జేర్చి
బాలురవదనచుంబనముఁ గావించి
యాలోకనప్రీతి నభయంబు లిచ్చి
"అనిశంబు మా[4]చిత్త మలరించి మీరు
ననఘులాయుష్మంతులై యుండుఁ" డనియె. 1230
అనినను వాల్మీకి యారామచంద్రుఁ
గనుఁగొని పలికెను ఘనదయమీరఁ
"గడుఁదప్పుసేసిన కష్టులుగాన
విడువక రక్షించు వీరి నీవింక
లా[5]లింపుఁడిట్లు బాలకుల నింతటికి

1. ఖ. కల్మషరహిత నీకామినియైన
2. ఖ. ధారుణితనయనందనుల మీజగతి.
3. ఖ. నారూఢిఁ గుశలవులను వారుమేము.
4. ఖ. మాచిత్త మలరించుమీరు.
5. ఖ పాలింపుమిప్పుడా బాలురన్నిటికి

మూ[1]లంబు నీవన మోఘంబుగాఁగ
న[2]రయంగఁ గర్తవ్య మవనిని మొదలఁ
బరికించినాఁడ వీబాలుర ననఘ!''
అ[3]ని ''లక్ష్మణు భరతుకందంద మ్రొక్కు''
డని[4] శిష్యులనుఁ బల్కె నామహామౌని,
క్రమమున వారు వారల[5]కెల్ల వంద
నములాచరింప నానాప్రకారములఁ
గన్నపుత్రులకంటెఁ గరుణతో వారు
నన్నపుత్రులఁ దే[6]ల్చి రానందజలధి.
అనురక్తి సుతులతో నశ్వంబుతోడ
ననుజులతోడ సైన్యావళితోడఁ
గదలి వాల్మీకితో ఘ[7]నతతోఁగూడ
సదయాత్ముఁడై యజ్ఞశాలకు వ[8]చ్చి
బలసి రాజులుఁ గ[9]పిబలము దానవులుఁ
గొలువంగఁ గొలువుండి కువలయేశ్వరుఁడు
పరమనిశ్చయబుద్ధిఁ బలికెఁ గేల్మోగిచి

---

1. ఖ. మూలంబుఁ జెప్పెద మోఘంబు గాఁగ
2. ఖ. నరయఁగ ర్తవ్య మేమని నీవె మొదల.
3. ఖ. అనిలక్ష్మణునికైకయాత్మజు వారి
4. మని యనుజులఁ బల్కె నామహామౌని.
   ఖ. యనుజునుఁ బలికె మహామునియప్పుడు.
5. ఖ. వారలకెల్ల దండ.
6. ఖ. దెచ్చి యానందజలధి.
7. ఖ. ఘనులతోఁగూడ.
8. వచ్చె.
9. ఖ. గపిపతులు దానవులు.

వరతపోనిధియైన వాల్మీకితోడ.

— శ్రీరాముండు జానకిఁజూడఁగోరుట ; వాల్మీకి
సీతను శ్రీరామునకొప్పగించుట :—

"అనఘాత్మ ! నీపుత్రియైన యాసీత
వినుతపాతివ్రత్యవిఖ్యాతశీల
రప్పింపు ! లంకాపురంబున నాఁడు
చెప్ప నచ్చెరువైన చిచ్చులోఁ జొచ్చె
వనజసంభవశంభువరదివ్యమనుజ
దనుజులు సాక్షిగాఁ దామరసాక్షి,
అ[1]త్తెఱంగెఱుఁగక యత్యంతజనులు
చిత్తంబులో విశ్వసింపక యురక
యాడుదు[2] రతిధూర్తులై యంతనంతఁ
గూడి మూఁకలుగట్టి కుటిలచిత్తముల
ము[3]గుద నాగతి నాడు మూఢుల నెల్లఁ
దె[4]గువమై నోరు ముద్రించినరీతి
సీతపాతివ్రత్యశీలంబె కాదె
యాతరి నారాయణాస్త్రంబుఁ దునిమె
నే[5]రూపగతినైన నిందటఁ దెలుపఁ

1. ఖ. నత్తెఱుంగెఱుగమి నత్యంతజనులు
2. రతిధూర్తులై యంతగూడి
3 ముగ్ధనాగతినాడు మూఢుల నెల్ల
4. ముగ్ధవమైనోళ్లు ముద్రించినట్లు.
5. ఖ యేరూపమునసైన నిందఱఁదెలుపఁ

గారు[1]ణ్యానిధి నీవ కర్తవు మాకు ”
అనిన వాల్మీకి మహామునీశ్వరుఁడు
జనియె నప్పుడు నిజాశ్రమభూమికడకు
ధరణిజ తనకూర్చుతనయులు చన్న
తెరువుఁ జూచుచుఁ గడు దీనాస్య యగుచుఁ
బలుచబాఱినమేను బాష్పపూరములు
వెలితి తోఁపనియట్టి విపులనేత్రములుఁ
జెదరిన వేణియుఁ జెక్కుటద్దములఁ
గదిసిన పాణియుఁ గలిగి యద్భుతము
పరమవేదన మూర్తిభరియించినట్లు
విరహంబు రూపమై వెలయు నున్నట్లు
బొగులుచు నుండి యప్పుడు మునీశ్వరుని
జగతీతనూజ యప్పుడు కాంచి కదిసి
పదములఁ బడి క్రేపుఁబాసి పెల్లొరలు
మొదవుచందంబున ముగ్ధ యేడ్చుచును
“అయ్య! నానందను లమడలు శిశువు
లె[2]య్యెడ నేరీతి నెట్లున్నవారో!
ప[3]తివియోగమెకాదు పాటిల్లెనాకు
సుతువియోగంబునుఁ జూచితిఁ దండ్రి!
యె[4]ఱుకమై యొప్పించి యేలయ్య? వారి

1. ఖ. గారుణ్యానిధి మీరు కర్తలుమాకు.
2. ఖ. లెయ్యెడఁ జిక్కిరో! యెట్లున్నవారో!
3. ఖ. పతివియోగము కాదె పాటెల్లనాకు.
4. యెఱుకమైనొప్పించితే నయ్యబారి

గొఱ్ఱి[1]యలచందానఁ గొనిపోయితీవు
నానోచికాంచిన నాకుమారకుల
మాననీయుల నీతిమంతుల హితుల
నెచ్చోట నాకృపాహీనులచేతి
కిచ్చి వచ్చితి చెప్పవే మునినాథ!
కరుణతో నీవ సంస్కారంబు లెల్లఁ
బరికించియునుఁ గాంచి పాలించి పెంచి
యెక్కడ? దాఁచితి వెఱఁగింపు నాకు
నక్కడి కేఁగెద నఖిలైకవంద్య!”
అని సీత వలుకంగ నమ్ము[2]నీశ్వరుఁడు
కనుగవ బాష్పములు గ్రమ్మ నిట్లనియె.
“తల్లి! నన్నిట్లాడ ధర్మమే! నీకుఁ
జెల్లఁబో యిట్లేల సేయుదు నేను
యే[3]మి సేసితి? నిప్పు డెఱుఁగక నన్ను
నీమాటలాడితి వింతయె కాక
వనిత! శోకార్తుల వా[4]క్యంబు లెందు
ఘనులకు నరయ వి[5]గ్రహములుగావు
సుభగ! సీతనయులు శుభలీల రామ

1. గొఱియలచందానఁ గొనిపోయినీవు.
ఖ. గొఱ్ఱియలచందానఁ గొంపోయినీవు.
2. ఖ. నామునీశ్వరుఁడు.
3. యేమిసేసితి విప్పుడెఱుఁగక నన్ను
ఖ. యేమిసేసితి యిప్పుడెఱుఁగక నన్ను
4. ఖ. వాక్యంబులెల్ల.
5. ఖ. నిగ్రహములుగావు.

విభునొద్ద నున్నారు వేరొండు లేదు
ఆత్మసమానుల కాత్మనూనులకు
నా[1]త్మేశులకు నేల యలుఁగు? నీవిభుఁడు
వగువకు నీవు నావాక్యంబు నమ్ము
జగతీతనూభవ! చను దెమ్ము లెమ్ము
మానిని! నిన్ను నీమగనితోఁ గూర్తు
నానరనాయకు నానతిఁబూని
యని పల్కి జానకియెడలార్చి ప్రమద
మినుమడింపఁగ నప్పుడెలమిఁ దోడ్కొనుచు
స[2]రసిజాననఁ గ్రతుశాలకుఁ దెచ్చి
త[3]రణివంశోత్తముదగ్గర నుంచె.

—: శ్రీరాముఁడు పుత్రదారాదులనుఁ దోడ్కొనివచ్చి యశ్వమేధాధ్వరమును ముగించి సుఖముగా రాజ్యమేలుట :—

లలన చూడఁగ నొప్పె లలితలావణ్య
జల[4]ధియై యారామచంద్రుని యెదుర
జనకజతో ననుజన్ములతోడ
ననురాగమునఁ బొంది యారామవిభుఁడు
క్ర[5]తు వశేషంబుగాఁ గావించి మాని

---

1. ఆత్మేశులకు నేల యగునీవిభుండు.
ఖ. నాత్మనీయులకేల నలుఁగు నవ్విభుఁడు.
2. సరసిజానన గ్రతుశాలకుఁదెచ్చి.
3. ధరణివంశోత్తము దగ్గఱనుంచె.
ఖ. ధరణివంశోత్తముఁ దగవుతోఁ గూర్చా--
4. ఖ జలధియై యాయన రామచంద్రుని యెదుర
5. క్రతు వశేషంబు గావించమాని. ఖ. క్రతు వశేషంబుగాఁ గావించి విప్ర.

తతులకు దక్షిణల్ తని[1]యంగ నిచ్చి
తనకీర్తిచంద్రికల్ ధరయెల్ల నిండ
జ[2]నలోకచంద్రుండు జగమేలుచుండె.
సము[3]దగ్రమగు ప్రజాక్షయము యుగాంత్య
సమ[4]యంబునం దవశ్యంబగుఁ గాన
నదికారణంబుగా నాహవంబయ్యెఁ
ద్రిదశేంద్రసుతునకు దినపసూనునకు
శశికులతిలక! యా[5]సమరంబుఁ జూడఁ
గుశరాములకుబోలె ఘోరమై తోఁచె.

—: కథోపసంహారము :—

తనయులకునుఁ గ[6]న్నతండ్రికే కలిగె
నని యని యెఱిఁగింపఁడయ్యె వాల్మీకి
అది మీకుఁ జెప్పితినని సూతుఁడపుడు
ముదమొప్ప శౌ[7]నకముఖ్యుల కనియె
"నె[8]ప్పుడు యీకథ నేనరోత్తములు

---

1. తనియంగనిచ్చె. ఖ. తనియంగనొసఁగి.
2. ఖ. జనలోకనాథుండు.
3. సముదగ్రమగు బ్రజాక్షయముగానిత్య
   ఖ. సముదగ్రమగు ప్రజాక్షయను యుగాంత్య
4. సమయంబునం దవశ్యంబుగాఁగ
   ఖ. సమయంబునం దవశ్యంబుగాన.
5. ఖ. యాసమయంబు చూడ
6. గన్నతండ్రిచేఁ గలిగె.
7. శౌనకమునులకు ననియె.
8. ఖ. యిప్పుడు యీకథ నీనరోత్తములు

చె[1]ప్పిన వినిన వ్రాసినఁ బేరుకొనిన
శ్రీనొంది పుణ్యులై చిరజీవులగుచు
మాన్యక సుతులతో మనుమలతోడ
స[2]ఖులతోడనుఁ బ్రాణసఖియలతోడ
న[3]ఖిలసుఖావాప్తి నలరుచుండుదురు
దురితవిముక్తులై తోయజనయన
కరుణఁ గాంతురు నిత్యకైవల్యపదము. "
అనుచు సూతుఁడుఁ జెప్ప నాశౌనకాది
మునులందఱును డెందముల మెచ్చి రనుచుఁ
గృతులకు హెచ్చు సంగీతసాహిత్య
చతురుండు తిరుమలాచార్యశిష్యుండు
నతలోకుఁడగు నందనగరాగ్రహార
పతి లావనూరి యాఖళమంత్రిసుతుఁడు
రామకథావిశారదుఁడైన సుకవి
రామనార్యుఁడఁ గవిరాజమిత్రుండ
నీకుఁ బ్రియంబుగా నృపసార్వభౌమ !
కాకుత్స్థకులరామ ! కల్యాణరామ !
సమధురరీతిమై జైమినిభార
తమున విస్తరము విస్తారంబుగాఁగ
నల[4]వడఁ గుశలవోపాఖ్యానకమునఁ

---

1 ఖ. చెప్పిన వినినఁ జేర్కొనిన వ్రాసినను.

2. ఖ. సఖులతోఁ దమప్రాణసఖులతోఁగూడ.

3. ఖ. నఖిలసుఖాబ్ధిలో నలరుచుండుదురు.

4. నలవడఁ గుశలవోపాఖ్యానమలమి.

బ[1]లికితి నుత్తరభాగంబు సరవి
(నాచంద్రతారార్క మాచక్రవాళ
మాచంద్రతారార్కమై యొప్పుఁగాత.)* 1294

ఇది యుత్తరభాగము
శ్రీరామార్పణమస్తు.
సమాప్తము



1. బలికి నుత్తరభాగంబు సరితివి.

ఖ. బలికితి నుత్తరభాగంబు వినుము.

* ఈ పద్యము మాతృకలోనిదికాదు. ఖ. గ్రంథములోనిది.

PRINTED AT RATHNAM PRESS MADRAS-1.